# కొత్త కోడలు

[కరుణారసాత్మకమైన సాంఘిక బంగాలీ నవల]


రచన:

నిరుపమా దేవి

స్వేచ్ఛానువాదం:

వెలగా రామకోటయ్య చౌదరి



1956

ప్రథమ ముద్రణ :
2000 కాపీలు

ఒక రూపాయి
సెప్టెంబరు 1956

ముఖచిత్రం :
పి. ఆర్. రాజు

సంపాదకులు :
వెలగా వసుంధరాదేవి
,, రామకోటయ్యా చౌదరి

# 1

అదొక చిన్నవూరు. దానిచెంతనే ఒక నది. వేసవికాలమయినందున అంతగా నీరులేకపోయినా స్వచ్ఛందమైన సన్నని నీటిధారమాత్రం వేగంగా ప్రవహిస్తూవుంది. దాని ఒడ్డునేవున్న ఆవూరి జమీందారుగారి పెద్దతోటలో దట్టంగా పచ్చ పచ్చగావున్న కొబ్బరి, జామ, దానిమ్మ, మామిడి మొదలైన ఫలవృక్షాలు సాయంకాలపు మంద పవనాలకు మెల్ల మెల్లగా తలలూపుతూవున్నాయి. గుబురుగావున్న ఆ చెట్లచాటున దాగివున్న శివాలయము కంటికి కనిపించకపోయినా దాని గోపురాగ్రముపైనున్న యిత్తడి త్రిశూలం పశ్చిమాద్రిని దాగుకొనబోవు లేతసూర్యుని ఎర్రకిరణాలు పడడంవలన తళతళ మెరుస్తూ చూపరులకన్నుల కింపుగా కనబడుతూవుంది.

ఆ నది సమీపంలో మనుష్యసంచారం ఎక్కడా కనిపించడంలేదు గాని ఒక బాలిక మాత్రం నదిఒడ్డున వున్న రేవుమెట్లపైనుండి ఒక్కొక్కటిగా క్రిందికి దిగివస్తూవుంది. ఆమె చంకలో ఒక యిత్తడికడవ భుజంమీద పొడిఅంగవస్త్రం, ఒకచీర వున్నాయి. పూర్తిగా క్రిందిమెట్టువరకూ దిగి ఎవరికోసమో ఎదురుచూస్తున్నట్లు తలెత్తి నలువైపులా కలయచూచింది. వస్తానన్నవ్యక్తి రాకపోయేటప్పటికి భుజంమీది పొడివస్త్రం ఒడ్డునపెట్టి నదిమధ్య నీటి ప్రవాహంలో కూర్చుని నోటినిండా నీరు పుక్కిలించివేస్తున్నదే కాని ముఖాన్నిబట్టి చూస్తే ఏదో విచారసాగరంలో మునిగివున్నట్లుగానే ద్యోతకమౌతుంది. ఆదేసమయానికి మరో బాలిక రేవుదగ్గరకువచ్చి మొదటిబాలిక పరధ్యానంగా వుండడం గమనించింది. తానుకూడా మెల్ల మెల్లగా మెట్లుదిగి నీటిలో ప్రవేశించి కొంచెం చప్పుడు చేసింది. ఏదో చప్పుడైనట్లు తెలిసికొని మొదటిబాలిక వులిక్కిపడి వెనుకకు తిరిగిచూచి నవ్వుతూ, "ఓ! నువ్వా! ఎవరో అనుకుని భయపడ్డాను" అంది. రెండోబాలిక నీటుగా తల పైకెత్తి గంభీరంగా, "భయపడ్డావా! అవును పాపం, పాలుతాగుతున్న

పసిపాపవుగదూ! అసలు నీ మనస్సు యిక్కడవుంటేగా నేను వచ్చినట్లు నీకు తెలిసేందుకు. అది సరేగాని ఎంతసేపయిందే నువ్వువచ్చి? అని ప్రశ్నించింది.

“కొంచెంసేపే అయింది. రోజూ పెందలాడే వచ్చే దానివి యివ్వాళింతగా ఆలస్య మెందుకయింది?” అని అడిగింది మొదటిబాలిక.

“నా ఆలస్యానికి కారణం తర్వాత చెప్తాలేగాని ముందు నాకొక విషయం చెప్పు. ఎందుకివ్వాళ ఏదో పరధ్యానంగా వున్నావ్? దేన్నిగురించి నీ ఆలోచన?”

మొదటి అమ్మాయ్ చిరునవ్వు నవ్వుతూ, “ఏముందీ ఆలోచించడానికి?” అంది.

“అయితే యిప్పుడు నువ్వేమీ పరధ్యానంగా వుండలేదా, అమ్మ దొంగా!” అంటూ రెండో అమ్మాయ్ తన రెండుచేతుల నిండా నీళ్ళుతీసుకుని తన స్నేహితురాలిమీదకు విసరింది. అయినా దానిని లెక్కచేయనట్లుగానే మొదటి అమ్మాయ్ తన అంగ వస్త్రాన్ని వుతుక్కుంటూవుంది. రెండో అమ్మాయ్ ఆ వస్త్రాన్ని లాగిపట్టుకుని గట్టిగా అడిగింది, “నే నడిగిందానికి ముందు సమాధానంచెప్పు. అది చెప్పందే యివ్వాళ నిన్ను వదలను.”

“బాగుంది నువ్వు అడిగేప్రశ్న. ఏముంది చెప్పడానికి? దీన్ని విడిచిపెట్టు ముందు.” అని కోపంగా అంది మొదటి అమ్మాయి.

ఏమనుకుందో ఏమోగాని రెండోఅమ్మాయ్ అంగవస్త్రాన్ని వదలివేసి సాభిమానంగా ముఖం ప్రక్కకు త్రిప్పుకుంది.

తాను కోపం తెచ్చుకున్నందుకు మొదటి అమ్మాయ్ పశ్చాత్తాపపడి తనస్నేహితురాలైన రెండో అమ్మాయ్‌తో, “సరేలే, జరిగినదాన్నిక మరచిపోవే. నువ్వు మాటిమాటికి యిట్లాగే అలుగుతుంటావు. నాదే తప్పులే క్షమించు. నువ్వింక అడుగ దలచుకుం దేదో అడుగు.” అంది.

# 3

రెండో అమ్మాయిఅంది, "నువ్వివ్వాళ ముఖం ముడుచుకుని కూర్చుని ఏమిటి ఆలోచిస్తున్నావని అడిగా."

మొదటి అమ్మాయ్, "క్రొత్తవిషయాలేమున్నయ్ నీకు చెప్పడానికి? మా యింటివిషయం నీకు తెలియందేముంది? మాటి మాటికీ కా విషయాలడిగి నన్నెందుకు సిగ్గుపరచడం?" అంది.

రెండో అమ్మాయి నిర్లక్ష్యంగా నవ్వుతూ, ఓహో! యిందుకా నీ విచారం? నేననుకుందేమిటంటే బహుశా......" అని అనబోతూవుండగానే మధ్యలోనే మాట ఆపి మొదటి అమ్మాయి "అవునులే బహుశా, గిహుశా అని అనక యింకా ఏం అంటావులే నువ్వు?" అంది.

నాకొచ్చిన కష్టాలకు నేనుకాబట్టి తట్టుకొని ధైర్యంగా నిలబడగలిగాను గాని నీవయినట్లయితేనా ఏమై పోయేదానివో? నీమాదిరిగా కష్టాలకు భయపడి నే నేమైనా సన్నగా గోగుపుల్లలాగా తయారౌతూ నేమో చూడవే?" అంది రెండో అమ్మాయి.

మొదటి అమ్మాయ్ రెండో అమ్మాయివైపు తలెత్తి చూచింది. ప్రకృతి సౌందర్యాన్ని ద్విగుణీకృతంచేయుటకు ఎవరో చిత్రకారుడు యీ బొమ్మ నిక్కడికి తెచ్చి నదీగర్భాన నిలబెట్టి నాడా అనిపించింది. ఆమె విశాలనేత్రాలు చూస్తూవుంటే, మందపవనాల స్పర్శవల్ల ఆమెశిరోజాలు కొన్ని ఆమె కపోలాలపై చిందులు త్రొక్కసాగినయి. అస్తమిస్తున్న లేతసూర్యుని బంగారుకిరణాలు ఆమెపైబడి ఆమె సౌందర్యాన్ని ద్విగుణీకృతం చేస్తున్నయ్. అదృష్టదేవత హృదయంలో దయాధర్మాలకు స్థానం లేకపోయినా ప్రకృతిమాత విశాల హృదయంలో మాత్రం సదా కరుణారసస్రవంతి ప్రవహిస్తూనే వుంటుంది.

ఆ అమ్మాయ్ ఎంతో నెమ్మదిగా మృదుస్వరంతో ప్రశ్నించింది; "కమలా, నీకేం దుఃఖం? నువ్వు ధనవంతుల బిడ్డవు. కావలసినంత ధనం వుంది. ఇల్లూ వాకిలీ అన్నీ ఐశ్వర్యాలు కలిగినదానివి. తల్లి, తండ్రి, అన్నదమ్ముల మధ్య అల్లారుముద్దుగా నువ్వుంటున్నావు. నీకు సుఖాల కేమిలోటు? నిత్యకళ్యాణం పచ్చతోరణంగా

మీ యిల్లు ఎప్పుడూ నవ్వుముఖాలతో కళకళలాడుతూ వుంటుంది. నీమీద మీ యింటిలో అదరింపులు బెదరింపులు చేసేవా రెవ రున్నారు ? నీ కింతవరకూ కష్టాలంటే ఏపక్షి పేరో కూడ తెలియదు. యింకా నీ కెటువంటి కష్టాలున్నాయి ?''

"ఏమిటి ? ఏమిటి ? నువ్వు అనేది. నాకేమీ దుఃఖాలే లేవంటావా ? ప్రపంచంలో బీదవాళ్ళయి పుట్టడమే పుట్టెడు దుఃఖాలకు కారణమా ఏమిటి ?''

ఈ మాట వినేసరికి మొదటి అమ్మాయికి వంటినిండా జెర్రులు ప్రాకినట్లయింది. "అది నేను మాత్రం ఎట్లా చెప్పగలను ?'' అన్నది మహా కష్టంగా. తన నిరుపేదతనాన్ని బయటపెట్టుకోవడ మనేది ఆమె స్వభావానికే విరుద్ధం. అందువల్లనే యింకేమీ మాటలు పొడిగించక నిశ్శబ్దంగా వూరకుంది.

"సతీ ! నువ్వుకూడా కొంచెం ఆలోచించి చూడు. నేను చెప్పటమేకాదు. వచ్చిన కష్టాలు వచ్చినట్లుగానే పోక వుండవు. కాని మనోవ్యాధికిమాత్రం మందులేదని తెలుసుకో'' అన్నది కమల.

ఈ మాటకు సతి మెల్లగా ముసిముసినవ్వులు నవ్వుతూ, "అయితే నీకేదో మనోవ్యాధి పట్టుకు పీడిస్తుందనుకుంటాను.'' అన్నది.

"నేను కలవాళ్ళబిడ్డనని నువ్వే అన్నావుగా యిప్పుడు యింకా నాకేం మనోవ్యాధి ?''

చెప్పేదేదో సాఫీగా చెప్పవే కమలా ? "నేను అన్నమాట యిక మరచిపో తప్పుక్షమించు.''

"నాకు పెళ్ళికాబోతున్న సంగతి నీకు తెలిసినవిషయమేగా.''

"పెళ్ళా, ఎప్పుడు ?''

"ఇంకా ఒకటి రెండు నెలల్లోనే జరుగబోతుంది. అయితే ఎవరికిచ్చి పెళ్ళిచేస్తారన్న ప్రశ్నమాత్రం నన్ను అడుగవద్దు.'' సతి చిరునవ్వునవ్వి "అయితే నాకూ తెలుసులే. విశూ అన్నాయితోనే కదూ ?'' అన్నది.

# 5

"కాదు సతీ, అట్లా జరిగితే యింకాలేందేముంది ? ఎక్కడెక్కడినుంచో దూరపు సంబంధాలు వస్తున్నాయి." సతి ఆశ్చర్యపోయి, "విశూఅన్నాయిని తప్ప మరెవ్వరినీ పెళ్ళిచేసికోనని యిదివరలో అంటూవుండేదానివిగా మరలా ఏమయింది ? మీ అమ్మా నాన్నకి అక్కడ యివ్వాలని లేదా ?" అడిగింది.

"వాళ్ళ సంబంధాన్నిగురించి మావాళ్ళు ఎప్పుడూ అనుకోనే అనుకోలేదు."

"అయితే నీ అంతట నువ్వు కల్పించుకున్నమాటే నన్న మాటయింది. అదీ సంగతి ఎవరన్నా వింటే ఏమనుకుంటారో అని సిగ్గుకూడా లేదేమే కమలా నీకు ?"

"సిగ్గు సిగ్గంటూనే యిన్నాళ్ళూ నేను సిగ్గుతో చచ్చిపోయాను. నాకోరిక ఆ విధంగావుంటే చెప్పకుండా ఎట్లావుండేది సతీ ?"

"అయితే యిక జరుగవలసిందేమిటి ? మనసులో మాట యికనైనా దాచక మీ నాన్న అమ్మతో చెప్పవలసి వుంటుంది."

"వారి వుద్దేశమేమిటో తెలిసికోకుండా ఆ పని నేను చేయలేను. వారి వుద్దేశం తెలిసికోవాలన్నా అంత సులభమైన పని గాదు."

సతి కమలముఖంవైపు ఆశ్చర్యంగా చూస్తూ "ఎవరి వుద్దేశాలే తెలుసుకోవాలసింది ? విశూఅన్నాయి వుద్దేశాలేనా ? ఛీ, ఛీ యిటువంటి సిగ్గుమాలిన మాటలు నీనోటినుండి ఎట్లావస్తున్నయ్యే, కమలా ?" అన్నది.

"యింకా వేరేవుపాయమేముంది, సతీ ? నీకింకా పుస్తకజ్ఞానమే లేనట్లుగా కన్పిస్తుంది." అని ఆశ్చర్యంగా విరక్తిభావంతో అన్నది కమల.

"ఎందుకులేదూ ? రామాయణభారతాలు ప్రతినిత్యా పారాయణచేస్తూనే వుంటాగా ?" అన్నది సతి. యీ మాటలకు పొట్ట చెక్కలయేటట్లుగా నవ్వి ఎగతాళిగా అన్నది కమల,

"ఆ...ఆ...యికచాలు. రామాయణంలోనే ముల్లోకాలవిద్య యిమిడివున్నది కాబోలు. సరే యీ మాటలకేం గాని, సతీ! యివ్వాళ సాయంత్రం మాయింటికి వస్తావా? కావాలంటే నావద్ద పెద్దపెద్ద శరత్ నవలలూ, టాల్‌స్టాయ్, టాగూర్ నవలలు యింకా యింకా ఎన్నెన్నో వున్నయి. నీకు ఏది కావాలంటే అది యిస్తా" యిది విన్నతరువాత కొంచెం సేపటివరకు సతి మౌనంగా వూరుకుంది. తన పరిస్థితిని కమల పరిస్థితితో పోల్చుకుని దృఢస్వరంలో "నాకేమీ పుస్తకాలవసరంలేదు." అన్నది.

"పుస్తకా లవసరంలేకపోతే లేకపోయింది. వూరకనే అయినా మా యింటివైపు వస్తావా అని అడుగుతున్నా!"

"ఏమో అదికూడా చెప్పలేను. మా పెత్తల్లి ఏమీ అనకుండా వుంటేగా నేను మీ యింటికి వచ్చేటందుకు?"

"మీ అమ్మ చాల మంచిది. కాని మీ పెత్తల్లి కెందుకే యీ చిరచిరలూ బుగబుగలూ?"

"...మ్మ, యిక నేను వెళ్తాను, ఆలస్యమయితే మరలా దారిలో నానామాటలూ మొగుల్తావుంటాయి."

యిద్దరూ గబగబా మెట్లెక్కి పైకొచ్చి ఎవరియిళ్ళ కెళ్ళి పోయారు.

ప్రఖ్యాతి గాంచిన తారాపూర్ జమీందారుగారి ఏకైక పుత్రిక కమల. చీకూ చింతా లేకుండా హాయిగా కాలమెళ్ళ బోస్తూ ఆడుతూ పాడుతూవుంటుంది. బీదబ్రాహ్మణుడు రామ శంకరభట్టాచార్యుని కూతురు సతితో కమలకు స్నేహ మెలా కల్గిందో, సతిపై ఆమె కింత ప్రేమ దేనికో చెప్పడంమాత్రం చాల కష్టం. కటికదరిద్రునికూతురైన సతిపట్ల జమీందారుగారి అమ్మాయి కమలకు గల ప్రేమ, స్నేహాలుచూచి వూళ్ళో వాళ్ళంతా ముక్కు మీద వేలేసుకునేవారు. లేనివారమ్మాయితో సాంగత్యం తలపెట్టి నందుకు కమలకు యింట్లో చీవాట్లు తప్పలేదు.

"నలిగివున్న వాళ్ళం ఒదిగుండాలిసుమా! చేయాలనుకున్నా తగినవారితోనే స్నేహంచేయాలి. నక్కకూ నాగలోకానికీ

పొత్తెక్కడిది? జమీందారుగారి అమ్మాయితోనా నీ స్నేహం? యికనైనా బుద్ధి తెచ్చుకుని ఎంతలోవుండాలో అంతలో నేవుండు తెలిసిందా?" అని భట్టాచార్యయింటిలోవారు సతిని ప్రతిరోజూ తిట్టుతూవుండేవారు. పెద్దవాళ్ళ చీవాట్లకుగాని, చీదరింపులకు గాని, బెదరింపులకుగాని భయపడి వీరిద్దరు తమస్నేహాన్నిమాత్రం వదలుకోలేదు. యిద్దరూ సమవయస్కులై, అందచందాలుగలి యున్నందున చిన్నపిల్లలలో గల స్నేహభావమే వీరిద్దరి గాఢ మైత్రికి కారణం. కమలవయస్సు పదమూడుసంవత్సరాలు, సతి వయస్సు పన్రెండుసంవత్సరాలు. కలిమిలేములకుగాని, ఈర్ష్యా ద్వేషాలకుగాని వీరి పవిత్రమైత్రిలో ఎట్టిస్థానమూ లేదు.

ఇంటికి తిరిగివచ్చిన తరువాత పరుపుమీద పడుకుని కాబోయే తనవివాహాన్నిగురించి దీర్ఘంగా ఆలోచించసాగింది కమలం. పెళ్ళి అంటేనే సరి కమలకు ఎంతో వ్యాకులతగావుండేది. ఇది ఈనాటి సమస్యకాదు. గతమూడుసంవత్సరాలనుండి ఎదురౌతున్నసమస్యయిది. మూడుసంవత్సరాలనాటిమాట. ఒకనాడు నదికి స్నానానికిపోయిన కమల కాలుజారి నీటిలోపడి కొట్టుకుపోతూవుంటే భగవంతుడులాగా అడ్డుపడి ఆనాడు కమల ప్రాణాలు కాపాడి ఆమెను రక్షించాడు విశ్వేశ్వరుడు. సతికితప్ప యీ విషయం మరెవ్వరికీ తెలియదు. ఆనాటినుండి విశ్వేశ్వరుడంటే కమలకు ఎంతో ప్రేమ. విశ్వేశ్వరుడుకూడ తక్కువ అందగాడు కాదు. అవివాహితుడు. నవయువకుడు. కులం గోత్రం చూచుకున్నా అన్నీ సరిగ్గానే సరిపోయినాయి. కమలకు మాత్రం ఏం లోటు? కలవారి అమ్మాయి. అందగత్తెకూడా. అవివాహిత. ఇట్టి పరిస్థితులలో ముందు ప్రేమించుకోవడం తరువాత పెళ్ళి చేసుకోవడం మామూలుగా జరిగిపోయేవిషయమే. అయినా కమలకు విశ్వేశ్వరునియెడ తనకుగల ప్రేమభావాల్ని ప్రకటించుకోగల్గే అవకాశమే లభించలేదు. విశ్వేశ్వరునియిల్లు కమలయింటికి చాలదూరానవుండడం, ఒకరింటికి మరొకరు వెళ్ళే అలవాటు లేకపోవడం, పైసంఘటన జరిగినతరువాత ఒకరినొకరు కలుసుకునే

# 8

అవకాశం లభించకపోవడమే దానికి కారణం. విశ్వేశ్వరుణ్ణి తన పంచప్రాణాలతో సమానంగా చూచుకునేది కమల. అతనికి తనహృదయం కోసియివ్వాలనిపిస్తుంది ఆమెకు. విశ్వేశ్వరుడికి మాత్రం కమలంటే ప్రేమ ఎందుకు వుండకూడదూ?

పరుపుమీదపడుకుని అదేపనిగా ఏమేమో అంతులేని ఆలోచనాతరంగాల్లో మునిగిపోయింది కమల. వంటమనిషివచ్చి, "అమ్మగారూ! స్నానానికి లేవరూ?" అని పిలిచేటప్పటికి తొకతొక్కిన త్రాచులాగా కస్సుమంటూ వంటలక్కను గదినుండి బయటికి కసిరికొట్టి లోపలి గడియ బిగించుకుని పుస్తకపఠనంలో లీనమైంది కమల. ఇటీవలనే తెప్పించిన కొత్తపుస్తకాన్ని తెరచి చివరిపేజీల బొమ్మలు శ్రద్ధగా పరికించసాగింది. ఆహా! ఎంత బాగున్నాయి ఆ బొమ్మలు! నాయకానాయికలు మహానందంగా నవ్వుతూన్నారు. ఆమెహృదయం సంతోషంతో నిండిపోయింది. ఆ పుస్తకాన్ని తదేకధ్యానంతో చదువుతూ అందులో లీనమైపోయింది కమల. కాని చివరిఘట్టంలోకి వచ్చేటప్పటికి నాయికానాయకుల దుఃఖాంతజీవితాన్ని చదువలేక చదువుతూ వారికష్టాలకు సానుభూతిగా వెచ్చటి రెండు వేడి కన్నీటిబొట్లు కార్చి తానెప్పుడు నిద్రాదేవతఒడిలోకి చేరుకుందోగాని అన్నానికి పిలవడానికి తల్లివచ్చి గదితలుపు తట్టి చప్పుడుచేసేటంతవరకూ కమలకు తెలియనే తెలియదు.

# 2

ఇప్పుడిప్పుడే తూరుపురేఖలు తెల్లవారుతున్నాయి. ముసలి రామశంకరభట్టాచార్య వాకిలిదగ్గర వేసివున్న కుక్కి మంచంలో కూర్చుని చుట్టపొగ పైకివదుల్తూ వున్నాడు. తన కెదురుగా యింటివాసానికి వ్రేలాడకట్టిన పంజరంలోని పెంపుడు చిలుక, "హరేరామ, హరేకృష్ణా" అని భగవన్నామం జపిస్తూ వుంది పదేపదే. అప్పుడప్పుడూ భట్టాచార్య పాడుదగ్గులు దగ్గుతూ వుంటే తానుకూడా అదేవిధంగా అయన్ని అనుకరించసాగింది అతని పెంపుడు చిలుక. వంటగదిలోని వెచ్చనిబూడిదలో పడుకుని నిశ్చింతగా గురకలుపెట్టి నిద్రపోతూ వుంది యింటికుక్క. యింటి ముందున్న మామిడిచెట్టుదగ్గర మేకుకు కట్టివేయబడిన ఆవు ఎంతో మాతృప్రేమతో తన దూడశరీరాన్ని నాకుతూ వుంది. నలువైపులా నిశ్శబ్దత వ్యాపించివుంది. సుప్రభాతపుపిల్లవాయువులు చల్లచల్లగా బయలుదేరినయి. "ప్రకృతిఅంతా నిశ్చింతగా వుంది. విశాల ప్రకృతిలో చీకూచింతలనేవి నామమాత్రంగానైనా వున్నట్లు కన్పించడంలేదు. కాని చీకూచింతలనేవి ఎందుకు మానవుణ్ణింతగా పట్టుకు పీడిస్తున్నయి? పక్షి ఎంతో ఆనందంగా పాటపాడుకుంటూ మానవుని అనుకరిస్తూ వుంది. ఆ పశువు ప్రేమతో తన బిడ్డదేహాన్ని నాకుతూ వుంది. కుక్క చీకూచింతా లేకుండా ముడుగించి నిద్రపోతూ పడివుంది. ఇవన్నీకూడా తిని తిరిగే జంతువులేగా? అయినా తన కడుపు నింపుకోడానికి వాటికి పడరానిపాట్లుపడే అవసరం లేదే? మానవుడు వీటి ఆహారపానీయాల గురించి, బాగోగుల గురించి జాగ్రత్త తీసుకుంటున్నాడనే కాబోలు యివన్నీ యింత నిర్భయంగా, నిశ్చింతగా హాయిగా వుంటున్నవి. అయితే మానవుని బాగోగుల్ని గురించి ఆలోచించేవారెవరున్నారు? ఆహా! అట్లా వుంటే ఎంత బాగుండేది? కాని మానవుడే యింతగా కష్టించి దిగులుకూడు తింటూ సంసారాన్ని సాగించవలసివచ్చింది. తనకు గౌరవాభిమానాలు సంపాదించి పెట్టి తనకు గర్వకారణమైన

యీ మానవజాతిపట్ల భూమాత కెందుకీ పక్షపాతం ? మానవజాతి పట్ల తన కీసుమంతైనా జాలి కరుణ లేకపోవడానికి కారణమేమై యుంటుంది ?' అని ఏమేమో ఆలోచించుకుంటూ కుక్కి మంచంలో కూర్చుని చుట్టపొగ పైకి విడుస్తూవున్నాడు రామశంకర్. ఇదే సమయంలో ఆపూరింటి మట్టిగోడలమధ్య గదికి కట్టిన ఎదురుబద్దల తడిక ప్రక్కకు నెట్టుకొని బీదతనానికి ప్రాతినిధ్యం వహిస్తున్నదా అన్నట్లు చింకిగుడ్డలు ధరించిన ఒక రమణి బయటికొచ్చింది. చేతికి మందమైన ఎర్రని గాజులు, ముఖంమీద వెడల్పాటి కుంకుమ బొట్టూ ఎంతో శోభాయమానంగా వున్నాయ్. కడవ చంకన పెట్టుకొని ప్రక్కింటివారి భావికెళ్ళి కడివెడు నీళ్ళుతెచ్చి, యింటి ముందు కళ్ళాపిచల్లి ఆవుపేడతో యింటిముందున్న తులసిమొక్క అరుగును అలికి అలంకరించింది. ఈ పనయినతరువాత చేతులు కడుక్కొని చెంబుతో నీళ్ళు, చేతిలో ముఖంపుల్ల తెచ్చి భర్తముందు పెట్టి, "యింత పెందలాడే ఎందుకులేచారు ? రాత్రంతా గుండెల్లో నొప్పిగా వుందని మూల్గుతుంటిరి గా. మరలా యింతచలిలో ఎందుకు కూర్చోవడం ?" అని అడిగింది.

"గుండెనొప్పి పోయిలేపడ! చావొచ్చినా బాగుండు. కష్టాలన్నీ యీగడవుతయి. అవి యీగడయ్యే రోజు రాలేదింకా. దానికోసం ఎంతగా ఎదురుచూచినా రావడంలేదు. ఏంచేసేది మరి ? మంచివాళ్ళందర్ని దేవుడట్టే తీసుకెళ్తున్నాడు. 'బోటి దరిద్రుణ్ణి చూస్తే దేవుడికీ రోతేసి వుండొచ్చు." అని గొణుగుతూ అన్నాడు భట్టాచార్య.

భర్తమాటలకి తన హృదయంలో పొంగిపొరలే దుఃఖ భారాన్ని ఆపుకుంటూ కళ్ళల్లో నీళ్ళు కళ్ళల్లోనే కుక్కుకుని రాతిబొమ్మలాగా నిలబడి తదేకధ్యానంగా ఆయనవైపు చూస్తూ వుంది ఆమె. ఎదురుగావున్న మామిడిచెట్టువైపు తలత్రిప్పి చూస్తూ ఏమేమో ఆలోచిస్తున్నాడు భట్టాచార్య. ఎంతో ప్రయత్నంమీద లోపలి దుఃఖాన్ని దిగమ్రింగుకుని ఆమె అనలేక అంది, "ఏమండీ లేచి ముఖంకడుక్కోరూ ?"

"మొఖం తరువాత కడుక్కుంటూగాని, ముందు నే నడిగే దానికి సమాధానం చెప్పు. యింట్లో యింకా బియ్యం, కందిపప్పు ఎన్నాళ్లకు సరిపోతయ్? అసలు వున్నయ్యా లేదా?" భార్య నోరెత్తి మాట్లాడలేక లేవని సూచనప్రాయంగా తలూపింది.

"పొట్టకోసం భూమిపుట్ర అమ్ముకున్న పైకం కూడా ముచ్చటగా మూడురోజులైనా రాలేదే తింటానికి. చివరకు చిల్లిగవ్వ కూడా మిగలకుండా అంతా అయిపోయింది."

రూపాయలుమాత్రం ఎన్నాండీ? మూడు నెళ్ళంతె మూడే నెళ్ళు అవి ఖర్చుపెట్టుకు నేగా తిని బ్రతకగలిగాం. ఖర్చుపెట్టినే కొండమాత్రం తగ్గిపోక అట్లాగే వుంటదా? ఈ రూపాయలు మాత్రం యింకా ఎన్నాళ్ళొస్తయ్?"

"రాకపోతే యిప్పుడు నన్నుమాత్రం ఏంచేయమంటావ్? భిక్షమెత్తనా?" భార్య మారుమాట్లాడలేక కారే కళ్ళనీళ్ళని చీరచెంగుతో తుడుచుకుంది.

"మీ ఆడవాళ్ళకు ఏడుపు పిలిస్తే పలుకుతుంది. ఏడ్చినందువల్ల తీరవలసిన అవసరాలేమైనా తీరితే నేనుకూడా నీ మాదిరే బావురుమని గట్టిగా నోరెత్తి ఏడుదును." అని ఎత్తిపొడుపుగా అన్నాడు భర్త. మళ్ళా కొంచెంసేపుండి శాంతంగా, "ఇవ్వాళ నేనెక్కడికీ వెళ్ళలేను. ఇవ్వాళ కేదోవిధంగా పని గడుపు. యిక రేపటిసంగతి చూచుకోవచ్చు." అని చెంబుతీసుకుని నోట్లోచుట్ట అలాగే పెట్టుకుని ఫాక్టరీ పొగగొట్టంలాగా పొగ పైకి వదులుతూ బహిర్దేశానికి వెళ్ళాడు. భార్య చీపురుతీసుకుని ముంగు వసారా వూడవడానికి వెళ్ళా. "సతీ, సతీ, యిక లేవమ్మా తెల్లారింది." అంటూ కేక వేసి వెళ్ళింది.

గదితలుపు తెరచుకుని కళ్ళునలుచుకుంటూ వచ్చి వాకిలి దగ్గర నిలబడింది అందచందాలుచిందే ఆమె చిన్న కూతురు సావిత్రి. తల్లి యింటిముందు వసారా వూడవడంచూచి, "ఏంటమ్మా అంటున్నావ్?" అని అడిగింది.

"సత్తీ, యింకా లేవలేదా నిదర? ఆది లేచి యిక్కడి పాచివూడ్చిస్తే నేపోయి యింకో కడివెడు నీళ్ళు తెచ్చుకుని కళ్ళాపీచల్లుతా" అంది తలపైకెత్తి తల్లి.

"నేనే తీసుకొస్తాలేమ్మా నీళ్ళు" అంటూ కడవ చంక నేసుకొని సావిత్రి భావికిపోయింది. "వద్దు లేమ్మా, యింత పెద్ద కడవ మోసుకు రాలేవునువ్వు. నేనే తెస్తాలే. అదక్కడపెట్టు." అని తల్లి వద్దంటున్నా లెక్కచేయక ముందుకు సాగిపోయింది సావిత్రి. ఎంత చెప్పినా కూతురు వినకపోయేటప్పటికి తల్లి జాహ్నవి కూడా యింకేమీ చెప్పలేకపోయింది.

అదే సమయానికి వితంతువైన జాహ్నవి తోడికోడలు తలుపు దగ్గరకొచ్చి నిలబడి అమ్మా కూతుళ్ళు పనిలో లీనమయివుండడం చూచి, "ఇక మీరిద్దరూ యీ పనిలో మునిగిపోతే యిక పొయ్యిలో పిల్లెట్లా లేస్తుందనుకున్నారు? యిక యివ్వాళ యింట్లో ఒక్క గింజైనా లేదన్న సంగతి మరచిపోయారా, ఏం? మా మరిదెక్కడికెళ్ళారు? బజారుకు పోయిరారాదూ? కాలీగాడు లేచీ లేవడంతోనే అమ్మా, ఆకలే అని ఏడవడం సాగిస్తాడు. వాడు ఎత్తిన నోరు మూయాలంటే మళ్ళా కోడి కూయాల్సిందే. నిన్న పాలమ్మికూడా పాలిచ్చిపోలేదు. అవునులే మరి ఏడు జన్మాల కూడా యిక్కడికి పాలడబ్బు రాదని అనుకునివుంటుంది అది కూడా. పాపం! పీదముండ. అదిమాత్రం ఎన్నాళ్ళని పుణ్యానికి తీసికొచ్చి యింట్లో పాలుపోస్తావుంటది?"

జాహ్నవి నెమ్మదిగా, "ఇప్పుడెందుకమ్మా, ప్రొద్దుప్రొద్దున్నే ఆ రామాయణం? యిప్పుడే వారు విసుక్కుంటూ చెంబుతీసుకుని బయటికెళ్ళారు. మళ్ళా వారిదంతా విన్నారంటే వారి మనస్సు కెంతో బాధకలుగుతుంది. మాకిది రోజూ వుండేదేగా. పాలమ్మికి మాత్రం పాతబాకీ ఏముంది? ఈ నెలది మాత్రమేగా యివ్వాలసింది" అన్నది.

ఇది వినేటప్పటికి తోడికోడలి మనస్సు కొంచెం చివుక్కుమంది, "ఒక నెలకివ్వాలసివస్తే మాత్రం, అదిమాత్రం తక్కువా?

మంచికొరకై నేనేం చెప్పినా మీకెప్పుడూ చెడుగానే తోస్తుంది. వట్టి తెలివితక్కువమ్మండని, నోరూరుకోలేక ఏమిటో చెప్పబోతా. అది తిరిగి నా మెడకే వస్తుంది. అయినా ఒకరికి చెప్పాల్సిన అవసరం నాకుమాత్రం దేనికిలే. పసిపిల్లాడు లేచి ఆకలి ఆకలి అని బాధపడతాడని వాడిబాధ చూడలేక ఏదో అన్నా. ఎవరెట్లా చస్తేమాత్రం నాకు దేనికిలే?'' అని ముఖంముడుచుకుని గొణుక్కుంటూ ఆవుకు మేతవేయబోయింది. ఆవుదగ్గరకు వెళ్ళేప్పటికి మనసులోవున్నకోపం పైకి పొంగివచ్చింది. ''వెధవఆవు దూడ పేడదైనా పాలివ్వడానికి చస్తుంది. తింటానికిమాత్రం ఎక్కడిగడ్డీ, జనపకట్టే చాలదు. అటువంటి ఆవువుంటే నేం చస్తే నేం?'' అంది పెద్దగా. సావిత్రి యిదివిని, ''పాపం, దానికి మాత్రం పొట్టనిండా మేతవొరికితేగా పాలివ్వడానికి'' అంది.

సావిత్రి అన్నమాటలు వాళ్ళ పెద్దమ్మకు వినిపించలేదు కాబోలు ఆమేమీ మాట్లాడలేదు. ప్రక్కనే పడుకుని గురకలుపెట్టి నిద్రబోతున్న కుక్క వీపుమీద ఆమె పెత్తల్లి కట్టెతీసుకుని చచ్చేటట్టు రెండు సరిసింది. పాపం, అది కాయ్‌కాయ్ అని అరుస్తూ తోక గూడించుకుంటూ బయటికి పరుగెత్తింది. అప్పుడే ఎదురుగా వచ్చిన పెంపుడుపిల్లిని చావబాదింది. యిదంతా చూస్తున్న పంజరంలోని రామచిలుక భయపడికాబోలు నోరుమూసుకూర్చుంది. ఈ గడబిడకి సతికి నిద్రాభంగం కల్గింది. బయటికొచ్చి చూచేప్పటికి ప్రొద్దు బారెడెక్కివుంది. అంతా పనిపాటలు చేసుకుంటున్నారు. ఇదంతా చూచి సతి అంది, ''ఓహో యింత ప్రొద్దెక్కిందే!''. వాళ్ళ పెత్తల్లి చెవిని యీ మాట పడేటప్పటికి ''పాపం! దీపంవెలిగించి చూపించదర్రా, పిల్లకి ప్రొద్దెక్కింది కూడా చీకట్లో తెలియకుండావుంది.'' అంది. సతి తనతప్పు తెలుసుకుని అంట్లుతోముతున్న తల్లిని లేపి తాను అంట్లుతోమడానికి కూర్చుంది.

''అయితే నేనిక స్నానానికెళ్ళొస్తా'' నంటూ జాహ్నవి అచ్చటినుండి లేచివెళ్ళింది.

ఇంతలోకి భట్టాచార్య కాళ్ళు ముఖం కడుక్కుని యింట్లో కొచ్చేసరికి పదహారేళ్ళ హరిశంకర్ ఎదురుగావచ్చి "ఒక్కరోజు బళ్ళోకెళ్ళకపోతే యింట్లోవాళ్ళంతా నా బుర్ర కొరుక్కు తింటారు. కాలికి చెప్పుల్లేవంటే నా సంగతి ఆలోచించినవాళ్ళు ఒక్కరు లేకపోయారు. బళ్ళో కొచ్చేవాళ్ళంతా చెప్పులేసు కొస్తారు. చెప్పుల్లేకుండా అంతమందిలోకి వెళ్ళాలంటే నాకు చాల సిగ్గేసుంది. నాకివ్వాళ కొనిస్తేనే బడికెళ్తా. లేకపోతే యింట్లోనే కూర్చుంటా."

నీళ్ళకెళ్ళిన జాహ్నవి తిరిగొచ్చి కొడుకుగోల విన్నది. కొడుకుగడ్డంపట్టుకుని, "మా నాయనగా, యివ్వాళటికెలాగో వెళ్ళిరా నాయనా తరవాత........." అంటూండగానే హరిశంకర్ మధ్యలోనే ఆపి "ఆ...తరువాత, రోజూ అట్లాగే అంటారు మీరంతా. ఎన్నాళ్ళేం, ఈ నాటకం?"

కొడుకు హఠం చూస్తుంటే భట్టాచార్యకు చెప్పరానంత కోపం వచ్చింది. "ఏంరోయ్, వెధవగోల? ఏం, జమీందారుగా రబ్బాయి ననుకున్నావా, కోరింది కావాలంటానికి? ఒకపూట తిండికిలేక తండ్రి ఏడుస్తూవుంటే ఎక్కి తిరగడానికి గుర్రం కావాలి నాన్నా అని వెనకటికి కొక కొడుకు తండ్రినడిగాడట. అట్లా వుంది నువ్వడిగే దిప్పుడు. మనమెంతలోవుండాలో అంతలోనే వుండాలి. తాకతుకు మించినయి కావాలంటే ఎక్కణ్ణుండి వస్తయ్, ఎవరు తీసుకొస్తారు? హారేరాం. హారేరాం. 'సాగరాన్నయినా యీదొచ్చుగాని సంసారాన్నీదడం దుర్లభం' అని పూరకనే అన్నారా పెద్దలు? ఏం, మీ అందరికోసం నన్నెక్కడ నుంచైనా దొంగతనం, దోపిడీచేసి తీసుకొచ్చిపెట్టమంటూరా?" అని గర్జించాడు.

సమయంకనిపెట్టి వదినగారుకూడా మాటకుమాట అందుకుని అంది, "అవన్నీ వాడికేం తెలుసు? చెప్పులుకొనివ్వలేనివాళ్ళు బడికెందుకు పంపాల్సివచ్చింది? పోషించలేనివాళ్ళు కనటందేనికి? ఎదిగినపిల్లాడాయె. పదిమంది పిల్లలముందు తలొంచుకుని తిరగవల

సొచ్చింది. వాడావిధంగా కాలం వెళ్ళబోస్తుంటే మీరుమాత్రం సిగ్గుపడాలిసిన పనిగాదూ ?''

నిద్రనుండి కాలీశంకర్ లేచివచ్చి, "అమ్మా, అన్నం పెట్టవే ఆకలేస్తుంది.'' అంటూ ఏడుస్తూ తల్లికొంగుపట్టుకుని నిలబడ్డాడు.

భట్టాచార్య యింట్లోకిపోయి కర్రుచెప్పులూ కర్రతీసుకుని మడత వూడదీయని దుప్పటి భుజంమీదేసుకుని బయటికొచ్చాడు. "ఎక్కడికండీ ప్రయాణం?'' అని ప్రశ్నించింది జాహ్నవి భర్తగారి వేషంచూచి. మాట్లాడకుండా పెడముఖంపెట్టి యింటిబయటి కొచ్చేస్తున్నాడు భట్టాచార్య. చంటిపిల్లవాణ్ణి చంక నేసుకుని, ఆయన్ని వెంబడించి, "ఏమండీ పిలుస్తుంటే పలక్కుండాపోతా రేం, ఎక్కడికీ చెప్పులూ, కర్రా చేతపట్టి బయలుదేరారు ?'' అని ప్రశ్నలవర్షం కురిపించింది.

"ఎక్కడికా వాగులోక, ఎక్కడికన్నా వెళ్ళి ఏదైనా గడిచేమార్గం ఆలోచిస్తా. ఏమీ ఆలోచనలేకుండా కాలుమీద కాలేసుకుని, నోట్లో వేలేసుకుని యింట్లో కూర్చుంటే సంసారం ఎట్లా గడుస్తుంది? ఏదైనా మార్గం ఆలోచించాలిగా. ఏదైనా మార్గం దొరికితే యింటికి తిరిగొస్తా. లేకపోతే యిక యింతే పోవడం. యిక తిరిగొచ్చేపని లేదు.'' అంటూ వెనక్కైనా తిరిగిచూడకుండా యింటినుండి బయటికెళ్ళిపోయాడు.

ఇదంతా చూస్తూంటే జాహ్నవి తల గిర్రున తిరిగిపోయింది. మాట్లాడదామంటే నోరు లెగవలేదు. పెద్దకొడుకు హరినిపిలిచి, "అబ్బాయ్, హరీ! కాస్త బ్రతిమిలాడి మీ నాన్నను వెనక్కి తీసుకురా నాయనా. బజారునపడి వెళ్తున్నారు.'' అన్నది.

"ఎక్కడికెళ్తాడేం ? సగందూరం వెళ్ళి తనే తిరిగొస్తాడు. నేనిక చాంద్‌పూర్ నరేంద్రబాబుగారివద్ద వుంటా. వాళ్ళు నన్నెన్నిసార్లో అక్కడికొచ్చి వుండమన్నారు. మిమ్మల్ని నమ్ముకునే వాళ్ళమాటలు కాదన్నా. ఇక నేనీ యింట్లో ఒక్క క్షణం కూడా వుండను, వుండలేనసలు. ఇక యీ యింట్లో వుండి పచ్చి

మంచినీళ్ళైనా ముట్టుకుంటే ఒట్టు. ఇప్పుడే నేనుకూడా వెళ్ళి పోతున్నా" అన్నాడు పెద్దకొడుకు హరి.

కొడుకుమాటలు వినేప్పటికి జాహ్నవికి వళ్ళంతా కొయ్యబారి పోయినట్లైంది. శిలాప్రతిమలాగా నిలబడిన తీరునే నిలబడి పోయింది. అవతలి ఎంగిలిపళ్ళాలు తోముతున్న సతి పరుగెత్తు కుంటూ వచ్చి "ఎక్కడికన్నాయ్ నువ్వెళ్ళేది? మీరంతా మమ్మల్నం దర్నీ అన్యాయంచేసి వదలిపెట్టి వెళ్తుంటే మేమింక ఎట్లా బ్రతకాలి? ఇక మాగతేంగాను? అన్నాయ్, పోయి నాన్నను వెనక్కి పిల్చుకురా" అంది రెండుచేతులూ పట్టుకొని వెచ్చటి కన్నీరు కారుస్తూ.

"మీ యిష్టంవచ్చినట్లు" బ్రతకండి. మీ జోలి నాకేంపట్టదిక అంటూ హరిశంకర్ కూడా వెనక్కి తిరిగిచూడకుండా యింటినుండి పోయాడు. సావిత్రి అతని దారికడ్డంగా పరుగెత్తుకుంటూ వచ్చి, "అన్నయ్యా నాన్నను పిలుచుకురావూ? నాన్నను పోనివ్వకు అన్నయ్యా, ఏదోవిధంగా మాయమాటలు చెప్పి వెనక్కి తీసుకురా, నీ కాళ్ళుపట్టుకుంటా" అని రెండు చేతులూ పట్టుకొని ఏడ్చింది.

చిన్నచెల్లెలు సావిత్రిని చేత్తో ప్రక్కకునెట్టి పడవేసి తన దారిని చక్కాబోయాడు హరి. చంకలో పిల్లాణ్ణి చంకలోనే పెట్టుకుని యింటివసారాలో కొయ్యస్తంభం ఆనుకొని కూలబడింది జాహ్నవి. ఎంగిలిపళ్ళాల మసిరాసుకున్న తన రెండుచేతులూ అలాగే పెట్టుకొని చిత్రకారుడు గీచిన బొమ్మలాగా నిలబడిపోయింది సతి. సావిత్రి యింటిట్లోకెళ్ళి చీపురు చేతపట్టుకుని చెయ్యాడిస్తుందే గాని కన్నీళ్ళునిండి రావడంవల్ల క్రింద ఏమున్నదీ కంటికి కనించడం లేదు. అటు జాహ్నవి తోడికోడలు నోరు పెద్దదిచేసుకుని పెద్ద పెద్దగా కేకలేసుకుంటూ వూళ్ళోవాళ్ళని పదిమందినీ పోగుచేసి యింటిగుట్టంతా బయట ఆరేయసాగింది.

భట్టాచార్య యిల్లువిడిచి పోతున్నాడేగాని మనోవ్యాకులత వల్ల వూరిదారితప్పి చేలకడ్డంగా నడవసాగాడు. మనస్సు మనస్సులో లేదు. ముక్కుకు సూటిగా పోతున్నాడు. ఏది డొంక, ఏది దారి. ఈ విచక్షణాజ్ఞానమే లేదిప్పుడు. పెద్దపెద్ద మట్టిగడ్డలు ఎదురుకొట్టుకొన్నయ్. ఎన్నెన్నో ముళ్లుకాళ్లల్లో దిగబడినయ్. కాళ్ళు గాయాలుపడి నెత్తురు కారుతున్నయ్. కాని యిదంతా భట్టాచార్యకు తెలిసినట్లే లేదు. దారిప్రక్కనే తనచేని గట్టుమీద కూర్చున్న గొల్లగంగడదిచూచి, "భట్టాచార్యులుగారూ ఎక్కడికంటోయ్ యీ దారిని పోతున్నారు? యివ్వాళ యీదారిని వచ్చారేం?" అని అడిగాడు ఆశ్చర్యంగా.

"యమరాజు దగ్గరికి" అంటూ అడుగుదీసి అడుగేసుకుంటూ ముక్కుకు సూటిగా వెళ్తూనే వున్నాడు భట్టాచార్య. రెండడుగులు ముందుకు వేసీవేయడంతోటే రెండోవ్యక్తి ప్రశ్నించాడు, "భట్టాచార్యగారూ? ఎందాకా ప్రయాణం?"

భట్టాచార్య తల పైకెత్తి చూచాడు. తను ఎరుగున్న తన వూరి విశ్వేశ్వరుడే అతడు. మోకాళ్ళపైకి గుడ్డ ఎగగట్టి ఎదురుగా దారినివస్తూ నిలబడ్డాడు విశ్వేశ్వర్. అతన్నిచూచి భట్టాచార్య నిలబడిపోయాడు. భట్టాచార్య దగ్గరకొచ్చి విశ్వేశ్వర్ మరలా అడిగాడు, "ఎందాక ప్రయాణం?" అని.

"ఒక చోటకని ఏముంది? కాళ్ళు ఏదిక్కుకు లాక్కెళ్ళితే ఆదిక్కుకే, చూస్తున్నావ్‌గా యిప్పుడు నేనెటుగుండా నడిచి వస్తున్నానో?"

"మనుషు లెవరూ వచ్చిపోయేదారికాదేయిది? మరి మీరీ దారిని ఎక్కడికెళ్ళాలని? యిది నమ్మడానికి వీలులేనిమాట. యిందులో ఏదో రహస్యముంది? అసలు విషయంచెప్పండి. మాట దాస్తే లాభంలేదు. నాదగ్గర మీరేమీ సంకోచించవద్దు."

"సంకోచందేనికీ?"

"మీకేమైనా లాభం చేయగలిగితే నన్ను నేను చాల ధన్యుణ్ణిగా భావించుకుంటా."

కండ్లు పెద్దవిచేసి విశ్వేశ్వర్ వైపు పరీక్షగా చూచాడు భట్టాచార్య. అతని ముఖంలో దయ, జాలి తప్ప వ్యంగ్యం నామ మాత్రానికికూడా గోచరించలేదు. అసలు మాటదాస్తే యిక లాభంలేదనుకున్నాడు.

"నువ్వు చాల మంచి అబ్బాయివి. నీదగ్గరికమాట దాస్తే లాభంలేదు. ఏదైనా బ్రతుకు తెరువు మార్గం చూచుకుందామని యింటినుంచి బయలుదేరా. పెళ్ళాంబిడ్డల్ని పోషించలేకపోయినా నన్నునేనైనా పోషించుకొని నిశ్చింతగా వుండదలచా. ఇతరు లెవరికైనా నేనిదివరలో మేలుచేసివుంటేగా మీ మేలు నేను గ్రహించేటందుకు?"

భట్టాచార్యమాటలు విని విశ్వేశ్వర్ వణికిపోయాడు. "సరే నా వుపకారం, మీకవసరంలేకపోతే పోయింది. తారాపూర్‌లో వున్న యింట్లో ఒక గుమాస్తా అవసరం. మిమ్మల్ని అక్కడే పెట్టించే ఏర్పాటుచేయిస్తా. మీరిక అక్కడే పనిచేస్తూవుండండి."

"కావాలంటే యీ నిముషాన్నుండే పనిచేయడానికి తయారుగావున్నా. కాని యీ నెలజీతం ముందుగానే కావాలి."

"సరే, అట్లాగే"; యిద్దరూకలిసి యింటిదారి పట్టారు. ముఖం ప్రక్కకుతిప్పి విశ్వేశ్వర్ పెద్దగా నిట్టూర్చాడు. భట్టాచార్య యింటిగుట్టంతా అవగాహన చేసికున్నవాడిలాగా.

# 3

విశ్వేశ్వర్ ఆవూరి ధనవంతుని కొడుకు. నవయువకుడు. అతనితండ్రి పిల్లికి బిచ్చంపెట్టని పిసినారి. వారికి పెద్దలోగిలి. పశుసంపదకు, ధనధాన్యాలకు లోటులేని యిల్లు వారిది. యితర ధనవంతుల యిండ్లల్లోమాదిరిగా నౌకర్లు యితరపనివాళ్ళుగాని వాళ్ళింట్లో అగుపించరు. యింటికొచ్చినవారిని కూర్చోమనడానికి కుర్చీలుగాని, బల్లలుగాని అసలేలేవు. వారి ఆచారవ్యవహారలన్నీ సామాన్యకుటుంబీకుని యింటిలోలాగే జరిగిపోతున్నాయి. దర్పాలకు హెచ్చులకు ఆ యింట్లో స్థానంలేదు.

"పీనాచి" "కొరకరానికొయ్య" "జారీగగాడు" "మిడతంభొట్లు" "రూపాయలతొత్తు" అని ఎన్నెన్నో ఎత్తిపొడుపుమాటల్తో మారుపేర్లతో వూరివారంతా విశ్వేశ్వర్ తండ్రిని పిలుస్తూండేవారు. ఆ కుటుంబానికి దీపం నిలబెట్టడానికి ఆయనకడుపున పుట్టినవాడు విశ్వేశ్వర్ ఒక్కడే. విశ్వేశ్వరునికి చిన్నానాడే తల్లిచనిపోవడంవల్ల అతని పిన్నమ్మ అన్నపూర్ణే అతన్ని సాకుతూవచ్చింది. ఆమెదగ్గరకూడా డబ్బుకేమీ తక్కువలేదు. తల్లిలేని విశ్వేశ్వరుణ్ణి సాకటానికి మొట్టమొదటగా అన్నపూర్ణ విశ్వేశ్వర్ యింటికి వచ్చినపుడు ఆ వూరివారికి కన్నుకుట్టింది.

విశ్వేశ్వర్ తండ్రిపేరు నారాయణచంద్రుఁడు. కొడుకుని ఒక్కక్షణమైనా చూడలేనిది వుండలేడు. అందువల్లనే కొడుకుని వూళ్ళోవున్న సంస్కృతపాఠశాలలోనే ఎంట్రెన్సువరకు చదివించి విశ్వవిద్యాలయానికి పంపించకుండా యింట్లోపెట్టుకున్నాడు. ఎంట్రెన్సువరకు చదువుకున్నా విశ్వేశ్వర్ బహుభాషాకోవిదుడని, గొప్పమేధావి అని వూరంతా పేరుమోగాడు. అతనికి గల సంస్కృతజ్ఞానానికి గొప్పగొప్ప పండితులే ముక్కుమీద వేలేసుకొనేవారు. ఆవూరి ఆడవాళ్ళల్లో విశ్వేశ్వరుణ్ణి గురించిన చర్చ ఎప్పుడూ వచ్చిఎరుగదు. విశ్వేశ్వరుడికి ఆడవాళ్ళంటే

చాల సిగ్గని, అతడు చాల పెద్దమనిషని, గొప్పగొప్ప లేనిపోని ఆడంబరాలకు పోడని వారికి తెలుసు.

విశ్వేశ్వరుడికి యిరవై రెండేళ్ళు నిండినా యింతవర కెప్పుడూ యింటినుంచి బయటికొచ్చి పదిమందిలో కూర్చోవడం గాని తోటివాళ్ళతో కలిసి బజార్లలో తిరగడంగాని ఎరుగడు. తనయింటిలోని ఒకగదిని తనకొరకై ప్రత్యేకించుకొని బండెడు పుస్తకాలు ముందేసుకుని చాపమీద పడుకుని చేతికందిన పుస్తకాన్ని చదవడంవరకే అతనికి తెలుసు. అంతఃపుర స్త్రీల లాగా ఎప్పుడూ యింట్లోనే ఆ గదిలోనే వుండేవాడు. అతడున్న గదిలోకి యితరులెవరూ వెళ్ళడానికి వీల్లేదు. కొడుకు చదువు కోడానికి వారపత్రికలుగాని, పక్ష, మాసపత్రికలుగాని దిన పత్రికలుగాని, తదితరపుస్తకాలుగాని కొనివ్వాలంటే అతనితండ్రి వెనకాడేవాడు కాదు. కొడుకుకు పుస్తకాలమీదుండే ప్రీతిచూచి లోలోపల ఎంతో మురిసిపోయేవాడు తండ్రి. కాని తండ్రికి ఒకే ఒక కోరికవుంది. కొడుక్కి పెళ్ళిచేసి, కొడుక్కీ కోడలికీ యింటి పెత్తనం అప్పగించి కాశీవెళ్ళి శేషజీవితాన్ని గడుపుదామని కలలు కనేవాడు. తానొకటి తలిస్తే దైవమొకటి తలచినవిధంగా యింతలోనే యమరాజు పిలుపు నందుకుని తీరనికోరికలన్ని మనసు లోనే భద్రపరచుకొని ఈ లోకాన్నే వదిలాడు అతని తండ్రి. మృత్యుశయ్యపైనుండి ప్రాణాలు వదిలేముందు తనకొడుకుచేతిని అన్నపూర్ణచేతిలో వేయించి అతని జీవితభారాన్ని ఆమెకాళ్ళకు చుట్టి వెళ్ళాడు.

తండ్రి చనిపోయినతరవాత విశ్వేశ్వరుడికి ఎటుచూచినా అంధకారంగానే కనిపించింది. ఏకాంతపఠనానికి స్వస్తిచెప్పి యింటిపనుల్లో జోక్యంకలుగజేసుకోవాల్సొచ్చింది. నిజంగా యిది విశ్వేశ్వరుడికి పునర్జన్మలాగే తోచింది. వ్యవసాయపుపనులు తనకు క్రొత్తయినా ధైర్యంగానే కార్యకలాపాలు గడపనారంభించాడు. వూరిప్రక్క నదియొడ్డున యింకా భూమికొని అందులో మరమ్మత్తు చేయించి పెదతోట వేయించాడు. ఆ తోటలోనే ఒక పెద

రెండంతస్తుల మేడకూడా లేచింది. యింకా క్రొత్తభూములుకూడా కొనేశాడు. విశ్వేశ్వరుని పుణ్యమా అంటూ ఎన్నాళ్ళనుండో పాడుపడి మరమ్మత్తులెరుగని ఆ వూరి రామమందిరం కొత్తరూపం దాల్చింది. వూరివారందరికీ వుపయోగించే చెరువుమరమ్మత్తుకు డబ్బు కావాలంటే ఒక్కటంటే ఒక్కరూపాయి చందాయిచ్చిన ఘనుడు ఒక్కడు కనబడలేదు. దాన్నికూడా విశ్వేశ్వరుడు స్వంత డబ్బుతోనే లోతుగాత్రవ్వించి పూర్తి చేశాడు. యిక ఆ చెరువులో పన్నెండుమాసాలు నీరు నిండేవుంటుంది. తండ్రి కూడబెట్టిన డబ్బుకు యీనాటికి సద్గతిపట్టిందని అందరూ అనుకునేవారు. తండ్రికడుపున తప్పపుట్టాడని వూళ్ళో కుర్రాళ్ళుగాని, పెద్దవాళ్ళుగాని అననివారులేరు. వంశోద్ధారకుడు యీనాటికి పుట్టివచ్చాడా యింట్లో అని ఆడ మగ అంతా అనుకునేవారే.

ఆతనితండ్రి చనిపోయినదగ్గర్నుండీ యీనాటివరకూ గృహభారాన్ని ఎట్టిచీకూ చింతా లేకుండా లాక్కురాగల్గింది అన్నపూర్ణ. కాని యింటిలో కొత్తకోడలు లేనిలోటు చూస్తే కలత చెందేది ఆమె మనస్సు. విశ్వేశ్వరుడికి ఆ రెండు గింజలు కాస్తా నెత్తినపడితే యిక తనజీవితమే ధన్యమైనట్లుగా భావించాలని కలలుకనేది. ఒకనాడు కొడుకునిపిలిచి, "చూడు, విశూ, అందరిళ్ళూ కొత్తకొత్త కోడళ్ళతో పచ్చపచ్చగావున్నయ్. కాని మనింట్లోనే కోడలు లేనిలోటు కన్పించి బోసికొట్టినట్లుగావుంది."

"కళ్యాణమయ్యే రోజొస్తే ఆగుతుందాపిన్నీ. కళ్యాణమొచ్చినా, కక్కొచ్చినా ఆపటానికెవరితరం? యింతకూ ఆరోజు నెట్టుకురాలేదు. దానిక మనమేంచేస్తాంమరి?" అన్నాడు విశ్వేశ్వర్.

"దానికి మనప్రయత్నంకూడా వుండాలినాయనా" అంది అన్నపూర్ణ. యిదివిని పొట్ట బద్దలయ్యేటట్లుగా నవ్వాడు విశ్వేశ్వర్. ఎంత ఆపినా ఆగేటట్లుగాలే దానవ్వు. కొడుకు వెకిలినవ్వు చూచి అన్నపూర్ణ కోపపడి, "ఏంటిరా, ఆ వెకిలినవ్వా?

యిక ఆగడానికి వీల్లేదు. కొత్తకోడల్ని తీసుకురావాల్సిందే. లేకపోతే లోకనింద పడలేం బాబూ.''

పెళ్ళిచేసికోకపోయినంతమాత్రాన నిందలపాలవడం దేనికి పిన్నీ? ఎవరుగన్నపిల్లనో తీసుకొచ్చి యింట్లో సాకటంకంటే మనిద్దరమే వండుకుతింటూ గొడవా చింతాలేకుండా ఆనందంగా వుందాం. యిందులో లోకనిందేముంది?''

ఎంత పిచ్చిపిల్లాడివై పోయావురా విశూ? యింత పిచ్చివాణ్ణి నేనెక్కడా చూడలేదురా. పో పిచ్చివెధవా నీతో నేనిక మాట్లాడలేను. ఇదిగో విశూ, యిక నేనాగేదిలేదు. యిక నీకు ఎక్కడైనా పిల్లని కుదిర్చి ఆ రెండుచేతులూ వేయించేప్రయత్నం చేస్తా.''

ఒకర్ని కాదు పిన్నీ వెయ్యిమందిని కుదుర్చుకో. కావాలంటే నేనుకూడా పదిమంది పేర్లు చెప్తా. అవికూడా నీ లిస్టులో కెక్కించుకో.''

''ఈ పిచ్చిమాటలిక కట్టిపెట్టి, చెప్పు, నిజంచెప్పు పెళ్ళి చేసుకుంటావా లేదా?''

''నేను చెప్పినట్లుగా నువ్వు నడుస్తావామరి? కావాలనుకుంటే ఒకరినికాదు వేయిమంది కోడళ్ళను తీసుకొచ్చి యీయిల్లునింపేసుకో నేను కాదనను. నాకు పెండ్లిసంగతి ఎట్లాగున్నా వుండనీ ముందు హిందూదేశమంతా తిరిగిచూచి రావాలనివుంది. ఉత్తరాన హిమాలయ పర్వతాలనుండి దక్షిణాన కన్యాకుమారి అగ్రంవరకూ తూర్పున బంగాళాఖాతంనుండి పడమర అరేబియాసముద్రంవరకూ తిరిగి చూడవలసిందే. అప్పుడప్పుడూ నీనోటినుంచి మధుర బృందావనం పేరులు వింటూంటే నాకూ్కడా వాటిని చూడాలనిపిస్తుంది. కావాలంటే నువ్వుకూడా నాతోపాటుగా రా. యిద్దరంకలసి దేశం చూచివద్దాం. లేకపోతే నిరసనవ్రతంబూని ప్రాణాలువదలుతా.''

''నేనుమాత్రం నీతో ప్రయాణంచేయను నాయనా. ఎప్పటికైనా నువ్వుఒక్కడివే పోయిచూచివద్దువులే. అదయినా పెళ్ళయిన

తరవాతనే. పెళ్ళయినతరవాత పెళ్ళాన్ని వెంబడేసుకుని, గయా, కాశీ వెళ్ళిరా. నిన్నిక అడిగేవాళ్ళెవరూ వుండరు.''

''సరేపిన్నీ నేవెళ్ళి దేశయాత్ర చేసివస్తా. నువ్వు యింటివద్ద కూర్చుని పెళ్ళిప్రయత్నాలు మొదలెట్టు.''

''దేశదిమ్మరిలాగా నువ్వు దేశాలంబడి పోతే నేను పెళ్ళెవరికి చేసేదిరా ?''

''అది నీకే తెలియాలి.''

''ఓయి దేవుడా ! యింత మొండిపిల్లవాణ్ణి నే నెక్కడా చూడలేదమ్మా. అబ్బబ్బా, నీతో నేనిక యేగలేనురా, విశూ. అబ్బా అబ్బా ఎంత మొండిపట్టురానీది. నీతో చచ్చేగోజు వచ్చింది నాకు.''

ఇక యింతటితో యీ ఘట్టం పూర్తయింది.

సాయంత్రంవేళ విశ్వేశ్వర్ తన తోటవైపు షికారు కెళ్ళాడు. తోటప్రక్కనే ఒక కాలిబాటవుంది. ఆవూళ్ళో వాళ్ళంతా ఆ బాటనే నడిచిపోయి నీళ్ళు తెచ్చుకుంటారు. తన తోటదగ్గరకు పోగానే ఎవరోఅమ్మాయ్ చిన్నమట్టికడవనిండా నీళ్ళునింపుకునిచంక నేసుకొని ఎదురొచ్చింది. విశ్వేశ్వర్ ని చూచి దారిప్రక్కకు తొలగి నిలబడింది. పాపం దారిప్రక్కకు పోగానే కాలిలో ముల్లుగుచ్చు కుంది. అది చూచి ''ఎందుకమ్మాయ్, దారిప్రక్కకు దిగావ్. అక్కడ పాములు, తేళ్ళూ వుంటయ్, దారినేపో'' అన్నాడు విశ్వేశ్వర్.

ఆ అమ్మాయ్ చిరునవ్వు నవ్వి అంది, ''మీరు వస్తున్నారని''. ''సరే యిక దారినేపో'' అంటూ ప్రక్కగా తొలగి ముందుకుసాగి పోయాడు విశ్వేశ్వర్. ఆ అమ్మాయ్ అక్కడే నిలబడిపోయింది. రెండడుగులు ముందుకువేసి విశ్వేశ్వర్ వెనక్కు తిరిగిచూచేప్పటికి ఆ అమ్మాయ్ బొమ్మలాగా అట్లాగేవుండడం గమనించాడు. ఆశ్చర్యంగా చూస్తూ నిలబడిపోయాడు అక్కడే. ఆ అమ్మాయ్ కూడా అతనివైపే తదేకధ్యానంగా చూస్తూవుంది. తనతో ఆమెకేదో పని వుండివుండవచ్చునని వూహించాడు. ఒక్కక్షణం ఆలోచించి ఆమెఎదుటకొచ్చి నిలబడ్డాడు. ఆమె నిదివరకెప్పుడో చూచినట్లుగా

వుంది. కాని ఆ అమ్మాయి ఎవరో ఎవరికూతురో ఎంత ఆలోచించినా మతికి రావడంలేదతనికి. ఎంతో కుతూహలంతో ప్రశ్నించాడు విశ్వేశ్వర్, "నువ్వు ఎవరమ్మాయివి?

"భట్టాచార్య కూతుర్ని"

"ఏ భట్టాచార్య? రామశంకర భట్టాచార్యేనా?"

"ఆఁ............"

ఇక ఆ అమ్మాయినోటినుండి ఒక్క మాటకూడా రాలేదు. నిరాశ జెంది తిరుగుముఖంపట్టాడు విశ్వేశ్వర్. తనంతట తానుగా యితరులనేవీ అడిగేస్వభావం కాదతనిది. విశ్వేశ్వర్ తిరిగిపోతూ వుండడం గమనించి తలపైకెత్తి, "మీతో......మీతో" అని ఏమేమో చెప్పబోయింది నెమ్మదిగా ఆ అమ్మాయి. యిది విని విశ్వేశ్వర్ ఎక్కడివాడక్కడే నిలబడిపోయి, "ఆఁ...నాతో ఏమైనా చెప్పాలా?" అన్నాడు. "అవును" అంది ఆ అమ్మాయి.

"అవును" అని అనగల్గిందేకాని సిగ్గుచేత చచ్చిపోతూవుంది సతి. మనసులోమాట చెపుదామా వద్దా అని సంకోచించసాగింది. విశ్వేశ్వర్‌ని అడక్కుండానే తనస్నేహితురాలివద్దకెళ్ళి అబద్ధాలాడడం తనకు చేతగానిపని. అట్లాచేయడం అన్యాయమనికూడా ఆమెకు తెలియకపోలేదు. ఆ అమ్మాయి ఏమిటో చెప్పడానికి సంకోచిస్తుందని గ్రహించి ఆ అమ్మాయివైపు రెండడుగులు ముందుకువేసి ఎంతో ఆప్యాయంగా ప్రశ్నించాడు, చెప్పదలచుకుందేదో చెప్పు. ఫరవాలేదు. సిగ్గుపడతావేం?" ప్రాణాలు బిగబట్టి ఎంతో కష్టంమీద అనగల్గింది సతి, "కమల చెప్పిపంపించిందేమిటంటే..."

"కమలా? ఎవరా కమల?"

సతి ఆశ్చర్యంగా అంది, "జమీందారుగారమ్మాయి. కమల తెలియదా మీకు? నీటిలో మునిగిపోతూవుంటే మీరొకసారి కమలప్రాణాలు కూడా రక్షించారు." యిది వినేప్పటికి

విశ్వేశ్వర్‌కి ఆశ్చర్యమేసింది, "ఓహో. అది జరిగి చాలారోజు లయిందిగా. ఆఁ...అయితే ఏమని చెప్పిపంపింది ?"

"మీకు పెళ్ళి అవబోతుందని, మీకు ఎక్కడెక్కడినుంచో సంబంధాలు వస్తున్నాయ్యని అంది."

ఇదివిని నవ్వు ఆపుకోలేక ఫక్కున నవ్వాడు విశ్వేశ్వర్. వాళ్ళపిన్ని తలపెట్టిన పెళ్ళిప్రయత్నం వూరంతా వ్యాపించిపోయిం దని తనలో తానునుకున్నాడు. నవ్వుతూ మరలా ప్రశ్నించాడు, "నిజమే పెళ్ళి రాయబారాలు జరుగుతున్నయ్, అయితే ?"

తలవంచుకుని ఎంతో మధురంగా మాట్లాడింది సతి "కమల మిమ్మల్ని పెళ్ళిచేసుకోవాలంటుంది." విశ్వేశ్వర్ ఆశ్చర్యపోయాడు. ఆపుకోలేనంత నవ్వుకూడా వచ్చింది. నవ్వు నాలువిధాల చేటు అన్నట్లుగా భావించి ఆ అమ్మాయిముందు ఎక్కువగా నవ్వడం కూడా మర్యాదగావుండదని తెలిసికొని నవ్వాపుకొని మరలా అన్నాడు, "ఎందుకని ? ఆ అమ్మాయికి ఎక్కడా పెళ్ళి సంబంధాలు రావడంలేదా ?" సతి ఈ హాస్యాన్ని తెలిసికోలేక, "చాంద్‌పూర్ జమీందార్ నరేంద్రనాథ్ కివ్వాలని రాయబారాలు జరుగుతున్నయ్. కాని ఆ సంబంధం కమలకు యిష్టంలేదు" అంది.

"నిజంగానేనా ?"

"అవును"

గంభీరంగా అన్నాడు విశ్వేశ్వర్, "ఆ అమ్మాయిని అక్కడే పెళ్ళిచేసుకోమని చెప్పు. వాళ్ళు చాలా శ్రీమంతులు. అది తగినసంబంధమే." లజ్జాస్నిగ్ధనేత్రాల్తో విశ్వేశ్వర్ ముఖం వైపుచూస్తూ సతి అంది, "మీరుమాత్రం శ్రీమంతులుకారా ? మీరుమాత్రం ఏంతక్కువ ?"

"నువ్వు పిచ్చిదానిలాగున్నావ్. చాంద్‌పూర్ జమీందారు గారికీ నాకూ పోటీయా ?"

కమలకు ఏమని సమాధానంచెప్పాలో సతికి అర్థంకాలేదు. సతి అడిగేప్రశ్నలకు సరైన సమాధాన మివ్వక హాస్యంగా

మాట్లాడుతున్నాడు విశ్వేశ్వర్. ఆతని కంఠ ఎగతాళిగావుంది కాబోలు. "చాంద్‌పూర్ జమీందారుగారికిచ్చి కమలపెళ్ళి చేస్తే కమలగారింట్లో పెళ్ళి పెత్తనమంతా నేనే చేస్తా. అప్పుడు వండిన పిండివంటలన్నీ-లడ్లూ, అరిసెలు, గారెలు, బూరెలు, జిలేబీ, పరవాణ్ణం పాయసాలన్నీ—నోటికిపట్టినంతగా తినగల్గుతా. నేనే పెళ్ళికొడుకునయి పెళ్ళిపీటలమీద కూర్చుంటే యివన్నీ తినే అవకాశం లభించదుగా. కమలకు నే చెప్పానని చెప్పు, కాళ్ళదగ్గర కొచ్చిన సంబంధాన్ని దూరంగా తన్ని వెయ్యొద్దని." అని వచ్చే నవ్వును బలవంతాన ఆపుకున్నాడు. విశ్వేశ్వర్ హాస్యప్రవృత్తి, మాటలధోరణిచూచి సతి లోలోపల ఎంతో దుఃఖించింది. పుట్టెడు దుఃఖంతో నిరాశజెంది యింటికి తిరుగుముఖం పెట్టింది సతి.

# 4

తారాపుర్ కోర్టులో కొలువు కుదిరంతరవాత రామశంకర్ భట్టాచార్య మనస్సు కొంచెం శాంతపడినట్లయింది. నెలకు పది రూపాయలు యింటికి తీసుకొచ్చేవాడు. వేళకు నాల్గు మెతుకులు తిని తారాపుర్ వెళ్ళడం మళ్ళా సాయంత్రం యింటికి తిరిగొచ్చి వేడి నీళ్ళస్నానంచేసి రెండుమెతుకులు మింగడం రెండుచుట్టదమ్ములు లాగి గుర్రుపెట్టి నిద్రపోవడం, యిది ఆయన దినచర్య.

రామశంకర్ పెద్దకొడుకు బడికిపోవడం మానేసి చాలా రోజులైంది. చాంద్‌పూర్ పెద్దబాబులతో కలిసి తిరగడం మొదలెట్టాడు. ఆ పెద్దబాబులు "ఆజాద్ నాటకమండలి" నొకదాన్ని స్థాపించి, సాంఘిక, పౌరాణిక నాటకాలుకూడా వేయించేవారు. ఆడవేషంవేయడంలో హరిశంకర్‌ది అందెవేసినచేయి. ఆ వేషానికి బాగా సరిపోయేవాడు. అదురు, బెదురులేకుండా నాటకాల్లో అభినయంచేసేవాడు. పాటలుపాడేవాడు. ఈవిధంగా ఆ పెద్దబాబుల మన్నన లందుకున్నవాడైనందున వీణ్ణి వదిలిపెట్టాలంటే బాబులికి మనసొప్పేదేకాదు. నెలకూ, రెండునెల్లకూ యింటికొచ్చి రెండురోజు లుండిపోయేవాడు. వచ్చినపుడల్లా తమ్ముణ్ణి, చెల్లెల్ని పరిహాసంచేయడం, వెక్కిరించి ఏడిపించడం మానేవాడుకాదు. పెద్దబాబులతో స్నేహం కుదిరినతరవాత యింటికొచ్చి చింకిచాప, పాతగొంగళిమీద పడుకోవాలంటే హరిశంకర్‌కి నామోషీగా వుండేది. నిదరకూడా పట్టేదికాదు. ఎండి నలిగిపోయిన సద్దిరొట్టెలు తినాలంటే మనసొప్పేదికాదు. అసలవి యిప్పుడు వానికి రుచించవుకూడా. "పెద్దవాళ్ళతో స్నేహంచేస్తే వూరికేపోతుందా ఎప్పుడో ఒకప్పుడు ఏదో ఒకసహాయం దొరక్కపోతుందా" అనుకుని రామశంకర్, కొడుకు ఏంచేసినా విసుక్కునేవాడేకాదు. తల వెండ్రుకలు వుంగరాలుత్రిప్పుకుని, నిలువుపాపటతీసి, పొడుగాటి చేతులలాల్చీ, తెల్లని ధోవతి, కాలికి చెప్పులు, చేతిలో సిగరెట్ డబ్బాపట్టుకుని యింటినుంచి బయలుదేరితే కొడుకు ఐశ్వర్యాన్ని

చూచుకుని తండ్రి ఒక్క క్షణకాలం దిగులుమరచి నిశ్చింతగావుండ గల్గేవాడు. జాహ్నవిమాత్రం "యీ సంసారం ఎట్లా తెల్లవారాలి భగవంతుడా" అని యిరవైనాల్గుగంటలూ కంట తడిపెట్టి కూర్చునేది. తల్లి కన్నీరుకార్చటం చూచి కూతుళ్ళిద్దరూకూడా కంటతడిపెట్టేవారు. ఒక్కక్షణంకూడా వృథాగా కాలయాపన చేసేవాళ్ళుకాదు వాళ్ళు. యింటిపనులు ముగిసినతరవాత తీరిక వేళల్లో జాహ్నవి రాట్నంపెట్టి ఏకులు వడికేది. కూతుళ్ళిద్దరూ తల్లి కీపనిలో సాయపడేవారు. దారంతీసి కండెలుకట్టేవారు. ప్రత్తి గింజలువేరి ఏకులుచుట్టేవారు.

"కూతుళ్ళిద్దరూ గోగుకొమ్మల్లాగా పెరిగి పెద్దవారయ్యారు. వయస్సువచ్చినవాళ్ళు. అందంచిందులు త్రొక్కే ముఖాలు వాళ్ళవి. కేవలం రూపమేమీ లాభంలేదీరోజుల్లో. రూపాన్ని గుణాన్ని దాచిపెట్టడానికి ధనమవసరం. ధనం లేకపోయిన తరవాత ఎంత రూపమున్నా, ఎన్ని సద్గుణాలున్నా కన్నెత్తి చూచేవారుండరు. యింట్లో మాస్తే ఎర్రని రాగిదమ్మిడీలేదు. పొట్టగడవడమే అంతంత మాత్రంగావుంది. కూతుళ్ళిద్దరికీ పెళ్ళిళ్ళు ఎలాగా చేయడం ? పెళ్ళి చేయాలంటేమాత్రం తేలికైనపనా యీరోజుల్లో ?" యీవిధంగా ఏమేమో ఆలోచించుకుని పొర్లేదుఃఖాన్ని లోలోపలనే అణచు కుని భగవంతునిపేరు తలచుకుని గుండె రాయిచేసుకునేది జాహ్నవి.

*　　　*　　　*

మిట్టమధ్యాహ్నం ఎటుచూచినా నిశ్శబ్దత వ్యాపించి వుంది. ఎండవేడిమి తీవ్రంగావుండడంవల్ల బజార్లో మనుష్యు లెవరూ మెదలడంలేదు. ఎక్కడివాళ్ళక్కడ పండుకుని గుర్రు పెట్టి నిద్రపోతున్నారు. యింతలో కమల గారి నౌకరువచ్చి, "సతి, అమ్మగారూ! కమలమ్మగారు మిమ్మల్ని ఒక్కసారి వచ్చి పొమ్మ న్నారు." అని చెప్పిపోయాడు. కమల అత్తగారింటిదగ్గరనుంచి వచ్చిన సంగతివిని సంతోషం పట్టలేకపోయింది సతి. ఎప్పుడెళ్ళి చూద్దామా అని తహతహలాడింది. అమ్మనులేపి కమలవద్దకు వెళ్ళొ స్తానని చెప్పింది. జాహ్నవి లేచి, "యింత ఎండలో ఎట్లాపోతావ్ ?

సాయంత్రం పోగూడదూ ?'' అంది. ''సాయంత్రం మనుష్యులు మెదులూ వుంటారు బజార్లో. యిప్పుడే వెళ్ళొస్తా''నంది సతి. ''అయితే కాళీశంకర్‌ని వెంటబెట్టుకెళ్ళు. ఒంటరిగా ఎట్లా వెళ్ళొస్తావ్ ?'' అని జాహ్నవి తన చిన్నకొడుకు కాళీశంకర్‌ని తోడు చేసి పంపింది.

తమ్ముణ్ణి వెంటేసుకుని కమలగారింటికైతే వెళ్ళింది గాని గుమ్మందాటి యింటిలోకి అడుగుపెట్టాలంటే సతికి కాళ్ళువణికినయి. కమల అత్తగారింటికి పోకముందు ఎప్పుడో రెండు సంవత్సరాలనాడు యీ యింటికొకసారి వచ్చిపోయింది సతి. యిప్పుడా యింట్లోకి వెళ్ళాలంటే సిగ్గు భయాలు ఆమెను పెనవేసుకున్నట్లుగా వున్నయ్. అయినా వాళ్ళెక్కడ, తనెక్కడ ? కమల వున్నవారి కోడలైంది. ఇప్పుడికి తనతో సరిగా మనసిచ్చి మాట్లాడుతుందో లేదో అని ఏమేమో తలంపులు సతిమనస్సులో పరుగులు తీసినయ్. ఇవ్వాళటికెలాగో కమలను చూచి పలకరించి యికమాత్రం ఎప్పుడూ యీ యింటికి రాకూడదనుకుంది.

గడపదాటి సతి యింట్లోకి అడుగుపెట్టిందో లేదో లోపలి నుండి కమల పరుగులుతీస్తూవచ్చి సతిని కౌగిలించుకుని సతి తలను తన రొమ్ముకు ఆనించుకోవడంతో సతిమనస్సులో నున్న సంకోచాలన్నీ గాలిలో కలిసిపోయినయ్. ఈ రెండు సంవత్సరాల్లో కమల ఎంతగా మారిపోయింది! శరీరం నునుపెక్కడమే కాకుండా మనిషి లావుకూడా ఎక్కింది. ముఖం కళ వుట్టిపడుతూవుంది. మెడలో నున్న బంగారునగలతో వొళ్ళంతా ధగధగ మెరసిపోతూంది. సతి ఏమీ మాట్లాడలేక కమలవైపుచూస్తూ గుడ్లప్పగించి నిలబడింది ఆశ్చర్యంగా ఏమో చూస్తూ. సతిమెడలో చెయ్యేసి, ''మాట్లాడవేం? రాతి బొమ్మలాగా అట్లా నిలబడ్డావేం ? ఎనిమిది రోజులుండిపోదామనివచ్చా అప్పుడే వచ్చి మూడురోజులయిపోయింది. ఈ మూడురోజుల్నుంచీ ఎదురుచూచా వస్తావేమోనని. మరీ నల్లపూసవయిపోయావ్. యివ్వాళ మనిషిని పంపకపోతే అసలు మన

మిద్దరం కలుసుకునేవాళ్ళమేగాదు యిక'' అంది కమల. సతి యిదంతా విని ఒకనవ్వు నవ్వి వూరుకుంది.

''సరే యీమాటలకేంగాని యింటిసంగతులేంటి ? అమ్మా, నాన్నా, అంతా బాగున్నారా ?''

''ఊఁ ......'' అని తలతిప్పి వూరుకుంది సతి.

''నీ పెళ్ళిసంగతేమిటి మరి ? ఎన్నాళ్ళని యీవిధంగా తపస్సుచేసా కూర్చుంటావ్ ? సంబంధాలెక్కడినుంచైనా వస్తున్నయ్యా ?'' అని ప్రశ్నించింది కమల.

''నాకేం తెలుసు ?''

''అబ్బో ఎంత నంగనాచివే, నీకేం తెలియదూ ? యింకా ఎన్నాళ్ళుందామని పెళ్ళిచేసుకోకుండా ?''

''పెళ్ళంటే వూరకే వుందాకమలా ? యిల్లు వాకిలి తాకట్టు పెట్టితేనేగాని పెళ్ళయేది అంతంతమాత్రం.''

''ఏమిటే, అట్లాంటావ్ ? నీ అందచందాలు గుణగణాలు చూచి నీకాళ్ళు మొక్కి ఎగరేసుకెళ్ళరంటే ?''

''ఎప్పుడూ నా విషయమే ఆలోచించుకుని గుండె చెరువు చేసుకుంటున్నాడు మానాన్న. అమ్మ యిక సరేసరి. రేయింబవళ్ళూ కంటికీ మంటికీ ఏకధారగా కారుస్తూ కూర్చుంటుంది. నా పెళ్ళిసమస్య వాళ్ళకొక కొరకరానికొయ్యగా వుంది. ఈ ముసలితనంలో, యీ డబ్బులేని రోజుల్లో మానాయన నాపెళ్ళిగురించి ఎంతో దిగులేసుకున్నారు'' అని సతి లేచి వెళ్ళబోయింది.

''అప్పుడే లేచావేం ? కాసేపు కూర్చోవె సతీ, పోవచ్చు''
''లేదమ్మా, కొంచెంసేపుంటే మళ్ళా బజార్లో మనుష్యులు తిరుగుతూవుంటారు. నువ్వు పొయ్యేలోపల మళ్ళా ఒకసారివచ్చి కలుస్తాలే'' అంటూ తమ్ముడుకాళీని చంకనేసుకుని నవ్వుకుంటూ వెళ్ళిపోయింది.

సతి యింటికొచ్చేప్పటికి ఇంటిలో రామరావణయుద్ధంలాగా ఒక లేపోరు.

"అయ్యో, అయ్యో ఎక్కడైనావుందా ఈ చోద్యం? యింత అన్యాయం? ఇంత సిగ్గులేకుండా పెద్దమనిషయినపిల్లని అంత పెద్ద వాళ్ళింటికి పంపుకుంటారా? రానీ యివ్వాళ, మరిదిని. దీనికేదైనా వుపాయం ఆలోచిస్తా. దీని కేక ప్రతీకారం జరిగితీరాల్సిందే. అందాక నీళ్ళుగాని అన్నంగాని నేను తాకితే ఒట్టు". అంటూ సప్తమస్వరంలో మేళవించి గొంతెత్తి కేకలువేయసాగింది పెత్తల్లి.

రాత్రి తొమ్మిదిగంటలయింది. రామశంకర్ యింటికొచ్చి కాళ్ళు కడుక్కుని గుడ్డిదీపపు వెలుగులో అన్నం పళ్ళెంముందు పీటమీద కూర్చున్నాడు. విసనకర్రతో తండ్రికి గాలివీస్తూ తండ్రి ప్రక్కనే కూర్చునివుంది సతి. ఏడ్చే పసితమ్ముడికి చందమామను చూపిస్తూ జోలపాట పాడుతూ సావిత్రియింటిముందు వసారాలో నిలబడింది.

భర్తకు పళ్ళెంలో అన్నంపెట్టి తలుపుచాటుకొచ్చి భర్త వైపు తొంగిచూస్తూ నిలబడివుంది జాహ్నవి. చల్లని వెన్నెల రాత్రిలో దరిద్రుని యింటిముందు వికసించియున్న కుసుమకళిలాంటి సతిని తండ్రిప్రక్కనే కూర్చునివుండగా చూచి అప్పుడప్పుడూ నిట్టూరుస్తుందేది ఆమె.

ఇంతవరకూ గురకలుపెట్టి నిద్రపోతున్న ఆమె తోడికోడలు కొంపముంచుకుపోయినట్లుగా నిద్రలేచి, చేత్తో పీటనొకదాన్ని తీసుకుని రివ్వుమంటూ వంటయింటిలోకిపోయి భట్టాచార్య సరసనే పీటవేసుకూర్చుని బడబడమని వాగసాగింది. రామశంకర్ ఆమె వైపు తలెత్తిచూచి వెంటనే తలవంచుకుని అన్నంముద్ద నోట్లో పెట్టుకున్నాడో లేదో రామాయణం మొదలెట్టింది వదినగారు. "నోటినిండా బొక్కుకుంటూ అన్నంతినంగా సరిగాదు. పన్నెండు సంవత్సరాలు, పద్నాలుగుసంవత్సరాలు వయస్సునిండి యీడొచ్చిన పిల్లల్ని నువ్వు కాబట్టి యింట్లోపెట్టుకూర్చున్నావ్. ఎవరుంటారీ విధంగా యీ రోజుల్లో. గోగుకొమ్మల్లాగా పెరిగిన యిద్దరు కూతుళ్ళా యీవిధంగా యింట్లోపడుంటే కళ్ళు కనిపించడంలా?"

"అయితే ఏంచేయమంటావ్ నన్ను? అంతా రూపాయలతో పని. అవి లేందే ఏపనీ కాదు. పెళ్ళిచేయడంమాత్రం మాట లనుకున్నావా ?"

"అంతకాడికి కనటందేనికి ? కని పెంచంగానే అంతా తీరి పోయిందనుకున్నావా ? పిల్లలిద్దరూ ఆవిధంగా హద్దూ పద్దూ లేకుండా యిష్టమొచ్చినట్లు బజార్లన్నీ తిరిగొస్తుంటే ఆదేమని అడగడానికి నోరులే దెవ్వరికీని. అసలాసంగతి పట్టించుకునేవాళ్ళు లేకపోయారు. అసలు మీరింతకూ కనిపెంచిన తలిదండ్రులా లేక కసాయివాళ్ళా? కూతుళ్ళకి పెళ్ళికాలేదనే చింతేలేదు ఏకోశానా మీలో. అబ్బబ్బ. తినేకూడుమాత్రం ఎట్లా సయిస్తుందంట ?"

"ఏవమ్మా ! అయితే నీ కదేనా వేళ, రామాయణం మొదలెట్టడానికి ? వారు అన్నానికి కూర్చున్నప్పుడు తప్పితే నీకిక తీరికే లేదా అడగడానికి ?" అంది జాహ్నవి నెమ్మదిగా.

ఇది వినేసరికి ఆమె తోడికోడలికి నిప్పులో నెయ్యిపోసినట్లయింది. ఆమె కంఠస్వరం ఆకాశాన్నంటింది. 'నువ్విట్లా అంటావని నాకు తెలుసునే తోడికోడలా. అందుకనే ఎప్పుడూ ఏది చెప్పాలన్నా బుద్ధిపుట్టదు నాకు. ఎవరెట్లా చస్తేమాత్రం నాకు దేనికి ? ఇతరుల్ని అదుపులో పెట్టాలని నాకేమంత మండలభారం వచ్చింది ? కని పెంచినవాళ్ళే పట్టించుకోకపోతే నేనెవర్నితే అంటానికి చేయటానికి ? నీకు నేనెటుకుండా కలిశాను ? తండ్రి తరుపునా లేదు. తల్లితరుపునా లేదు. ఏమిటో పిచ్చిముండని వుండబట్టలేక మంచికని ఏమో చెప్పబోతా. అది తిరిగి నా మెడకేవచ్చి తగులుతుంది. నేను నోరుచేసుకున్నందువలన వచ్చే లాభమేమీ కనిపించలా. నాకెందు కీమాటలన్నీ ? మీ కూతుళ్ళకి పెళ్ళి పేరంటాలు చేసుకుంటే నాకేమైనా వచ్చి వూడిపడుతుందా ? లేక నిండుతుందా ?" అని పెద్దపెద్దగా ఏమేమో నోటికొచ్చినట్లు వాగింది.

ఈరభసంతా వింటూంటే అన్నంపళ్ళెం ముందుకూర్చున్న రామశంకర్ కి ముద్దమింగుడు పడలేదు. పళ్ళెంముందునుంచి లేవ

బోయాడు. ప్రక్కనే కూర్చున్న సతి తండ్రి రెండుపాదాలు పట్టుకుని, "అన్నంపళ్ళెం ముందుపెట్టుకొని అలిగి లెగవకూడదు నాన్నా, అన్నంతినిలే" అంది బిక్కమొగంతో.

కోపంతో గుడ్లురజేసి కాలు విదిలించుకొనిపోతూ, "చావండి, మీరంతా చావండి. మీతోపాటు నేకూడా కలిసి చస్తా. అప్పుడే అందరికీ మోక్షం" అంటూవుండగానే ఆయాస మెక్కువై పెద్దపెట్టుగా దగ్గువచ్చింది రామశంకర్‌కి. దగ్గుతూదగ్గుతూ స్పృహతప్పి నేలపై పడిపోయాడు. రొమ్ము బాదుకుంటూ జాహ్నవి పరుగెత్తుకుంటూ వచ్చి, భర్తరొమ్ముమీద, కాళ్ళమీద చేతుల్తో సరిచేయ మొదలెట్టింది. బయటనుండి సావిత్రి రివ్వున పరుగెత్తు కుంటూ వచ్చి తండ్రికి విసనకర్రతో గాలివిసరసాగింది. ఏమి చేయటానికీ సతికి తోచక కుడ్యచిత్రంలాగా గ్రుడ్లప్పగించి చూస్తూ కూర్చుంది ప్రక్కనే. కొంచెంసేపటికి స్పృహలోకి వచ్చిన తరవాత కూతుళ్ళు ఎంతో బ్రతిమిలాడంగా బలవంతాన భోజనం చేశాడు రామశంకర్. సతి యింటిలోకెళ్ళి మంచంమీదపడి నిద్రపోయింది. భర్త భోంచేసినతరవాత జాహ్నవిమనస్సుకు కొంచెం స్వస్థత చేకూరినట్లయింది.

"సావిత్రీ! అక్కయ్యని పిలుచుకొచ్చి మీరిద్దరూ అన్నం పెట్టుకు తినండమ్మా" అంది తల్లి.

సావిత్రిపోయి అన్నానికి పిలిస్తే తిరుగుజవాబైనా చెప్పక పోయింది సతి.

"అక్కా! అమ్మ అన్నానికి రమ్మంటుంది. నీకోసం ఎదురు చూస్తూ కూర్చుంది. లే అన్నానికి పోదాం" అని సావిత్రి అనంగానే మూతి ముప్పైఆరుముడుతలతో బిగించి ప్రక్కకు త్రిప్పుకుని కదలకుండా కూర్చుంది సతి.

"లే అక్కా నీకాళ్ళుపట్టుకుంటా. ఏమ్మా! నాన్న అన్న మాటకే అంత బిగుసుకుపోవాలా? నాన్నబాధ నీకేంతెలుసు? ఇంతమాత్రానికే అన్నంతినకుండా అలిగికూర్చోవాలా నువ్వు?"

ముఖంమీది చీరకొంగు ప్రక్కకు తప్పించి రుగ్ధకంఠంతో, "నువ్వుపో, అమ్మా నువ్వూ అన్నం పెట్టుకు తినండి. నాకివ్వాళ ఆకలిగా లేదు" అంది సతి.

"నువ్వు రాకపోతే తలబాదుకొని చస్తా. లేకపోతే నాతో పాటుగారామరి, యిద్దరం వెళ్ళి తిందాం."

"సావిత్రీ! నా చిట్టిచెల్లీ, నన్ను బాధపెట్టకు, నాకు ఆకలేయడంలేదు. వంట్లో బాగాలేదు. నన్ను విసిగించి బాధపెట్టకు తల్లీ."

తల్లివచ్చి సతి రెండుచేతులూ పట్టుకుని పైకి లేవదీసి, "యిక మీరంతా యీవిధంగా నిరసనవ్రతాలు పూనితే నేనెట్లా బ్రతకాలి? లేమ్మా తే. కాస్తంతే కాస్తతిందువులే" అని బ్రతిమిలాడగా సతి కష్టంగా లేచివెళ్ళింది. అంతా నిదానంగా భోజనాలు ముగించుకుని పడకలమీదికి చేరుకున్నారు రాత్రి చాలా ప్రొద్దుపోయాక.

# 5

విశ్వేశ్వరుని పిన్ని అన్నపూర్ణ సావిత్రీవ్రత వుద్యాపనం చేయాలని తలపెట్టినందువల్ల ఎప్పుడూ నిర్మానుష్యంగా వుండే వారింట్లో యీనాడు అంతా హడావిడిగా వుంది. యిల్లంతా వూళ్ళో జనంతో నిండి కిటకిటలాడిపోతూ వుంది. రకరకాల పిండి వంటలు తయారవుతున్నాయ్. లడ్డూ, జిలేబీ, గులాబ్ జాం, బాద్ షా, రసగుల్లా, జాంగిర్, పూరీలు, గారెలు ఒకటేమిటి ? దేశంలోవుండే తీపివస్తువులన్నీ తయారవుతున్నాయి. పట్నంనుండి యిగవై మందికి తక్కువలేకుండా వంటబ్రాహ్మలు వచ్చారు. సుదర్శన చక్రాల్లాగా చేతుల్లో పెద్ద వెడల్పాటి గరిటెలు పట్టుకుని బాండీలోవేసే పూరీలకు తీసే పూరీలకు వ్యవధిలేకుండా పనిలో లీనమై యున్నారు వంటబ్రాహ్మణులు. వసారాల్లో పెద్దపెద్ద బానలనిండా పెరుగూ పాలు తీసుకొచ్చి నింపేస్తున్నారు పాలవాళ్ళు. చిన్న చిన్న పూజాపనులకు వూళ్ళో ఆడవాళ్ళంతా చేయందిస్తున్నారు. ఇంటిముందు వేయబడ్డ పెద్ద పందిట్లో భోజనాలకు ఏర్పాట్లు జరిగినయ్. వండేవంటకాలు చూస్తుంటే "దశకంఠు"ని ఆహారంకోసమే యీ ఏర్పాటంతా చేయబడిందా అనిపిస్తుంది. ఇల్లంతా తీపివాసనల్తో ఘుమఘుమలాడిపోతూ వుంది. యింట్లో ఎక్కడచూచినా యి స్తళ్ళకట్టలూ, గిన్నెలూ, గరిటెలు, పిండిపదార్థాలరాసులు, వూళ్ళో జనంతోనిండి పచ్చపచ్చగా వుంది. వీటికితోడు విశ్వేశ్వరునికి తీరికేలేదు. ఏదయినాపనిచేయమనిగాని, ఏదైనా వస్తువు అందివ్వమనిగాని పిన్నిదగ్గరనుండి ఆర్డరురావడమే ఆలస్యం-మూడు నిముషాల్లో ఆపనిచేసి కూర్చునేవాడు. వ్రత సమాప్తమైనతరువాత అన్నపూర్ణ మొఖాన చారెడు వెడల్పుగల ఎర్రని తిలకంధరించి పట్టుచీరెకట్టుకుని అతిథుల భోజనాల పంక్తుల్లో శాంతమూర్తిలాగా తిరుగుతూ ఎక్కడ ఏ వస్తు వున్నదీ లేనిదీ తనిఖీచేస్తూ ఎవరికేదికావాలో అందింపజేస్తూ ఎట్టి లోటు పాట్లు లేకుండా జాగ్రత్తగా అజమాయిషీ చేస్తూవుంది.

బ్రాహ్మణ భోజనాలు సంతృప్తిగానే ముగిసినయి. బ్రాహ్మణులందరికి తాంబూలం, యజ్ఞోపవీతం, దక్షిణా అన్నపూర్ణ స్వయంగా సమర్పించి వారి ఆశీర్వాదాలు పొందగలిగింది. అన్నపూర్ణ విశ్వేశ్వరుడిచేతకూడా బ్రాహ్మణులపాదాలకు నమస్కరింపజేసి, "మా నాయన నూరేళ్ళు బ్రతికి సుఖంగా జీవించాలని తామంతా ఆశీర్వదించాలి" అని బ్రాహ్మణులను వేడుకుంది. బ్రాహ్మణులంతా అదేవిధంగా ఆశీర్వదించి తమయిండ్లకు తాము చక్కాపోయారు.

బ్రాహ్మణభోజనాలు ముగిసినతరువాత ఆవూరి ముత్తయిదువల భోజనాలుకూడా సంతృప్తిగానే పూర్తయినయి ఎటివంటి లోటూ లేకుండానే. తనయిద్దరికూతుళ్ళతో జాహ్నవికూడా భోజనానికి వచ్చింది. సతి అన్నపూర్ణ దృష్టిని ఆకర్షించగలిగింది. భోజనాలైన తరువాత తాంబూలాలందుకుని ముత్తయిదువలంతా వెళ్లి పోతూంటే జాహ్నవికూడా వెళ్లబోయింది. కాని అన్నపూర్ణ ఆమెతో, "నీతో మాట్లాడాలివుండోదినా. తరువాతపోవచ్చులే" అని చేయిపట్టుకుని కూర్చోపెట్టింది. ఇంట్లో హడావిడంతా సర్దుమనిగింతరువాత తానుకూడా ఒక చిన్నపీట వేసుకుని జాహ్నవి సరసనకూర్చుంది అన్నపూర్ణ. "ఏంవదినా మీ పెద్దమ్మాయికి నోన్నె యే డిప్పుడు?" అని అడిగింది జాహ్నవిని చనువుగా. జాహ్నవి తలవంచుకుని, "పదమూడు, పద్నాలుగేళ్ళుంటయి" అంది జాహ్నవి.

"మరెక్కడనాన్న పెళ్ళనుకుంటున్నారా లేదా?"

"ఏదోవస్తున్నారు, పోతున్నారు యింకెక్కడా ఖాయపడలేదు."

"ఇంత! అందమైన పిల్లని ఎగరేసికెళ్ళాల్సింది. ఇంకా ఖాయంకాకపోవడమేమిటి?" జాహ్నవి మారుమాట్లాడక నిశ్శబ్దంగా కూర్చుంది. "మావిశ్వేశ్వరుడికి యిటువంటి పెళ్ళామే దొరికితే ఎంతబాగుంటుంది" అంది అన్నపూర్ణ. సతి యిదివిని తలవంచుకూర్చుంది. శరీరమంతా చెమటలు కారసాగినయి.

"మీ విశ్వేశ్వరుడికేమమ్మా, యింతకంటే వందరెట్లు అందమైనవాళ్ళూ లక్షలు కుమ్మరించేవాళ్ళూ వచ్చి కాళ్ళకడిగి పిల్లనిచ్చిపోతారు."

"వూరువూరంతా మీ పిల్లలిద్దర్నీ గురించి ఎంతో గొప్పగా చెప్పుకుంటూరు. రజస్వలయినతరువాత నీ కూతుళ్ళిద్దర్నీ నే నింత వరకూ చూడలేదు. సరే యీమాటలకేం గాని నేను నీకు మాట యిస్తున్నా మీ పెద్దమ్మాయిని మాకివ్వు." యిది వినేసరికి జాహ్నవి శరీరమంతా విద్యుల్లత ప్రవహించినట్లయింది. మాట్లాడుదామంటే నోరు లేవలేదు, "అంతటి అదృష్టమా మా అమ్మాయికి?" అంది క్షీణకంఠంతో.

"అమాటలన్నీ కట్టిపెట్టవమ్మా, వదినా, నీకూతురుకేం? సాక్షాత్ లక్ష్మీదేవి. అదృష్టం నీ పిల్లది కాకపోతే యింకెవరిది? సతీ! కొంచెం నాదగ్గరికొచ్చి కూర్చోమ్మా, నీకు చెమటెక్కువగా పోస్తూన్నట్లుంది! అని సతిని దగ్గరగా కూర్చోపెట్టుకొని తన పైట కొంగుతో గాలి విసరసాగింది అన్నపూర్ణ. చెమటకారటం ఎక్కువయింది. సావిత్రి అక్కదగ్గరకు కొద్దిగా జరిగి కూర్చుని అక్క ముఖంవైపు చూచి ముసిముసి నవ్వులు నవ్వడం మొదలెట్టింది.

"వెళ్ళొస్తానమ్మా, యిప్పటికే చాలాప్రొద్దు పోయింది" అంది జాహ్నవి.

"అయితే నే అడిగినదానికి ఏం సమాధానం చెప్పిపోతున్నావ్ మరి?"

"మా సతి మీపాదదాసిగావడంకంటె యింకా అదృష్టం ఏముంటుంది? మీరడిగిప్పుడు యివ్వడానికి నాకేం అభ్యంతరం లేదు. అయితే విశ్వేశ్వరుడి అభిప్రాయంకూడా తెలుసుకోవాలిగా."

"మీసతిని మా విశూచేసుకోనంటే యిక వాడిముఖాన పెళ్ళిగీతలేనట్టే. చూడు వదినా యీమాట నీకడుపులో పెట్టుకో. మావాడు వట్టి మొండివెధవ, మహా పట్టుదలగలమనిషి. ఆనోట

ఆనోటపడి వీడి చెవిదాకావస్తే యింటికొచ్చి నామీద కారాలు మిరియాలునూరినానాగోల, రభస చేస్తాడు. నేనేవాణ్ణి చల్లగా చెప్పి ఒప్పిస్తా. నువ్వేమీ సంకోచంపెట్టుకోకు. కళ్ళకద్దుకుని ఎగరేసుకెళ్లారు నీకూతుర్ని చూచినవాళ్ళంతా. నామాట నమ్ము. ఇక రెండునెళ్ళంటే రెండునెళ్ళు ఓపికపట్టు."

ఇంటికొచ్చి జాహ్నవి యీమాటకాస్త భట్టాచార్య చెవిలో వూదింది. నిదురపోతున్న భట్టాచార్య చివుక్కున లేచి కూర్చున్నాడు సంతోషం పట్టలేక. ఒక్క క్షణంసేపు కష్టాలన్నీ మరచిపోయాడు. "ఇంకా మనకు దిగులు దేనికి? మన అమ్మాయి విశ్వేశ్వరయ్యభార్య అయితే మనకష్టాలన్నీ కట్టిపెట్టి యిక వుట్టిమీద పెట్టినట్లే. ఇక మనకు అప్పుబాధలుండవు" అన్నాడు భట్టాచార్య సంతోషావేగంతో.

"ఇప్పణ్ణుంచే యింతపిచ్చివాళ్ళవబోకండి. ఇంతకూ అయ్యోరాతలుంటే తప్పుతుందా. బ్రహ్మరాత ఎవరు తప్పించుకుంటారు? మనం ఎన్నుకున్నా ఆరెండుముళ్ళూ పడి, ఆ చారెడు గింజలూ నెత్తిన పడేయోగముండాలి" అంది జాహ్నవి.

"వాళ్ళు మాటంటే తప్పే మనుష్యులు కారు. మాటకోసం ప్రాణాలిస్తారు వాళ్ళు. విశ్వేశ్వరుడుకూడా చాల బుద్ధిమంతుడు. అదికాకపోయినా మన అమ్మాయి మాత్రం ముక్కు ముఖంకలిగి అందమైన ఆడపిల్ల లీవూరిమొత్తంమీదెవరున్నారు?"

కూతురు రూపగుణాల్ని చూచుకుని భట్టాచార్య గర్వపడ్డాడు. జాహ్నవి అలాగే నిలబడివుంది నిశ్చలంగా మారుమాట్లాడకుండా.

రెండుమూడు రోజులయినతరువాత అన్నపూర్ణ సతిక, సావిత్రికి తనయింటికి అన్నానికి చెప్పితీసుకెళ్ళింది. అన్నానికి పోవడానికి సతికి సిగ్గేసిందికాని పోకతప్పలేదు. అన్నపూర్ణ వాళ్ళయిద్దర్నీ దగ్గరకూర్చోపెట్టుకుని ఏదోమాట్లాడసాగింది. స్నానం ముగించిపొడి గుడ్డ కట్టుకుని జంధ్యం రెండు చేతుల్తో రుద్దుకుంటూ విశ్వేశ్వరుడు

పిన్ని దగ్గరకొచ్చి యీపిల్లలిద్దర్నీ చూచీచూడడంతోటే క్షణం సేపు శిలాప్రతిమలా నిలబడిపోయాడు. చల్లగా పిన్ని సరసనచేరి, "ఎవరమ్మాయిలు పిన్నీ వీళ్ళిద్దరూ?" అని ప్రశ్నించాడు.

"నువ్వే ఆలోచించి గుర్తుపట్టు చూద్దాం" కన్నార్పకుండా విశ్వేశ్వర్ ఆపిల్లలిద్దరివైపు తదేకధ్యానంగా చూచాడు. సిగ్గేసి తలవంచుకుంది సతి. అన్నపూర్ణ మనస్సులోవున్న వుద్దేశ్యం సావిత్రి తెలుసుకోగల్గింది. కొంచెంసేపుండి, "పిన్నీ! ఈ అమ్మాయ్ భట్టాచార్యగారమ్మాయ్ సతిలాగావుంది. మరి యీ రెండో అమ్మాయ్ ఎవరు?" అని అడిగాడు.

"సతి చెల్లెలే సావిత్రి. చూడరా విశూ, ఎంత అందమైన పిల్లలో! బంగారుబొమ్మలు.' అంది అన్నపూర్ణ.

"ఇవ్వాళకూడా ఏమన్నా వ్రతం తలపెట్టావా పిన్నీ? వీళ్ళని అన్నానికి పిలిచినట్లుంది."

"వ్రతాలకు, పండుగలకు పబ్బాలకేగాని లేకపోతే పరిచయస్తుల్ని చుట్టాల్ని అన్నానిక పిలవకూడదా? సరే నువ్విక్కడ కూర్చుని మాటాడుతూవుండు నే వెళ్ళి లోపల భోజనాలు వడ్డించి వస్తా."

అన్నపూర్ణ యింటిలోపలికి వెళ్ళిపోయింది. విశ్వేశ్వర్ ఎదురుగావున్న కిటికీలో నక్క కూర్చుని, "సతీ, మీతమ్ముడిపేరేంటి? వాడి నెందుకు తీసుకురాలేదు?" అని అడిగాడు.

సిగ్గుచేత చచ్చినంతపనైంది సతికి. ముఖమంతా కందిపోయింది. చెవులు గుయ్‌గుయ్‌మంటున్నయ్. శరీరమంతా చెమటలతో తడిసిపోయింది. అక్కయ్యస్థితిచూచి సావిత్రి మృదువుగా జవాబిచ్చింది. "వాడిపేరు కాలీశంకర్. మే మొచ్చేటప్పుడు వాడు నిద్రబోతున్నాడు."

"అయితే, సతీ నువ్వెంతవరకు చదువుకున్నావ్? ఏ, ఏ, పుస్తకాలు చదివా? రామాయణ మహాభారతాలు చదివావా?"

ఎన్ని ప్రశ్నలేసినా విశ్వేశ్వరుడికిమాత్రం జవాబుచెప్పలేక పోయింది సతి. సతి యింతగా సిగ్గుపడడం విశ్వేశ్వరుడికేమీ బాగుండలా. తనలో తాను చాలకష్టపడ్డాడు. అక్కయ్య తరపున సావిత్రి జవాబిచ్చింది. "మాఅక్కయ్య రామాయణ మహాభారతాలు రెండూ చదివేసింది."

"మరి, నువ్వుకూడా చదివావా?"

"ఇప్పుడు సావిత్రికూడా సిగ్గేసి తలవంచుకుంది"

ఇంతలో భోజనాలకు పిలుపువచ్చింది లోపలినుండి. భోజనాలయాక సతి సావిత్రి యింటికి తిరిగిపోయారు. సమయంచూచుకుని అన్నపూర్ణ విశ్వేశ్వరుణ్ణడిగింది.

"ఏంరా! విన్నూ, వాళ్ళిద్దర్లో ఎవరు నచ్చారు నీకు?"

"నా కంటికి యిద్దరూ నచ్చారు. దేనికిదంతా అడుగుతున్నావ్?"

"వూరకనే నువ్వేమంటావో చూద్దామని అడుగుతున్నాలే. ఒరేయ్, సతిచూడరా ఎంత అందంగావుందో! చేత్తో చేసిపెట్టిన బంగారు బొమ్మలాలేదూ? ఎన్నిసార్లు చూచినా మనస్సుతీరదు."

"చూస్తానికి నిజంగా యిద్దరూ అట్లాగేవున్నారు. అయితే పిన్నీ! వాళ్ళకుటుంబం ఎలాగడుస్తుందిప్పుడు? ఏం కష్టాల్లేకుండా సాఫీగానే నడిచిపోతుందా?"

"వాళ్ళతల్లిదండ్రుల కెప్పుడూ యీ పిల్లలిద్దరిదే దిగులు ఇద్దరూ రజస్వలయి యింట్లో కూర్చున్నారు. ఈ దిగులుచింతల్తోనే దిగులుపడి సగమైపోయారు వారి తల్లిదండ్రులు.

"దానికోసం దిగులెందుకు?"

"ఆడపిల్లకి పెళ్ళిచేయాలంటే సామాన్యమనుకున్నావట్రా? అందులో అందమైన ఆడపిల్లలకి తగిన మొగుడు దొరకాలంటే మహాకష్టం. కులంగోత్రం, చదువుసంధ్యా, రూపం గుణం యిన్నీ సమకూడినవాణ్ణి కులమంటి కోతిని పట్టుకొచ్చినా, పిల్ల నచ్చినా తీరా వచ్చేటప్పటికి కట్నందగ్గర గొంతుపట్టుకుని వెనక్కి జారా

లని వస్తుంది. ఈ రోజుల్లో మగపిల్లలే కరువైపోయారు. అందుకనే యీ కట్నాల బెడద. ఆడపిల్లలు చూద్దామా అంటే కుప్పలు కుప్పలుగా పడున్నారు దేశంనిండా."

"అయితే వాళ్ళకు మనం కొద్దిగా డబ్బెందుకు సర్దకూడదమ్మా?"

"అబ్బో! దానంచేసే మొగాడివి బయలేరివచ్చావ్ ఎట్లాగైతేనేం నీదగ్గర దాచుకోను తావులేక నాకే డబ్బంటే పిల్ల అందానికితోడు తగిన అంప గాడు దొరకొద్దురా?"

"అయితే తగిన అంద గాణ్ణి నేపట్టుకొస్తా గాని నువ్వు వాళ్ళకు కావలసిన డబ్బు అందిస్తావా?"

"పో వెధవా నీతో బుర్రెవరు బ్రద్దలుచేసుకుంటారు?" అని పిన్ని విసుక్కుంది. ఇంతకూ పిన్ని మాటల్లోని రహస్యాన్ని గ్రహించలేకపోయాడు విశ్వేశ్వర్. నవ్వుకుంటూ లోపగదిలోకెళ్ళి పుస్తకాలు ముందేసుక్కూర్చున్నాడు.

రెండు మాసాలు గడిచిపోయినయ్ విశ్వేశ్వర్ వత్తె తెలివి తక్కువవాడిలాగా కనిపించాడు అన్నపూర్ణకు. చెప్పినమాట వినేవాడు కాదనుకుంది. వట్టి మొండివెధవ అనుకుంది. చెప్పదలచుకున్న మాట నేరుగానే చెప్పేస్తే బాగుండునని తలంచి ఒకనాడు దగ్గర కూర్చోబెట్టుకుని, "చూడువిశూ! వచ్చేనెలలోనే సతినిప్పించి నీకు పెళ్ళిచేయిస్తా ఏర్పాటంతా అయిపోయినట్లే."

విశ్వేశ్వరుడికి ఆశ్చర్యమేసింది. "అదేమిటిపిన్నీ, అట్లా ఎందుకు చేశావ్? సతి మనకేమన్నా చుట్టమా? పక్కామా?"

"నీకా అనుమానం దేనికొచ్చింది. పెళ్ళిచేసుకోడానికి చుట్టమే కావాలా? మనకులమైతే చాలదూ? అయినా దూరపు చుట్టాలుకూడాను. దీనికేం బాధరా?"

"బాధెందుకులేదుపిన్నీ. భట్టాచార్య పెద్దకొడుకు నన్నెప్పుడూ అన్నాయ్, అన్నాయ్ అని పిలిచేవాడు. వాళ్ళింట్లో వాళ్ళంతా మొన్నమొన్నటివరకూ నన్ను అన్నాయ్ అనే పిలిచే

వారు. హారే రాం! హారే రాం!! వరసా వాయిలేని పెళ్ళి నా కెందుకు చేయ తలపెట్టావ్ పిన్నీ?"

"అయితే నువ్వింక పెళ్ళిచేసికోవా? ముందెప్పుడో చేసుకోవాలంటే యింత అందమైన బుద్ధిమంతురాలు దొరకడం కష్టంసుమా! చెప్పేదికాస్తా శ్రద్ధగావిను."

"పిల్లలెందుకు దొరకరూ? లెక్కలేనంతమంది దొరుకు తారు. అందమైన ఆడపిల్లేగా నీకు కావల్సింది? నీమీద ఒట్టేసు కుని చెప్తున్నా. నేనటువంటి పిల్ల నేగనుక పట్టుకురాకపోతే నా పేరు మారుపేరు పెట్టు. నామీద దయవుంచి పెళ్ళివిషయం యిక నాముందు ఎత్తవద్దు పిన్నీ!"

ఇప్పుడు పెళ్ళిచేసికోకపోతే యింకెప్పుడు చేసుకుంటావురా? ఇరవై నాళ్ళేళ్ళు వచ్చినయి. ఎల్లకాలం ఆ పిల్ల చేష్టలేనా? సరే, విశూ! యిదే యిక ఆఖరిసారిగా చెప్తున్నా. నీతరపున వాళ్ళకు నేను మాటిచ్చివున్నా. నామాట దక్కించి నువ్వు నాపరువు కాపాడాలి. వాళ్ళముందు నన్నవమానంచేస్తావా? పాపం, నామాట నమ్ముకుని ఈ రెండు నెలలనుంచి ఎంతో ఆశపెట్టుకూర్చున్నారు వాళ్ళంతా. వాళ్ళ అమ్మాయిని చేసుకోకపోయావంటే, యిక యీ అవమానం భరించేబదులు యిల్లు వదిలిపెట్టి ఎటయినా వెళ్ళి పోవడం మేలునాకు. ఇక ఒక్క ఘడియకూడా యీ యింట్లో వుండలేను.

నిరాశజెంది విశ్వేశ్వర్ అన్నాడు, "పిన్నీ యిన్నాళ్ళనుండీ నన్ను క్షమిస్తూ వచ్చావ్. ఇంకా ఒక్క సంవత్సరంవరకు నన్ను క్షమించు నీకాళ్ళు పట్టుకుంటా మనస్సు గట్టిపరచుకోనివ్వు నన్ను."

"ఇంకా మనస్సు గట్టిపరచుకునే దేమిటిరా? ప్రపంచంలో నీయీడువాళ్ళందా పెళ్ళిళ్ళుచేసుకొని పెళ్ళాలతో కాపరాలు చేసుకోవడంలా?"

"ఎందుకు చేసుకోవడంలా? చేసుకుంటానే వున్నారు. నేనింతవరకూ ఏపెళ్ళీ చేసుకోలేదు. అందుకనే భయమేస్తుంది.

ఇంతవరకూ మనస్సు స్వాధీనపరచుకున్నా. ఇకముందుకూడా అలాగే వశపరచుకుని వుండాలనుకుంటున్నా. నువ్వు బలవంతం చేశావంటే నా ఆశలన్నీ యిక బూడిదపాలైనట్లే. నన్ను బాధ పెట్టకు పిన్నీ!"

నోరెత్తలేక అన్నపూర్ణ అంది, "విశూ! ఎదిగిన పిల్లని యింకా సంవత్సరందాకా వాళ్ళిక ఆపలేరు. ఇక వాళ్ళకు నాముఖం మెట్లా చూపగల్గేది? ఇక నేనీవూళ్ళో వుండలేనురా."

"నువ్వీవూరు వదలిపెట్టితే నేనూ నీతోపాటే వస్తా. చూడు పిన్నీ, వాళ్ళకు నాకంటె గొప్పవాణ్ణి తీసుకొచ్చి పెళ్ళిచేయిస్తా. ఆయేఖర్చు నేనే పెట్టుకుంటా. యింకా వాళ్ళకు కష్టమేనిటి?"

"నువ్విక నీయిష్టమొచ్చినట్లు పూరేగు. విశ్వేశ్వర్, చేతి కందిన మాణిక్యాన్ని కాళ్ళతోతన్ని అవతల పారేస్తున్నావ్. జీవితమంతా పశ్చాత్తాపపడవలసి వుంటుంది నువ్వు." ఇంకేమీ మాట్లాడలేక నోరుమూసుకూర్చుంది అన్నపూర్ణ. ఆమె హృదయం చాల బాధపడింది. భరింపరాని వేదనతో ఆమె లోలోపల బాధపడింది. ఆమె మనోబాధను విశ్వేశ్వర్ గ్రహించ గలిగాడు కాని తన మనస్సుమాత్రం మార్చుకోలేకపోయాడు.

పెళ్ళంటేసరి అతనికి తలనొప్పివచ్చేది. ఆజన్మబ్రహ్మచారిగా వుండాలని భీష్మప్రతిజ్ఞపూనినట్లు గా వుంది చూడబోతే. సతిని యిందుకే కాబోలు పిన్ని పిలిచింది అని అర్థం చేసుకోగలిగాడిప్పుడు విశ్వేశ్వర్.

రెండోరోజు విశ్వేశ్వర్ భట్టాచార్యదగ్గరకెళ్ళి, "సతికి నేను మంచిసంబంధం కుదిర్చాను. చెల్లెలికి మంచి సంబంధం మాట్లాడి కుదర్చడంలో అన్నకుండే అధికారాన్నే నేనూ తీసుకుని యీ పెళ్ళిఖర్చంతా నేనే భరించాలనుకుంటున్నా" అన్నాడు.

ఇది వినేసరికి భట్టాచార్య కళ్ళకు లోకమంతా చీకట్లు క్రమ్ముకొచ్చినట్లుగా కనిపించింది. ఎటుచూచినా చీకటిసారలే కని పించినయ్. అతని ఆత్మాభిమానానికి తీరని అఘాతం గల్గింది.

"నా కూతురు యింతటి నిర్భాగ్యురాలా? ఇంతటి హీను రాలా?" అనుకున్నాడు తనలోతాను. సగర్వంగా విశ్వేశ్వర్‌తో "వద్దుబాబూ అంతపనొద్దు. ఇప్పటికే మీకు నేను చాల ఋణపడి వున్నా. ఇంకా యీఋణం అదనంగా నామెడకెందుకు చుట్టారు? నా పిల్ల పెళ్ళినిగురించి తాడోపేడో నేనే తేల్చుకుంటా. దీన్ని గురించి నువ్వేం దిగులుపెట్టుకోవద్దుబాబూ" అన్నాడు.

భట్టాచార్యని వప్పించాలని శతవిధాలా ప్రయత్నం చేశాడు విశ్వేశ్వర్. ముసలిబ్రాహ్మడు పట్టినపట్టుమాత్రం వదల్లేదు. చేసేది లేక నిరాశజెంది చేతులు నలుపుకుంటూ యింటికొచ్చి జరిగిన కథంతా అన్నపూర్ణ చెవిలో వూదాడు. అన్నపూర్ణ మనస్సును లజ్జ దుఃఖము ఒక్కసారిగా కలతచెందించినయి. "ఇప్పుడిక ఒక్క క్షణంకూడా వుండలే నిక్కడ. కొన్నిరోజులు దేశయాత్ర చేసివస్తా. వాళ్ళకిక నాముఖమెట్లా చూపగలేది. ఇక నా ప్రయాణానికి తగిన ఏర్పాటుచేయ్." అని సాభిమానంగా అన్నది అన్నపూర్ణ.

మారుమాట్లాడకుండా చేయవలసిన ఏర్పాటంతా చేసి పిన్నిని సాగనంపడానికని స్టేషనుదాకా వెళ్ళాడు విశ్వేశ్వర్. తన్ను పంపించడానికి స్టేషన్ దాకా వచ్చాడని అన్నపూర్ణ అనుకుంది. తీరా బండి కదలిపోయేటప్పటికి చటుక్కున బండిలోకెక్కి కూర్చు న్నాడు విశ్వేశ్వర్.

"నువ్వెక్కడికిరా?" అని అడిగింది అన్నపూర్ణ. "నువ్వెళ్ళే చోటికే నేనూ. పిన్నీ, తల్లి చనిపోయిందగ్గరనుండి కన్నతల్లిలాగా ప్రేమించి పెద్దవాణ్ణిచేసి తల్లిలేని లోటు తీర్చావు. నన్నిప్పుడు తల్లి లేని పిల్లాణ్ణిచేసిపోతావా? యిది నీకు న్యాయమేనా?" అంటూ కంట తడిపెట్టాడు విశ్వేశ్వర్. కొడుకుమాటలకి హృదయం కరిగి మారు మాట్లాడలేక విశూ తలను తన ఒడిలోకి తీసుకుంది అన్న పూర్ణ.

---

# 6

సర్వస్వం కోల్పోయినతరవాత మానవునికి నిశ్చింతభావమేర్పడిన విధంగా, మృత్యువుకు పూర్వం బహుబాధలుపడ్డ రోగిముఖం మీద మృత్యువుతరవాత శాంతిఛాయలు గోచరించినరీతిగా సతికి పెళ్ళిచేసి రామశంకర్ కూడా తనేదో పెద్దబాధనుండి విముక్తి పొందినట్లుగా నిట్టూర్పు విడిచాడు. ఇప్పుడిక రామశంకర్ మనస్సు కుదుటబడినట్లయింది. పీనాచి వృద్ధ జమీందారొకడు మూడువందలరూపాయలు స్వీకరించి భట్టాచార్యకూతుర్ని తన భార్యగా స్వీకరించాడు. ముసలిగాని, కుంటిగాని, గుడ్డిగాని ఎవరైనాసరే తనకూతురునిచ్చి ముడిపెట్టి తన జాతివాళ్ళల్లో కూతురికి పెండ్లికాలేదనే వాదొకటి రాకుండా తప్పించుకోవాలని చూశాడు భట్టాచార్య. తనయిల్లు కాస్త తాకట్టుపెట్టి కట్నంక్రింద మూడు వందలరూపాయలు సంపాదించాడు. కూతురికి పెండ్లిచేయకపోతే కులంలోనుంచి తనకులంవాళ్ళు వెలిపెట్టవచ్చుననే భయంకూడా కలిగింది భట్టాచార్యకు. ఇక తనకుమిగిలింది తాను నౌకరీచేసి నెలకు తెచ్చే పదిరూపాయలూ, తన రుగ్నశరీరమూ. యివి రెండే తనవద్ద చివరికి మిగిలిన ఆస్తిపాస్తులు. అతనికక బ్రతుకే భారమైపోయింది. ఎక్కువకాల మిక బ్రతుకలేనని అతనికి దృఢనమ్మకమేర్పడింది. ముసలితనంలో మతికూడా చెడిపోయింది. పెద్దకొడుకు ఎప్పుడైనా చూచిపోవడానికి యింటికివస్తే నానాచీవాట్లుపెట్టి యింటినుంచి వెళ్ళిపోయేదాకా వూరుకునేవాడు కాదు. సతి తన కంటపడితే నోటికొచ్చినట్లల్లా ఏమేమో అనేవాడు. చిన్నకొడుకు కాళీశంకర్‌ను కొట్టనిరోజులేదు. సావిత్రినిచూచి ముఖం తప్పించేవాడు. భార్య, వదినలతో నోరిప్పి మాట్లాడడమే మానేశాడు. ఇంత జరుగుతున్నా కడుపులో దుఃఖం కడుపులోనే అట్టిపెట్టుకుని యింటిగుట్టు ఎవరికీ తెలియనిచ్చేదికాదు జాహ్నవి. ఇంతవరకూ కాపురంగుట్టు బజారుపాలు కాకుండా కాపాడుకుంటూవచ్చింది. అప్పుడప్పుడూ భట్టాచార్యకు గుండెనొప్పి తెరలు తెరలుగా వచ్చేది. మహాబాధ

పడేవాడు. బాధ కలిగినపుడల్లా, "హరేరాం, హరేరాం" అంటూ రామనామస్మరణతో రాత్రంతా నిదురలేకుండా గడిపేవాడు. ఆయనబాధ చూడలేక భార్యగాని, కూతుళ్ళుగాని కాస్త వుపచారం చేయడానికి దగ్గరకొస్తే వాళ్ళను ముక్కచీవాట్లుపెట్టి అవతలికి పోయిందాకా వూరుకునేవాడు కాదు. సతికి పెళ్ళయి ఆరుమాసాలు నిండినయి. రోజురోజుకూ భట్టాచార్య నీరసించి పోతున్నాడు. అయినా నౌకరీకోసం కోర్టుకిమాత్రం పోవడం నాదాపడకుండా చూచుకుంటున్నాడు.

ఒకరోజు సాయంత్రం ఆకాశమంతా కారుమేఘాల్తో నిండి పోయింది. గాలిదుమారం మొదలెట్టింది. సతిసావిత్రి యింటిపనులు చేసుకుంటున్నారు. చేసే చేసేపని వదిలిపెట్టి బయటివాకిలిదగ్గర కొచ్చి అప్పుడప్పుడూ తొంగిచూచిపోయేది జాహ్నవి. ఇవ్వాళ భట్టాచార్య యింకా యింటికిచేరలేదు. కారుచీకట్లు నలుమూలల కమ్ముకొస్తున్నయ్. జాహ్నవికి దిగులు దిగులుగావుంది. చేతిలో జపమాల తీసుకుని తోడికోడలు వూరింతా ఒకసారి ప్రదక్షిణంచేసి వచ్చింది.

చిలికి చిలికి గాలివాన ఆరంభమైంది. పెద్ద తుఫాను హోరుమని ధ్వనిచేస్తూ ప్రళయంలాగా వచ్చిపడింది. పూరిళ్ళ కప్పులన్నీ గాలిలో ఎగిరిపోయి ఆకాశాన్నంటుతున్నయ్. చిన్నచిన్న యిళ్ళన్నీ నేలమట్టమౌతున్నయ్. ఇంటిముందు ఎటుచూచినా కన్ను పొడుచుకున్నా కానరాని కటికచీకటి వ్యాపించివుంది. ఇంటిముందున్న చిన్న చెట్లన్నీ కూకటివేళ్ళతో సహా మెలికలు తిరిగి నేల కరుచుకున్నయ్. ఇంటిముందలి మామిడిచెట్టునుండి మామిడికాయలన్నీ ఎవరో ఎక్కి దులిపినట్లుగా జలజలమని ఒక్కొక్కటే క్రిందికి రాలసాగినయి. జాహ్నవి తోడికోడలు నెత్తిన ఎగురుబద్దలబుట్ట పెట్టుకుని ఆ కటిక చీకట్లోనే రాలిన మామిడికాయలన్నీ ఒకటొక్కటే ఏరుకురావడానికి పోయింది. ఒక్కటంటే ఒక్క మామిడికాయకూడా దొరకనందున గాలిదేవుణ్ణి వానదేవుణ్ణి వెయ్యి శాపనార్థాలు పెట్టింది.

జాహ్నవి చూపుమాత్రం బయటివైపే వుంది. బయటివాకిలి దగ్గరకొచ్చి కొయ్యబొమ్మలా నిలబడింది బయటివైపే చూస్తూ కూతుళ్ళిద్దరూ అమ్మముఖంచూస్తూ ఆమెప్రక్కనే నిలబడ్డారు. వాళ్ళ చిన్నతమ్ముడు కాళీశంకర్ అమ్మపైటచెంగు పట్టుకుని అమ్మ నానుకుని నిలబడ్డాడు. జాహ్నవి హృదయంలో భయాందోళనలు ఎక్కువైనయి. గుండెదడ ఎక్కువయింది. ఏమేమో భయం భయంగావుంది హృదయంలో. "అమ్మా" అని పిలిచాడు కాళీ శంకర్. మారుమాట్లాడక జాహ్నవి తెఱచినకళ్ళు తెరచినట్లుగానే కన్నార్పకుండా బయటివైపే చూస్తూ నిలబడిపోయింది. వాన చినుకులు ఎక్కువయినయి. తోడికోడలు దొరికినంతవరకూ ఒకటో రెండో రాలిన మామిడికాయలు నెత్తినున్న బుట్టలో వేసుకుని యింట్లోకి పరుగెత్తబోయింది. ఇంతలో కాలుజారి కూలబడింది. సావిత్రి పరుగెత్తుకుంటూవెళ్ళి పెత్తల్లి చెయ్యి పట్టుకుని పైకలేపింది. కాలికి గట్టి దెబ్బతగలడంవల్ల పెద్దపెద్దగా శోకాలు మొదలెట్టింది జాహ్నవి తోడికోడలు. ఇంత కుంభకోణం జరిగినా జాహ్నవి కేమీ తెలిసినట్లే లేదు. అచంచలప్రతిమలాగా ద్వారందగ్గర అలాగే నిలబడివుంది. కోపోద్రేకంవల్ల గోదావరి కృష్ణలు కట్టలు తెంచుకుని చుట్టుపట్ల గ్రామాలపైబడి అనేకపశువుల్ని, జనాన్ని, ఆస్తిపాస్తుల్ని నష్టపరచిన విధంగానే ప్రకృతికూడా గొప్పభయం కరమైన ఆందోళన బయలుదేరదీసింది. అన్నీ తారుమారవుతున్నయ్. ఈ మహాప్రకృతి ఘోషలో ఏదోవస్తువు తఫీమని క్రిందపడినట్లు పెద్దగా చప్పుడయింది. వెంటనే గుర్రుగుర్రుమనే శబ్దంకూడా వినిపించింది. ఇది చెవినిబడేసరికి జాహ్నవి గబగబా బయటికి పరుగులుతీసింది మతి తప్పినదానిలాగా. కూతుళ్ళిద్దరూ తల్లి వెంటే పరువులుతీశారు. క్రింద కాళ్ళుజారుతున్నయ్. పైన వర్షానికి తడిసి పోతున్నారు. అయినా పదిగజాలు ముందుకు ఆకటికచీకట్లో నేపరువులు తీశారు. ఆకటిక చీకట్లోనే జాహ్నవి కాలికి ఏదో కొట్టుకోవడంచేత వెలికిలాపడింది. జాహ్నవి లేచి చూచేప్పటికి అది ఎవరోకాదు తన భర్తే బోర్లగా నేలకు

కరుచుకుని వుండడం గమనించింది. రెండుచేతులూ పట్టుకుని పైకి లేపింది. కూతుళ్ళిద్దరూ తండ్రిని వాటేసుకుని "నాన్నా! నాన్నా!!" అంటూ ఆర్తనాదం చేయసాగారు.

"వూరుకోండమ్మా, వూరుకోండి నావొక్కదానికి వీలు కావడంలేదు. మీరుకూడా కాస్త చేయూతనివ్వండి" అంది దిగులుగా జాహ్నవి తనకూతుళ్ళిద్దరూ ఏడవడంచూచి.

జాహ్నవి శరీరమంతా గడగడావణుకసాగింది. అంతా కటిక చీకటి. మహాకష్టంమీద వాళ్ళు ముగ్గురూ కలసి స్పృహతప్పిన భట్టాచార్యని యింటిలోకి తీసుకొచ్చి పడుకోబెట్టారు. అప్పటి వరకూ కాలిబాధవల్ల శోకాలుపెట్టే జాహ్నవి తోడికోడలు యిదిచూచి ఏడుపుమానింది. "అమ్మా, అమ్మా కాస్త నిప్పురాజేయి" అని సతికేకేసింది.

కుంటూకుంటూపోయి ఆమె నిప్పురాజేసింది. భట్టాచార్య వంటిమీగ తడిగుడ్డలన్నీ విప్పేసి పొడిగుడ్డలు కట్టి మంచంమీద పడుకోబెట్టారు. ఇప్పటికీ యింకా స్పృహలోకి రాలేదు భట్టాచార్య. సతి తండ్రిదగ్గర కూర్చుని కాళ్ళూ చేతులూ పిసుకుతూ వుంది. పెదగుడ్డ నొకదాన్ని వెచ్చజేసి భట్టాచార్య చేతులు కాళ్ళపై రుద్ది వేడిచేస్తున్నారు. సావిత్రి ఒక్కసారిగా, "నాన్నా" అని బిగ్గరగా అరచింది. ఈ కేకకు యిప్పటిదాకా భయపడి మూలన దాక్కున్న కాళీశంకర్‌గుండె చిక్కబట్టి పెద్దపెట్టున ఏడ్పు సాగించాడు.

"కాళీ, ఎందుకేడుస్తున్నావ్ నాయనా? నాన్న బాగానే వున్నాడులే, వూరుకో" అని వాణ్ణి కాస్త బుజ్జగించి అమ్మతో "అమ్మా! కాసినిపాలు వేడిచెయ్యవే" అంది సతి.

"నేను లెగవలేను, నువ్వేపోయి వెచ్చచేసి తీసుకురా" అంది జాహ్నవి కూతురుతో. పాలు వెచ్చచేసుకొచ్చి తండ్రిగొంతులో కొద్ది కొద్దిగా పోసింది సతి. రెండు పాలచుక్కలు గొంతులోకి పోయిన తరువాత భట్టాచార్య ప్రాణంలేచి వచ్చినట్లయింది.

కొంచెం అటూ యిటూ కదులాడాడు. ప్రక్కనున్నవారికి కొంచెం ధైర్యం కలిగింది. కళ్ళు తెరచి చూచాడు భట్టాచార్య. "నాన్నా" అని పిలిచింది సతి. సతివంక చూస్తూ ఎవరూ అని అడిగాడు భట్టాచార్య.

"నేను నాన్నా సతిని" అని జవాబిచ్చింది సతి. చావుకి సిద్ధంగావున్న భట్టాచార్య ఒక్కసారి వుత్తేజితుడై కుడిచేత్తో దగ్గరకూర్చున్న కూతుర్ని దూరంగానెట్టిపారేస్తూ, "ఛో, నా ముందు నుంచి తొలగిపో, సత్యనాశినీ, నీ ముఖం చూడకూడదు. ఇంకా ఏం చేయాలని వున్నావ్ యిక్కడ? నన్ను కోసుకు తినాలని వున్నావా? తక్షణమే తొలగిపో నా కళ్ళముందు నుంచి" అన్నాడు.

సతి దూరంగా తొలగిపోయింది. "చావుకు తయారయ్యావ్ గాని నోరుమాత్రం మూతబడలేదే" అంది ప్రక్కనుండి యిదంతా చూస్తున్న భట్టాచార్య వదిన.

"ఏమండీ యిప్పుడు వంట్లో ఎలావుంది? బాధతగ్గిందా?" అని అడిగింది జాహ్నవి.

"ఎట్లావుండేదేముంది, యివ్వాళే ఆఖరురోజు. ఇంకా దేనికి చూస్తున్నారు నావైపు? కొద్దిసేపట్లోనే నాకు చావు రాబోతుంది."

మారుమాట్లాడక కూర్చుంది జాహ్నవి. సావిత్రి ఏడుస్తూ, "అట్లా అనకు నాన్నా" అన్నది.

కూతురివైపు కండ్లెర్రజేసి చూస్తూ, "ఎందుకూ ఏడవడం? నేనన్నమాటకు ఏడవాలసినపనేముంది. నేనెప్పుడైనా తండ్రిలాగా ప్రేమతో దగ్గరకుపిలిచి లాలించానా? నే చచ్చినా బ్రతికినా మీకొకటే. నే బ్రతికినందువల్ల మీకు కలిగే సుఖమూలేదు, నే చచ్చినందువల్ల మీకు కొత్తగావచ్చే కష్టమూలేదు. బ్రతికివుండి మీకు పొట్టనిండా కూడుపెట్టగలిగానా? ఎప్పుడూ అర్ధకూడేగా? అది తినే మీరింత పెద్దవారయ్యారు. నేనుచచ్చినా మనగతి అంతే.

ఉప్పుంటే పప్పూ పప్పుంటే వుప్పూ ఎప్పుడూ కరువే. ఇక అందు ట్లో తేడా ఏమీరాదు.'' అని అరచాడు బిగ్గరగా. అంతేకాకుండా ''నేను బ్రతికుంటే నిన్నూ ఓ ముసలివెధవకిచ్చి అంటకట్టా. నేను మీకు తండ్రినికాదు. రాక్షసుణ్ణి.'' ఉద్రేకంలో ఏమేమో అని మూర్ఛ పోయాడు భట్టాచార్య. క్షణంసేపటికి తెప్పరిల్లుకుని, ''హరిగాడు వచ్చాడో వెధవని యింటినుండి తరిమెయ్యండి, నాముందునుంచి నెట్టెయ్యండి'' అన్నాడు.

''అన్నాయ్ రాలేదున్నాన్నా'' అంది సావిత్రి. ''రాలా? అయితే ఫరవాలేదు. వాడిచేత్తో వేసిన పిండాన్ని కూడా నేను ముట్టుకోను. వాడు ఎక్కడ చస్తాడో చావనివ్వండి. కాళీశంకరే వేస్తాడు నాకు పిండం వాడే నాకొడుకనుకుంటా.''

భర్తనోటిమీద చెయ్యేసి జాహ్నవి అంది, ''యిక పడుకుని నిద్రపోండి. మీరు అట్లాగే మాట్లాడుతూవుంటే లోపలిబాధ మరలా ఎక్కువవుతుంది. మీరు కాసేపు నిద్రపోండి. బాధ కాస్త తగ్గుతుంది.''

''ఇప్పుడింకేం తగ్గుతుంది నాబాధ? కాష్టంలో పెట్టినాకే నాబాధలన్నీ దూరమయ్యేది.''

బయట వానచినుకులు పడుతూనే వున్నాయ్. కప్పల బెక బెకలు కీచురాళ్ళమోతలు ఎక్కువగా వినిపిస్తున్నాయ్. బయటి కటిక చీకటి భయంకరంగావుంది. చలిగాలి చల్లచల్లగా యింట్లోకి కొడుతూవుంది. రామశంకర్‌కి నిద్రపట్టినట్లే పట్టి అట్లే మాయ మైంది. ఒక్కసారి అకస్మాత్తుగా లేచి ''ఏమేయ్,'' అని కేకేశాడు బిగ్గరగా.

''ఏమిటండీ?'' అంటూ జాహ్నవి పరుగులుతీసింది. ''కాళీ ఎక్కడున్నాడు?'' అని అడిగాడు.

''అదుగో, మీదగ్గరేగా పడుకుని నిద్రపోతున్నాడు'' అంది జాహ్నవి.

మహాకష్టంగా తన రెండు చేతులూ నిద్రబోయే కా[illegible] మీద పెట్టాడు భట్టాచార్య.



"అగేంటండీ, ఆపని?" అని అడిగింది జాహ్నవి.

"ఆశీర్వాదమిస్తున్నానే, ఆశీర్వాదం. సావిత్రి ఏదీ? నిద్ర పోతుందా?"

"నాన్నా" అంటూ సావిత్రి తండ్రిదగ్గరకు పరుగెత్తుకుంటూ వచ్చింది.

"రామ్మా రా నీకూ ఆశీర్వాదమిస్తా" అని దగ్గరకు పిలిచాడు.

"అట్లా అనకు నాన్నా, నాకు చాల దిగులుగావుంది నీ మాటలు వింటూంటే" అని ఏడ్వసాగింది సావిత్రి.

"సావిత్రీ, ఏడవకమ్మా. నువ్వేడిస్తే మీనాన్నకు బాధ ఎక్కువవుతుంది" అంది జాహ్నవి.

"లేదు, లేదు నాకేం బాధలేదు. నీకు ఆశీర్వాదమిస్తా రామ్మా! హరి, హరివాడిక్కడ లేడు. సరే వాడినికూడా ఆశీర్వదిస్తున్నా. వెయ్యితప్పులు చేసినా వాడూ నాకొడుకేగా."

"ఏమండీ, కొంచెం సతిని పిలవండి దగ్గరికి. అది దిగులుపడే దూరంగా వెళ్ళి కూర్చుంది." అంది జాహ్నవి.

"సతీ, రామ్మా రా, దగ్గరకొచ్చి కూర్చో" అని క్షీణకంఠంతో అన్నాడు భట్టాచార్య.

సతి తలవంచుకుని తండ్రిపాదాలదగ్గర నేలమీద కూర్చుంది.

"అక్కడ కాదమ్మా తలదగ్గరకొచ్చి కూర్చో నీతో రెండు మూడు మాటలుచెప్పాలి. నోరుజారి ఏదో అన్నాను యిందాక" అన్నాడు భట్టాచార్య.

తలవంచుకుని తండ్రితలవద్దకువచ్చి కూర్చుంది సతి.

"చూడమ్మా, తండ్రిచేసినపాపాలు సంతానం అనుభవిస్తుందంటారు మనపెద్దలు. నే చేసినపాపాల ఫలితాలన్నీ అనుభవిం

చారు మీరింతవరకూ. ఇప్పుడూ అనుభవిస్తున్నారు. ఇక ముందు కూడా అనుభవిస్తారు. నే నేంచేసేది. నే తెలిసిచేసినపాపం ఒక్కటీ లేదు. పూర్వజన్మంలో చేసిన పాపాలకు ఫలం ఈ జన్మలో అనుభవిస్తున్నా. నా చేతుల్తో నా సంతానాన్ని హత్యచేసుకున్నా. ఇంకేం వుపాయంలేదు. నే నేంచేసేది?''

సతినోరు మూతబడింది. జాహ్నవి అందుకుని, ''ఈ ఘడియకు యీ మాటలన్నీ మాని కాస్త నిద్రపోండి'' అంది.

''నిద్రా? ఏం నిద్ర? కొంచెంసేపట్లో పెద్దనిద్రే పోతా. అప్పుడే నా మనస్సుకు శాంతి. ఏదో బ్రతికిన రెండుఘడియల సేపూ రెండుముక్కలు మాట్లాడుదామని మాట్లాడుతున్నా. సతీ! ఎక్కడికెళ్ళా అమ్మా? ఇక్కడేవున్నావా అమ్మా? అయితే ఏం చెప్పాలో మతికి రావడంలేదు. ఏమని ఆశీర్వాదమిచ్చేదమ్మా ఇక నేనట్టేసేపు బ్రతకలేను.''

''నువ్వు బ్రతికుండగా నీ సేవచేయలేక పోయాను. నేను కూడా నీతోపాటేవచ్చి నీదగ్గరేవుండి నీ సేవచేసేటట్లుగా ఆశీర్వదించు నాన్నా'' అంది సతి.

''నేను పోయేచోట విశ్రాంతి దొరుకుతుంది. అందుకు అనుమానంలేదు. నువ్వూ వస్తావా అమ్మా? నీకేం కష్టమొచ్చింది? ఇంత చిన్నవయస్సులోనే యింతగా విరక్తి కల్గిందామ్మా నీకూ జీవితంమీద?''

భర్తను కాస్త శాంతపరుద్దామని ఆయన ఒంటిమీద నొసటిమీద నోటిమీద కాస్తచెయ్యివేసి చల్లగాసరిచేసింది జాహ్నవి. భట్టాచార్య మరలాఅన్నాడు, ''అపరాధమా, అవును. తీరని అపరాధమేచేశాను. నే చేసిన అపరాధంవిను. ఈ కటిక దారిద్ర్యంలో నేను పెళ్ళెందుకు చేసుకోవలసివచ్చింది? గృహస్తునెందుకయ్యాను? ఇంతమంది పిల్లలకు తండ్రినయ్యాను. ఈఅపరాధాలన్నింటికీ అపరాధం నాతలిదండ్రులిది. వాళ్ళపాపఫలాలు నేననుభవించాను. నాపాపఫలాలు మీరనుభవిస్తున్నారు. రామ్మా, నీకూ ఆశీర్వాద

మిస్తా. ఆశీర్వాదం. ఆ...శీ...ర్వా...దం" అంటూ అలసిపోయి మత్తునిద్రలో పడిపోయాడు రామశంకర్.

దాదాపు సగంరాత్రి గడిచిపోయింది. భట్టాచార్య మంచం చుట్టూ సతి, సావిత్రి క్రింద నేలమీదపడుకుని నిద్రపోతున్నారు. జాహ్నవిమాత్రం మంచందగ్గరగాకూర్చుని భర్తవైపే చూస్తూవుంది.

అది కాళరాత్రి. గాఢాంధకారం ప్రపంచాన్ని నమిలిపారేస్తున్నదాన్నట్లుంది. నలువైపుల భయంకరమైన నిశ్శబ్దం విలయనృత్యం చేస్తూన్నది. జగత్తంతా నిద్రావస్థలోవుంది. కాని భట్టాచార్యకుమాత్రం మత్తునిదురకనపడి మరలా నిద్రరావడంలేదు. అతని గుండెల్లో ఘుంఘుంఘూమాయితం చేస్తున్నది. అగ్నివర్షిస్తున్నది. ఏదో గొప్పప్రళయం ముంచుకొచ్చినట్లుగావుంది. ఏదో తీరనిబాధతో అతను కూలిపోతున్నాడు. కొంచెంసేపున్నతరువాత నిద్రపోతున్న సతినిలేపి, "చూడమ్మా, మీనాన్న గొంతులో ఏదో గురగురమంటుంది. ఏమిటి నోరిట్లా అదోరకంగా ఆడిస్తున్నాడు. నేనేంచేయను తల్లీ యిప్పుడు?" అంది.

"అమ్మా పోయి డాక్టరుని పిలుచుకొస్తే?" అని అడిగింది

"ఈ అర్ధరాత్రిలో ఎవరెళ్ళొస్తారు?" సావిత్రి లేచికూర్చుని, "నే వెళ్ళొస్తానమ్మా" అంది. "నువ్వుచిన్నదానివి, ఒంటరిగా వెళ్ళలేవు" అంది తల్లి.

"నువ్వింతలోకి నిప్పువెలిగించు. డాక్టరుగారిల్లు చాలదగ్గర. నేనువెళ్ళి క్షణంలో పిలుచుకొస్తాలే" అని పరుగెత్తుకుంటూ పోయింది సావిత్రి. ఇంతలో సతి, జాహ్నవి వేడిగుడ్డతో భట్టాచార్య శరీరాన్ని వెచ్చజేయసాగారు. అరగంటసేపట్లో డాక్టరుని వెంబడేసుకుని వచ్చేసింది సావిత్రి. డాక్టరును చూచేసరికి యింట్లోవాళ్ళ ప్రాణాలన్నీ లేచివచ్చినయ్. భట్టాచార్య చేయిచూచి డాక్టరు మాట్లాడకుండా రెండు మందుపొట్లాలిచ్చి వెళ్ళిపోయాడు.

భట్టాచార్య మరలా స్పృహలోకిరాలేదు. క్షణక్షణానికీ పరిస్థితి విషమిస్తూవచ్చింది. ఇల్లంతా ఒక్కసారి పెద్దరోదన ధ్వని తో మారుమోగింది. జాహ్నవి తోడికోడలు రొమ్ములు బాదుకుంటూ బజారున పడిపోయి చుట్టుపక్కలవాళ్ళని పదిమందిని లేవగొట్టుకొచ్చింది. నలుగురుమనుష్యులు భట్టాచార్య శవాన్ని తులసి అరుగు దగ్గరకు పట్టుకొచ్చి పండబెట్టారు. భర్త రెండుపాదాలమధ్య తల పెట్టుకుని లోలోపల కుమిలి కుమిలి ఏడువసాగింది జాహ్నవి. సావిత్రి గొంతు చించుకొని "నాన్నా, నాన్నా" అని పెద్దపెట్టున శోకాలుపెట్టి ఏడువసాగింది. ఈ సందడికి నిద్రబోతున్న కాళీ కూడా లేచి గోలపెట్టాడు. కన్నీరు మున్నీరుగా విలపిస్తూ తండ్రి నోట్లో తులసి ఆకులతో గంగాజలం విడుస్తూ తండ్రితలదగ్గర కూర్చుంది సతి. జాహ్నవి తోడికోడలు "గంగానారాయణబ్రహ్మ" అంటూ మంత్రోచ్చారణ చేయసాగింది. రోజుమాదిరిగానే యివ్వాళ కూడా భళ్ళున తెలవారింది.

# 7

భట్టాచార్య చనిపోయిన తరవాత ఆరేళ్ళకొడుకు కాశీ శంకర్ తండ్రి కర్మకాండ జరపవలసొచ్చింది. కలకత్తాలోవున్న పెద్దకొడుక్కి టెలిగ్రాంకూడా పంపించారు. కాని తిరుగు జవాబుమాత్రం రాలేదు. వూళ్ళో పరోపకారులంతాకలిసి తమకు తోచింది సహాయంచేసి భట్టాచార్య కర్మకాండకాస్తా పూర్తి చేశారు ఆచారప్రకారం ఏదో లెఖ్ఖకు నల్గురు బ్రాహ్మలకు భోజనం పెట్టి అన్నదానం పూర్తిచేశారు.

భర్త చనిపోయింతరవాత యిద్దరుకూతుళ్ళనూ ఆరేళ్ళ కొడుకుని ఎదురుగాపెట్టుకుని కాలమెళ్ళబోస్తూవున్నది జాహ్నవి. ఆమె రూపం మారురూపమేసింది. మనిషి చిక్కి శల్యావశిష్టమైంది. రోజులు గడవడం దుర్భరంగానే వుంది.

అటు కలకత్తాలో పెద్దకొడుకు హరి, హరిశ్చంద్ర నాటకం లో చంద్రమతివేషంకట్టి నాటకాభినయంలో మునిగి తేలుతున్నాడు. చంద్రమతివేషానికి బాగాసరిపోయాడు హరి. టెలిగ్రాంకూడా అదే సమయానికి అందింది. కాని రక్తికట్టే నాటకం ఒక్కసారిగా ఎక్కడ చెడిపోతుందోనని హరికి అందివ్వకుండా తమదగ్గరే తొక్కి పట్టారు పెద్దబాబులు. నాటకంముగిసింది. పదిమందిచేత 'శభాష్' అనిపించుకున్నాడు హరి. తన మనస్సులో ఎందుకోగాని తలవని తలంపుగా తనయింటికి ఒక్కసారి వెళ్ళిరావాలని బుద్ధిపుట్టింది హరికి. ఇంటికి పోయివస్తానని పెద్దబాబుల్ని అడిగాడు. వారు కూడ కాదనలేక పోయిరమ్మన్నారు.

భట్టాచార్య చనిపోయి పదిహేనురోజులకుపైగా గడిచి పోయినందున యింట్లోవాళ్ళంతా కొద్దిగా దుఃఖాన్ని మరచారనే చెప్పవచ్చు. భవిష్యత్తునుగురించి పెద్దగా దిగులుపెట్టుకుంది జాహ్నవి. ఎప్పుడూ అదే ఆలోచన.

హరి యింటికి చేరాడన్నమాటేగాని గడపదాటి యింటి లోనికి కాలుదీసి కాలు పెట్టలేకపోయాడు. అతనేదో తప్పుచేసిన వాడిలాగా కాళ్ళు వణుకుతున్నయ్. ఇల్లంతా చీకటిగా కనిపించింది. ఇదివరకెప్పుడూ దగ్గుతూ కూర్చుండే తండ్రి కంఠధ్వని వినపడక పోయేప్పటికి బహుశా తండ్రికి జబ్బు నయమైవుండొచ్చునను కున్నాడు. ఇంట్లోకి భయంభయంగా అడుగుపెడుతూ పెద్దగా కేకేశాడు "నాన్నా నాన్నా" అని. కాని జవాబురాలేదు. మరలా పెద్దగా కేకవేశాడు "నాన్నా" అని. ఈ కేక చెవిని పడగానే వాళ్ళ పె తల్లి నిద్రకాస్తా మాయమైపోయింది. సతి, సావిత్రి పరుగెత్తుకుంటూ వచ్చారు. హరినిచూచి గాభర్గా తన కళ్ళను తానే నమ్మలేకపోయింది. అంతా వచ్చి హరిని చుట్టు ముట్టారు. హరి తల్లివైపు చూశాడు. తెల్లవస్త్రం ధరించింది. జుట్టు విరియబోసుకునివున్న ఆమె వాడిన ముఖం, పెక్కి చిక్కిన ఆ మాతృ మూర్తిని చూచి హరి ఒక్క సారి గొల్లుమన్నాడు. "నాన్న యీ లోకంలో లేడా అమ్మా?" అని ఏడవసాగాడు. కొడుకు ఏడుస్తూంటే తల్లి నేత్రాలుకూడా చెమ్మగిల్లినయి. సావిత్రి, సతి తల్లిని ఓదార్చారు. జరిగిన చరిత్రంతా తెలిసింది హరికి. బ్రతికుండగా యిక పెద్దబాబుల్లో చేరకూడదనుకున్నాడు. చాలరోజులవరకూ యింటి వద్దనేవున్నాడు. కాని తన దృఢనిశ్చయాన్ని ఎన్నోరోజులు నిలుపుకోలేక పోయాడు. ఒకనాడు హరి తనజేబులోనున్న పది రూపాయలు సతిచేతుల్లో పెట్టి, "ఇంట్లో వృధాగాకూర్చుంటే యిక మన సంసారం ఎట్లాగడుస్తుంది? పెదబాబులదగ్గరకు కలకత్తావెళ్ళి నెలకు పదిరూపాయిలు పంపుతూవుంటా. అమ్మా మీరు కులాసాగా కాలంగడపండి. మధ్యమధ్య తీరిక దొరికినపుడల్లా అప్పుడప్పుడూ వచ్చిపోతూవుంటాలే" అని చెల్లెళ్ళిద్దరికి చెప్పి తల్లికి చెప్పవద్దని, తెలిస్తే ఆమె దిగులుపడుతుందని చెప్పి కలకత్తా తిరిగపోయాడు హరి.

మూడుమాసాలు గడచిపోయినయ్. ఈ మధ్య రెండు

చ్చి యింటిలో కొద్దిగా డబ్బుక

పోయాడు హరి. జాహ్నవి తనకూతుళ్ళను చిన్నకొడుకును దగ్గర పెట్టుకుని యీదలేక యీదుతుంది సంసారం.

ఒకనాడు స్నానం చేయడానికి చెరువుకు వెళ్ళింది సతి. మునుపటిమాదిరిగా నదికిపోయి స్నానం చేయడం మానేసింది. ఇంటి ముందు మామిడిచెట్టుక్రింద కూర్చుని ఆవుకు పేళ్ళు పెట్టుతుంది సావిత్రి. ఇంతలో పోస్టుమాను వచ్చి 'పుత్తరం' అని కేకేశాడు. కాళ్ళీ పసుగత్తుకుంటూవచ్చి కార్డందుకుని తల్లి కెస్తూ ఇచ్చి యిచ్చాడు. తులసిచెట్టు అరుగును ఆవు పేడతో అలుకుతూ ఎడమచేత్తో కార్డు పట్టుకుని చదివింది జాహ్నవి. కార్డు చదువుతూవుండగనే జాహ్నవికి కాళ్ళుచేతులు వణికాయి. శరీరమంతా చల్లబడినట్లయింది. గొంతు లేవలేదు. కూర్చున్నది కూర్చున్నట్లే నేల కూలిపోయింది. అప్పుడే స్నానంచేసి తిరిగొచ్చిన సతి చంకనున్న నీళ్ళకడవ యింట్లో పెట్టి తల్లి దగ్గరకొచ్చి, "ఎందుకమ్మా ఏడుస్తున్నావు?" అని అడిగింది. జాహ్నవికి నోటినుండి మాటరాలేదు. ఆమెకు ప్రక్కగా క్రిందపడివున్న పోస్టుకార్డు తీసుకుని సతి చదువుతుంది. "నవగ్రాం జమీందార్ గారు స్వర్గస్థులైనారు. నేను ఆయనగారి మొదటిసంబంధపు భార్య కుమారుణ్ణి. ఈ విషయం మా సవతి తల్లికి తెలియపరచడమైనది. వీలైతే కుటుంబసమేతంగా పెద్ద కర్మరోజుకు చేరుకోవాలని ప్రార్థన" అని వున్నది.

చేతిలో కార్డు చేతిలో పెట్టుకుని సతి కొయ్యబొమ్మలా నిలబడిపోయింది. ఇదిచూచి చకితురాలై సావిత్రి అక్కదగ్గరకొచ్చి చేతులో కార్డు అందుకుని చదివి గొల్లుమని ఏడ్చింది. ఇదివిని వాళ్ళ పెత్తల్లి చేతులోనున్న జపమాల అవతలపడవేసి ఏమిటమ్మా ఏమిటమ్మా అంటూ పరుగులెత్తింది. క్షణంలో పల్లెలో వున్నవాళ్ళంతా వాళ్ళయింట్లో గుమిగూడారు. రోదనధ్వనులతో యిల్లంతా మారుమ్రోగింది. 'అయిపోయిందేదో అయిపోయింది. పోయినవాళ్ళు మళ్ళా వస్తారా? ఏడుపుమాని చేయవలసిన తతంగమంతా మొదలు పెట్టండమ్మా" అని వచ్చిన యిరుగుపొరుగువాళ్ళు ఓదార్చనారంభించారు.

సతిని చెరువుకు తీసుకుపోయి స్నానంచేయించి చేతిగాజులు పగులగొట్టించారు. తెల్లని-చీరకట్టి నెత్తిమీద ముసుగువేయించి యింటికి తీసుకొచ్చారు. ఇంటికివచ్చినతరవాత గడపదాటేముందు సతిచేత నాల్గు వేపాకులు కొరికించి లోనికి అడుగుపెట్టించింది వాళ్ళ పెత్తల్లి. సతికూడా వాళ్ళపెత్తల్లిమాట కాదనకుండా ఆమె చెప్పినట్లేచేసింది. సతి వైధవ్యానికి అక్కను కౌగిలించుకుని "అక్కా, అక్కా" అని ఏడ్చింది పెద్దగా సావిత్రి.

పొరుగింటి ఆడవాళ్ళు జాహ్నవిదగ్గరకెళ్ళి, "ఇంకా ఏడ్చి మనంచేసేదేముంది? ఇక లేచి సతికి అన్నం నీళ్ళూ ఏర్పాటు చేయండి" అనిచెప్పి జాహ్నవిని లేపి కూతురుదగ్గరకు పంపించారు. కూతురు విధవవేషం చూచేప్పటికి జాహ్నవిగుండె చెరువైపోయింది. నోటినుంచి మాట రాలేదు. రెండుచేతుల్తో కూతురును కౌగిలించుకుని, "యీరాత నీ కెక్కడ రాసిపెట్టుందికూతురా," అని పెద్దపెట్టున గుండె పగిలేటట్లుగా ఆవురుమంది జాహ్నవి.

# 8

విశ్వేశ్వర్, అన్నపూర్ణ తీర్థయాత్రకై బయలుదేరి సంవత్సరం గడిచిపోయింది. పశ్చిమదేశమంతా చూచిరావాలని ఎన్నాళ్ళనుండో కోరికగాయుండేది విశ్వేశ్వరుడు. ముఖ్యమైన తీర్థస్థానాలు చూచుకుంటూ పనిలోపని కలిసివస్తుందిగదా అని పశ్చిమదేశానికి కూడా వెళ్ళాడు. కాశీ, గయా, హరిద్వార్, బదరీనారాయణ్, కురుక్షేత్రం, మథుర, గోకులబృందావనం, పండరీపురం, పూనా, బొంబాయిలనుకూడా దర్శించాడు.

ఎప్పుడూ యింటివద్ద ఒంటరిగా చీకటిగదిలో కూర్చుని సాహిత్యపఠనానికి అలవాటుపడ్డ విశ్వేశ్వరుడికి కొత్త జన్మ ఎత్తినట్లుగా వున్నాది యివన్నీ చూస్తూవుంటే. రోజుకొక్క క్రొత్తస్థలం చేరేవారు వాళ్ళిద్దరూ. పోయినచోటల్లా నదీస్నానం, జపం, భగవద్దర్శనం చేసుకోవడం జరుగుతూవుండేవి. దారిలో మధ్యమధ్య ఎత్తైన కొండలెక్కి దిగడం, విశాల మైదానాల్లోగుండా ప్రయాణించడం లోతైన కొండలోయల్లో కూడిన పచ్చని ప్రకృతి దృశ్యాలను తిలకించడం యివన్నీ తమ రమణీయకతా ప్రభావాన్ని విశ్వేశ్వరుని హృదయంమీద ప్రసరింపజేసినయి. అతని హృదయం ఆనందంతో నిండిపోయింది. చంద్రనాథ్ తీర్థస్థానం చేరినాక విశ్వేశ్వరుడు అన్నపూర్ణతో, "పిన్నీ! నేనిక్కడే యిల్లుకట్టుకుని వుండిపోతా. ఇక నేనింటికిరాను" అన్నాడు. అన్నపూర్ణకు నవ్వొచ్చింది కొడుకుమాటలు వింటూంటే. పశ్చిమదేశమంతా కరువుకాటకాల్లో మునిగివుంది. క్షామదేవత విలయతాండవంచేసి అనేక జీవరాసుల్ని తనపొట్టపెట్టుకుంది. తీర్థస్థానాలు చూచినప్పుడు విశ్వేశ్వరుడికెంత ఆనందోత్సవాలు కల్గినయ్యో దానికి అనేకరెట్లు దుఃఖం కూడా కలుగకపోలేదు పశ్చిమదేశస్థితిచూస్తే.

"మనదేశం వదిలిపెట్టి ఈదేశంలోవుంటే ఎట్లావుంటుంది పిన్నీ?" అని అడిగాడు విశ్వేశ్వర్ తన పిన్నిని.

"ఎందుకూ?" అని ఎదురుప్రశ్న వేసింది అన్నపూర్ణ.

"ఇదెంత బీదదేశమో చూడు పిన్నీ? అన్నమో రామచంద్రా యని అల్లాడిపోతూ ప్రజలంతా దారి డొంకాలేకుండా తెగ తిరుగుతున్నారు. వాళ్ళ ముఖాలమీద దరిద్రదేవతాఛాయలు ముద్రకొట్టినట్లుగా కన్పిస్తున్నయ్." ముసిముసినవ్వులు నవ్వుతూ అన్నపూర్ణ. "మనదేశంలోమాత్రం బీదవాళ్ళకేమి తక్కువగా?" అన్నది "ఎక్కడున్నారు? ఆకలితో చనిపోయేవారు మన దేశంలో లేరు. మనదేశం సుజలాంసుఫలాం, శశ్యశ్యామలంగా వుంది. ఒక్క అన్నం మెతుకైనా దొరక్క యిక్కడ జనంచూడు ఏవిధంగా చనిపోతున్నారో? సకలసమృద్ధంగావున్న దేశంలో ఒకరొకరికి సహాయం చేసుకోవలసిన అవసరం వుండదు. ఒకడు మరొకని ముందుకువచ్చి చెయ్యిచాచి అడగాలంటే సిగ్గుపడి అడగలేకపోతాడు. కాని అన్నాభావంవల్ల చారుల కాటకానికి సాదాప్రజ అంతా బలైపోతుంటే నాగుండె తరుక్కుపోతుంది వాళ్ళని చూడలేక. ఇట్టిదేశంలో వుంటేనే మానవసేవ చేసుకగల్గుతాం."

"ఇంతకూ నువ్వు చేయదలచుకున్న మానవసేవ ఏమిటి, విశూ?" అని అడిగింది పిన్ని. సిగ్గుచేత తలవంచుకున్నాడు విశు. హృదయంలో పుంఖానుపుంఖంగా భావపరంపర చెలరేగింది. హృదయం భారంగా తోచింది. నోరు తెరవలేదు. ఈ దేశంలో ఆత్మాభిమానాన్నికూడా త్యజించి ప్రజలు యాచకవృత్తిలో తేలారు. ఒకప్పుడు పరువు ప్రతిష్ఠలుగల కుటుంబీకులు పరిస్థితుల ప్రాబల్యంవల్ల సిగ్గులు, ఆత్మగౌరవం వదిలేసి నిస్సంకోచంగా యితరుల ముందుకొచ్చి, "బాబూ భిక్ష" అని చేయిచాచి దీనంగా అడుగుతున్నారు. ఇదివరలో తన గ్రామంలో ఒక అతిథిశాల నిర్మించి పేదవారికి అన్నదానంచేద్దామనే తలంపుతో అతిథిశాల నిర్మాణంకూడా మొదలెట్టాడు విశ్వేశ్వర్. కాని పశ్చిమదేశపు దీనస్థితి చూచినపిమ్మట, "అన్నానికి ఏలోటులేని చోట, నేను ధనవంతుణ్ణి మీ అందరికీ అన్నదానం చేయదలచానని దారినిపొయ్యే దానయ్యలందర్నీ అయాచితంగా పిలిచి అన్నంపెట్టేకంటే, అభి

మానాన్ని చంపుకుని క్షామానికి గురియై పదిమంది ముందుకొచ్చి, బాబూ! ఆకలి, ఆకలి అని అరచే క్షామపీడితులకే అన్నదానం చేయడం ఎంతో ఉత్తమం'' అని తలంచాడు విశ్వేశ్వర్. అందుకనే తనవూళ్ళో ఆరంభించేసిన అతిథిశాల నిర్మాణం ఆపుచేయించ నిశ్చయించాడు.

పశ్చిమ దేశవాసుల దీనారావం వింటూంటే విశ్వేశ్వర్ గుండె పగిలిపోయేది. కన్నీళ్ళు కారేయి. ఇక్కడే వుండి క్షామపీడితులకు సాయపడా లనుకున్నాడు. అన్నపూర్ణ యిందుకు అడ్డుగా నిలబడింది. ''ఎక్కువకాలం యిక్కడవుంటే విశ్వేశ్వర్ పిచ్చివాడై తన ఆస్తిపాస్తులన్నీ కరిగించి వాళ్ళకందరికీ అన్నదానంచేసి చివరకు తనుకూడా కటికబీదవాడయిపోతాడు. ఇంత బీదవాళ్ళకు సాయంచెయ్యాలంటే కుబేరుని ధనాగారంకూడా చాలదు. మానవ మాత్రులకది సాధ్యమా?'' అని తనమనస్సులో అనుకుంది అన్నపూర్ణ. ఎలాగైనాసరే మనస్సుమార్చి విశ్వేశ్వర్‌చేత యింటికి తిరుగుప్రయాణం కట్టించాలని సంకల్పించింది. ఇంటికి తిరిగిపోదామని రోజురోజూ బలవంతపెట్టేది విశ్వేశ్వరుణ్ణి.

అన్నపూర్ణ మాట తీసివేయలేక ఆమె వొత్తిడివల్ల యింటికి బలవంతాన తిరిగిపోవలసొచ్చింది విశ్వేశ్వర్. తట్టాబుట్టా సర్దుకుని యింటికి బయలేరారు వాళ్ళిద్దరూ. ఇంటికి తిరుగుముఖంపట్టినాక రైల్లోనే అన్నపూర్ణ విశ్వేశ్వర్‌తో ''విశూ, యింటికెళ్ళినాక ఒకనెల గడచీ గడవకముందే నీకు పెళ్ళియేర్పాటుచేస్తా'' అన్నది.

నిజం చెప్పాలంటే పెళ్ళంటేనేసరి విశ్వేశ్వర్‌కి చెడ్డభయం. ఏవుద్దేశ్యంచేత తాను పెళ్ళిచేసుకోనని పట్టుపట్టాడో చెప్పడం మహాకష్టం. కాని ఆ వుద్దేశమే యిప్పుడతనిహృదయంలో గట్టిపడి అశ్వత్థ వృక్షంలాగా శాఖోపశాఖలు వ్యాపింపజేసి దృఢంగా పీఠమేసుకూర్చుంది.

స్త్రీ పేరు చెవిలోపడితేచాలు విశ్వేశ్వరునికి ఎక్కడాలేని అసహ్యం పుట్టుకొచ్చేది. తాను అధ్యయనంచేసిన సాహిత్యంలో

ప్రతిచోట స్త్రీకి ఎంతో ప్రాధాన్య ముండడంచూచి భయపడే వాడు. 'ఒక్కగాను ఒక్క స్త్రీ పురుషుని విశాలజీవితపు సుఖదుఃఖా లన్నింటికి కేంద్రరూపం ఎలా అవగలిగిందా' అని ఎంత ఆలోచించి నా అతనికి అర్థమయేదికాదు. "కావ్యసాహిత్యానికి ప్రాణం నారి. అంతేగాదు. సృష్టికి మూలంకూడా నారియే. పురుషుని సమస్త సుఖాలు, ఆదర్శాలు, ఆశలు, స్నేహం, సౌందర్యం, ప్రీతి యివన్నీ ఒక్కగాను ఒక్క క్షుద్ర స్త్రీమూర్తికి అర్పించవలసివచ్చిందే" అని వాపోయేవాడు విశ్వేశ్వర్. ఇట్టిజీవితంకొరకేనా పురుషుడు నిత్యం అర్రులుచాచి ఎదురుచూచేది? దీనిలోనే సుఖం, శాంతి, తృప్తి వున్న వని అనగల్గితే యిక దాసత్వమని దేన్నంటారు?

రైలుదిగి వూరువెలుపల కొచ్చేప్పటికి సాయంత్రమైంది. మసకవెన్నెల్లో వూరిబయటి పచ్చనిప్రదేశాలన్నీ చిత్రాతిచిత్రంగా కన్పిస్తున్నయి. దూరాన్నుంచి చూస్తుంటే పండీపండని చేలు ఎంతో ముచ్చటగా అగుపిస్తున్నయ్. క్షేత్రలక్ష్మి ఎంతోవయ్యారంగా వంపు లొంపులుగా కులుకుతూన్నట్లగుపించింది. చేలమీదుగా పక్షులు గుంపులుగుంపులుగా బారులుతీరి ఎగురుతున్నయ్. ప్రక్కనేవున్న పచ్చిక బీళ్ళల్లో పచ్చికమేస్తూ నెమ్మదిగా అడుగులు వేసుకుంటూ వస్తున్న పశువులగుంపులు, వాటిని గదమాయించి అదలించుచున్న అరుపులు, ఆహా! యీమసకవెన్నెల్లో, ఈమనోహరదృశ్యం చూసే సరికి ఎంతోముచ్చటేసింది విశ్వేశ్వర్‌కు. అతనికి చిరపరిచితమైన ఆ మైదానాల్లోని చల్లనిపిల్లగాలులు విశ్వేశ్వరుని శిరోజాలను ముద్దు పెట్టుకుని గడ్డంపట్టుకుని కుశలక్షేమాలు అడుగుతున్నట్లుగా వున్నయ్. అప్రయత్నంగా విశ్వేశ్వరుని నేత్రాలనుండి కన్నీటిబిందు వులు రాలినయ్. చిన్ననాడే తననువదలి, ఒంటరిగా చేసివదలి పోయిన తల్లి అక్కడి మామిడిచెట్ల నీడననిలబడి విదేశయాత్రచేసి తిరిగివస్తున్న తనకొడుకు యోగక్షేమాలు తెలుసుకోవాలని స్నేహ సజలనేత్రాల్తో తనవద్దకు పిలుస్తున్నదా అనిపించింది. అట్టి తీవ్ర ఆనందప్రతిఘాతాన్ని తట్టుకోడానికి విశ్వేశ్వర్ ఒక్కక్షణంసేపు నిలబడిపోయాడు. అకస్మాత్తుగా నేలకు తలతాకించి ఎవరికో నమ

స్ఫురించాడు. అప్పుడు అన్నపూర్ణ ఎడ్లబండిలో పరదాచాటున వుండబట్టి సరిపోయింది కాని లేకపోతే కొడుకు చేష్టల్ని చూచి పిచ్చిపట్టిందని రొమ్ములుబాదుకుని వుండేది.

ఇంటికి వచ్చీరావడంతోటే గోమాతలను దర్శించింది అన్నపూర్ణ. ఇంటినౌకర్లంతా యిల్లు శుభ్రంచేసివుంచారు వీళ్ళు వచ్చేలోగానే. తీర్థయాత్రలనుండి తీసుకొచ్చిన క్రొత్తక్రొత్త వస్త్రాలు, సామాన్లు, ప్రసాదం యిరుగుపొరుగువారికి తరవాత సంపుదామనుకొని కొడుక్కి ఆకలిగావుంటదని అన్నం వండడంలో లీనమైంది అన్నపూర్ణ. ఇదివరలో పొరుగింటికెళ్ళి ఎరుగని విశ్వేశ్వర్ కి తీర్థయాత్రనుండి తిరిగిరాగానే వూరంతా యిల్లిల్లూ తిరిగిరావాలని బుద్ధి పుట్టింది. కాని ఎవరైనా, ఎక్కడైనా ఏమైనా అనుకోగలరని సంకోచించి ఆప్రయత్నాన్ని విరమించుకుని తన అరటితోట చూడడానికి బయలుదేరాడు. తోట నాలువైపులా మనసారా తిరిగి చూచి యింటికి తిరిగొచ్చాడు. వూళ్ళోవున్న ప్రతిచెట్టూ, ప్రతి యిల్లూ ఎంతో అందంగా కనిపించినయ్ విశ్వేశ్వర్ కి. దారిలో పరిచితులుగాని అపరిచితులుగాని ఎవరైనా ఎదురుపడి, "ఏంబాబూ, ఎప్పుడు రావడం?" అని అడగడమే ఆలస్యం, ఆనందంతో పరవశత్వం చెందేవాడు విశ్వేశ్వర్.

కొంచెం దక్షిణంగా చీకట్లో భట్టాచార్యగారిల్లు మసక మసకగా కన్పించింది. పోయి భట్టాచార్యుని కేకేసి పిలుద్దామా అనుకున్నాడు. కాని ఆనాటి పెళ్ళిమాట జ్ఞాపకమొచ్చి పిలవకుండానే వెనక్కి అడుగువేశాడు విశ్వేశ్వర్. రెండడుగులు ముందుకువేశాడో లేదో, ఉమేశముఖోపాధ్యాయ తనయింటి అరుగుమీదకూర్చుని చుట్టచుట్టుకుంటూ కన్పించాడు. ఆయనదగ్గరకు వెళ్ళాలని విశ్వేశ్వర్ అనుకునేలోగానే, "ఏం విశ్వేశ్వర్, ఎప్పుడొచ్చావ్ యాత్రనుండి, బాగున్నావా?" అని ప్రశ్నించాడు. అక్కడే కూర్చొని చాలసేపు మాట్లాడి రాత్రి ప్రొద్దుపోయి యింటికిచేరాడు విశ్వేశ్వర్.

ఇంటిదగ్గర అన్నపూర్ణ అన్నం తయారుచేసి కళ్ళు కాయలు కాసేలాగ కొడుకోసం ఎదురుచూచింది. ఎంతసేపూ రాకపోయేప్పటికి పళ్ళెంలో అన్నంవడ్డించి మూతపెట్టి దాని కెదురుగా కూర్చుని నిద్రాభారంవల్ల, ప్రయాణబడలికవల్ల కూరేపాట్లుపడుతూ వెనక్కు ముందుకూ వుయ్యాల లూగసాగింది. విశ్వేశ్వర్ వచ్చి పీటమీద కూర్చొనేసరికి అన్నపూర్ణ అదిరిపోయి ఏమేమో అంది. పిన్ని ఏమనుకున్నా విశ్వేశ్వర్ తలవంచు కూర్చున్నాడు విచారంగా.

"ఎక్కడెక్కడికి వెళ్ళివచ్చావురా? వూళ్ళోవాళ్ళంతా బాగున్నారా? ఏమిటి వూరిసంగతులు?" అని అడిగింది అన్నపూర్ణ.

"అంతా బాగానేవున్నారు. కాని భట్టాచార్య యీ లోకంలో లేడు" అన్నాడు విశ్వేశ్వర్. ఇది వినేసరికి అన్నపూర్ణ కెంతో దిగులేసింది. గుండె ఆగిపోయినంత పనైంది. "నారాయణ! నారాయణ!! ఏం జబ్బు? ఎప్పుడు? అయ్యో పాపం వాళ్ళసంసారం గతి ఏంగాను? పెళ్ళికిపెరిగినకూతుళ్ళున్నారు. మరి వారిని కడతేర్చే వారెవరున్నారు?" అని ఏమేమో ప్రశ్నలవర్షం కురిపించింది. ఒక్కక్షణంసేపుండి, "పాపం పెద్దవాడు, కష్టాలన్నీ వదలించుకుని తనదారిని చక్కా పోయాడు. ఇక వున్నవాళ్ళ గతేంగాను?" అని నిట్టూర్చింది.

రాత్రంతా అన్నపూర్ణకు నిద్రపట్టలేదు. శాంతసహనాల ప్రతిమూర్తి జాహ్నవి ఆమెకళ్ళల్లో మెదుల్తూంది. ఎల్లెల్లో ఆ రాత్రంతా వ్యాకులతగా గడిపి కొంచెం మసకవిప్పారగానే భుజం మీద ఒకతుండు, చంకన కడవపెట్టుకుని నదీస్నానానికి బయలు దేరింది అన్నపూర్ణ. ఆరోజు పౌర్ణమికావడంవల్ల నది రేవువద్ద గుంపు ఎక్కువగావుంది. అన్నపూర్ణను చూచి అంతా కుశల సమాచారాలడగ మొదలెట్టారు. భట్టాచార్య వదినకూడా స్నానానికొచ్చి అన్నపూర్ణను చూచి, "ఏవమ్మా, ఎప్పుడూ

రావడం ? ఇక మీరు యీ వూరే మరచిపోయారనుకున్నాం" అంది.

"రాకుండా ఎక్కడికెళ్తాంలే వదినా ?" అని ప్రక్కనే తెల్లచీరకట్టుకుని నిలబడ్డ జాహ్నవిని చూచి తల ప్రక్కకువంచుకుంది అన్నపూర్ణ. తల ప్రక్కకుత్రిప్పి చూచేప్పటికి సావిత్రి నదిలో స్నానంచేస్తూ కన్పించింది.

ఆమె నొక్కసారి దగ్గరకుపోయి ప్రేమతో పలకరిద్దామా అనిపించింది. కాని అన్నపూర్ణకు ముఖం చెల్లలేదు. త్వరత్వరగా స్నానం ముగించుకుని యింటికి తిరిగిరాబోతుండగా సావిత్రి ప్రక్కనే తెల్లచీరధరించి తడిసినవెంట్రుకలు ఆరబెట్టుకుంటూ సతి కన్పించింది అన్నపూర్ణకు. "ఎవరా అమ్మాయ్ ? సతేనా ?" అని తనలో ఆలోచించుకుంది. సతివేషం, ఆకృతి చూచి కొయ్యబొమ్మలాగా నిశ్చలనిర్జీవప్రతిమలాగా నిలబడిపోయింది అన్నపూర్ణ.

# 9

పశ్చిమదేశయాత్రనుండి యింటికితిరిగి వచ్చినతరువాత పూర్వం లాగా పుస్తకాలు ముందేసుకుని కూర్చుందామని విశ్వేశ్వరునికి బుద్ధిపోవడంలేదు. పశ్చిమదేశంలోని కరువు కాటకదృశ్యాలు మరుద్దామన్నా మరుపునకు రావడంలేదు. కొంచెంసేపు తోటవైపు, పొలంవైపువెళ్ళి తిరిగొచ్చేవాడు. అప్పటికీ ఏమీతోచేదికాదు. ఒకొక్కొక్కప్పుడు పిన్నిదగ్గరకెళ్ళి కూర్చునేవాడు అన్నపూర్ణ కూడా మనిషి బొత్తిగా మారిపోయింది. మునుపటిమాదిరిగా మనసిచ్చి మాట్లాడడంగాని, నవ్వడంగాని మానేసింది. ఒకనాడు విశ్వేశ్వర్‌ని దగ్గరకుపిలిచి, "చూడు, విశూ! యింతవరకూ ఎట్లాగో కాలంగడిపాను. వయస్సు ముదిరిపోయింది. ఇంకా ఎంతకాలం జీవించాలో? ఇక బ్రతికినంతకాలం ఎలాగూ యీపాడుజీవితాన్ని యీడవక తప్పదు. నీకెప్పుడు పెళ్ళిచేసుకోవాలని బుద్ధిపుడుతుందో యిక అప్పుడే నీకిష్టమొచ్చినదాన్ని ముడేసుకో. ఇక మాటిమాటికీ పెళ్ళిచేసుకోమని నీతో నే చెప్పదలచలేదు" అని మహాకష్టంగా అంది అన్నపూర్ణ. ఈమాటలు అని తులసిపూజకై పత్తిగింజలు వేరి పత్తితో దీపారాజనకు వత్తులుచేస్తూ కూర్చుంది అన్నపూర్ణ.

"పిన్నీ! భట్టాచార్యగారి కాపరంసితిగతు లేమైనా తెలుసునా? పాపం! వాళ్ళెలా గడుస్తుందో?" అని అడిగాడు విశ్వేశ్వర్.

"నేనంత పిచ్చిముండనుకాను. అన్నమాట దక్కించుకోలేక వాళ్ళింటికి యింకా ఏముఖంపెట్టుకునిపోయి అడిగివచ్చేది వాళ్ళ సితిగతులన్నీ? నాకుమాత్రం మానాభిమానాలు లేవూ?" అంది పత్తిలోనిగింజలు వేరేస్తూ.

"వాళ్ళింటి కెళ్ళకపోతే పోయావు, ఎవరన్నా అనుకోవడంకూడా వినలేదా?"

భట్టాచార్యకుటుంబీకులంటే అలాంటి యిలాంటివాళ్ళు కాదు. వాళ్ళసంగతి నీకింకా తెలియదు. ఆకలికి పస్తులుండి చావుకైనా సిద్ధపడతారు కాని ఆత్మాభిమానం, సిగ్గులు వదులుకుని యితరులముందుకొచ్చి భిక్షం పెట్టమని చేయిచాచడంగానీ యితరులతో తమదీనస్థితి చెప్పుకోవడంగాని వాళ్ళకి గిట్టనిపని" అంది అన్నపూర్ణ.

భట్టాచార్యగారి కుటుంబం కష్టాలపాలయిందని తెలుసుకున్నాడు గాని వారికష్టాల నన్నిటిని ఎట్లా ఆదుకోవాలో బోధపడలేదు విశ్వేశ్వర్ కు. ఎప్పుడైనా బజార్లో ఆడుకోడానికి వచ్చినపుడు కాశీశంకర్ ని అడుగుదామంటే వాడు చిన్నవెధవ. పదిమందితో చెప్పి గోలచేయగలడని భయం. ఇక యీవిషయమై సతినిగాని సావిత్రినిగాని కలుసుకుని మాట్లాడాలని దృఢనిశ్చయం చేసుకున్నాడు విశ్వేశ్వర్.

దరిద్రునికి పుత్రపుట్టి, దురదృష్టానికి బానిసలై దారిద్ర్యంలో పడి సతమతమౌతున్నందున సతి, సావిత్రులుకూడా తరచుగాయింటి నుండి బయటికిరావడమే మానేశారు. సావిత్రిమాత్రం తప్పనిసరయినందున మిట్టమధ్యాహ్నం మానవసంచారంలేకుండా నదికి నీళ్ళకోసం పోతూవుండేది. ఈ విషయం విశ్వేశ్వరునికి తెలిసింది. సతి అసలే కనిపించేదికాదు. తమ హీనస్థితికి యింటినుంచి బయటికి అడుగుపెట్టాలంటే వాళ్ళకు ప్రాణంపోయేది. ఇరుగు పొరుగు అమ్మలక్కలు నల్గురూ ఒక్కచోట చేరినపుడు మామూలుగా వాళ్ళయింటి విషయాలు రాకుండా వుండేవికావు. బయటికొస్తే ఏవరే మనుకుంటారో తననుగురించి అని సావిత్రి లోలోపల చాల బాధపడేది.

ఒకనాడు మధ్యాహ్నం నదిఒడ్డున దట్టమైన చెట్ల శీతల ఛాయల్లో నిలబడివున్నాడు విశ్వేశ్వర్. నదిపైగా చల్లనిగాలి వీస్తూంది. అకస్మాత్తుగా తలెత్తిచూచేప్పటికి తైలసంస్కారంలేని శిరోజాలు గల దరిద్రబాలిక మోయలేని నిండుకడవ నెత్తిన పెట్టుకుని రావడం కనిపించింది అప్రయత్నంగా విశ్వేశ్వర్ నేత్రాల

నుండి రెండు వేడికన్నీటి బొట్లు రాలినయి. ఆ అమ్మాయి అతని సమీపంలోకొచ్చేప్పటికి ఆమెను పిలవాలనుకున్నాడు. కాని సంకోచించాడు. ఈతరుణం పోగొట్టుకుంటే యిక లభించదనుకున్నాడు విశ్వేశ్వర్. "సావిత్రీ" అనేమాట తలవనితలంపుగా అతని నోటినుండి బయటికి జారివచ్చింది. సావిత్రి తలెత్తి విశ్వేశ్వర్ చెట్లనీడని నిలబడి వుండడం గమనించింది. రెండడుగులు ముందుకువేశాడు విశ్వేశ్వర్. సిగ్గు సంకుచితత్వాలు సావిత్రిని పెనవేసినయి. కింకర్తవ్యవిమూఢురాలై నిలబడిపోయింది నెత్తిమీది కడవ నెత్తిమీదే పెట్టుకుని.

"నీతో ఒకమాట చెప్పాలనుకుంటున్నాను" అన్నాడు విశ్వేశ్వర్. "ఏమిటది?" అంది సావిత్రి. "మీ అన్నయ్య ఎప్పుడైనా యింటికివచ్చి పోతున్నాడా?"

"ఆఁ ......అప్పుడప్పుడు"

"ఏమైనా వుద్యోగంచేస్తున్నాడా?"

"ఆవిషయం నాకు తెలియదు."

"ఇప్పుడు మీ సంసారం ఎలా గడుస్తుంది?"

సావిత్రి మారు మాట్లాడక నిలబడిపోయింది. ఆమె మనస్సుకు కష్టంకలిగిందనుకొని, "నువ్వేం అనుకోవద్దు. చిన్నప్పటి నుంచి తెలిసినవాళ్ళు కాబట్టి, ఒక్క వూరువారం కాబట్టి స్వాతంత్రించి అడిగా. ఏం, కోపమొచ్చిందా ఆమాట అడిగానని?" అన్నాడు విశ్వేశ్వర్.

సావిత్రి మెల్లగా "కాదు" అని జవాబిచ్చి నెమ్మదిగా అడుగువేసి ముందుకు సాగబోయింది.

"కొంచె మాగు సావిత్రీ, ఈ రోజుల్లో ఎవరికైనా డబ్బు లేకుండా ఒక్కపూటంటే ఒక్కపూట గడవాలంటే బ్రహ్మప్రళయంగానే వుంటుంది. నువ్వు నేనడిగినదానికి సాఫీగా జవాబివ్వడం లేదు. నన్ను మీ అన్నయ్యలాగా భావించుకో నాతో నువ్వామాట ఎందుకు చెప్పగూడదూ?"

తల పైకెత్తి గుడ్లురిమి, "మీ యింటివిషయాలు పూళ్ళో వాళ్ళందరికీ మీరు చెప్పుకుంటూ తిరుగుతున్నారా? ఎవరింటిగుట్టు ఎవరు బయటారేసుకుంటూరు? అలా అడగకూడదని మీకు తెలియదా?" అంది సావిత్రి.

"అడిగినప్పుడు చెప్పటానికేం?" అన్నాడు ధైర్యంగా విశ్వేశ్వర్.

"ఇంటికష్టాలు యితరులకి చెప్పుకుంటేమాత్రం దూరమయ్యేవి కావుగా?"

"చూడు సావిత్రీ, మిమ్మల్ని నేను స్వంత చెల్లెళ్ళలాగా భావిస్తున్నాను. మిమ్మలను సిగ్గుపరచాలనిగాని, అపహాస్యం చేద్దామనిగాని నా వుద్దేశ్యంకాదు. నేను పరాయివాణ్ణే అయినా తోటి మానవు లెవరైనా బాధపడుతుంటే చూడలేను."

విశ్వేశ్వరుని సానుభూతిపూర్వక మైన. ధోరణిచూచి సావిత్రి ఆశ్చర్యపోయింది. కోపం మరచింది. విశ్వేశ్వరుని నేత్రాలు కన్నీటితో నిండిరావడం చూచేసరిక తనేదో తప్పుచేశాననుకుని మనస్సులో బాధపడి "క్షమించండి. తెలియక కోప్పడ్డాను. భగవంతుని దయవల్ల యీనాటికి ఏకష్టము లేకుండా కాలం గడుపుతున్నాం" అన్నది తలవంచుకుని. "మీ అన్నయ్య అప్పుడప్పుడూ వచ్చి డబ్బు యిచ్చిపోతూవుంటాడని అన్నావుగా. అదేవిధంగా యీ విశ్వేశ్వర్ అన్నాయికూడా మిమ్మల్ని చెల్లెళ్ళుగా భావించి ఒక్క చిన్న కానుక అమ్మ పాదపద్మాలకు అర్పిస్తే మీరు కాదనరుగదా?" అన్నాడు రెండడుగులు ముందుకువేసి విశ్వేశ్వర్. సావిత్రికి ఆశ్చర్యమేసింది. "అది నాకు తెలియదు. అమ్మ అక్కయ్యలకే తెలియాలి" అంది.

"సరే మంచిది. ఈ కాగితంముక్క తీసుకెళ్ళి మీ అమ్మ పాదపద్మాలకు కానుకగా వుంచు" అంటూ సావిత్రి వద్దని ఎంత వారించినా చినిగిపోయిన ఆమె పెటచెంగున మూటకటాడు.

"ఇది నావల్ల కాదు అంతగా యివ్వదలచుకుంటే మీరే వచ్చి స్వయంగా అమ్మకిచ్చేయండి" అని అంది సావిత్రి.

"నువ్వు ముందు యిది అమ్మకిచ్చేయ్. అమ్మ పిలిస్తే అప్పుడే యింటికొచ్చి అన్ని విషయాలు మాట్లాడుతా. నేనిచ్చానని నా పేరు చెప్పు. ఆలస్యం చేయక పో. పాపం. నిండు కడవెత్తుకుని ఎంతసేపని నిలువుకాళ్ళమీద నిలబడిపోటావ్" అంటూ దూరంగా తొలగి నిలబడ్డాడు విశ్వేశ్వర్.

రెండోరోజు వుదయం ఏదో పనిమీద విశ్వేశ్వర్ తన పిన్ని దగ్గరకు వచ్చేసరికి అక్కడ అన్నపూర్ణ సరసనే సావిత్రి నిలబడి వుండడం చూసి చకితుడయ్యాడు. వాళ్ళ పిన్ని సావిత్రితో ఎంతో మనసిచ్చి మాట్లాడుతూవుంది ప్రేమగా. తనకోసమే, బహుశా తన కేదైనా చెప్పాలని సావిత్రి వచ్చివుండవచ్చునని వూహించు

ర్. తన గదికి తిరిగిపోయి కుర్చీలో కూలబడి ఆలోచనా నిమగ్నుడయ్యాడు. అతని వెనువెంటనే ఒక్క నిమిషం వ్యవధిలో నాలుగు పూలుతీసుకుని ఆ గది వాకిలిదగ్గరకొచ్చి నిలబడింది సావిత్రి. విశ్వేశ్వరుడుకి పుష్పాలంటే మహా ప్రేమ. అందుకనే అతని పిన్ని ప్రతిరోజూ నాలుగుపూలు తీసుకొచ్చి విశ్వేశ్వర్ గదిలో బల్లమీద పెట్టిపోయేది. ఇవ్వాళ ఆమె స్వయంగా రాక సావిత్రి చేత పంపించిందనుకున్నాడు. ఇవ్వాళే యీవిధంగా యితరులచేత ఎందుకు పంపించిందో ఎంత ఆలోచించినా విశ్వేశ్వర్ కు అర్థం కాలేదు. సావిత్రి గదిలోనికి రావడానికి సంకోచించడం గమనించి "లోనికిరా సావిత్రీ" అని పిలిచాడు విశ్వేశ్వర్.

గదిలోకివచ్చి బల్లపైని పుస్తకంమీద పూలుపెట్టుతూ, మీ పిన్ని యీ పూలు తీసుకెళ్ళి గదిలోపెట్టి రమ్మంది" అని చెప్పింది.

"సరే అక్కడే వుంచు. నువ్వు పిన్నికి పూలివ్వడానికే వచ్చావా? లేక నాతో ఏమైనా పనుండే వచ్చావా?"

సావిత్రి ముఖం కందిపోయింది. తలవంచుకుని ఎంతో మృదువుగా అంది. "పనివుండే వచ్చా. వట్టిచేతుల్తోరావడం నాకు

యిష్టంలేక, వస్తూవస్తూ కొద్దిగా పూలు పట్టుకొచ్చా" అంటూ పైటకొంగునుండి ఒక కాగితంముక్క వూడదీసి పూలదగ్గరగా వుంచింది. "అదేమిటి సావిత్రీ" అని అడిగాడు విశ్వేశ్వర్ ఆశ్చర్యంగాలేచి రెండడుగులు ముందుకు వేస్తూ.

"అది మీరిచ్చిన నోటు. మాకు రూపాయలేమీ అవసరం లేదని మాకంటె ఎక్కువ బీదవారికి సహాయంచేస్తే వాళ్ళు మిమ్మల్నెంతగానో ఆశీర్వదిస్తారని చెప్పి మా అక్కయ్య ఈ నోటును మీకు తిప్పి పంపింది".

విశ్వేశ్వర్ వంటినిండా జెర్రులు ప్రాకినంత పనయింది. తనేదో అపరాధంచేసినట్లుగా తలవంచుకుని మౌనంగా నిలబడి పోయాడు రెండు నిముషాలు. నెమ్మదిగా అడగలేక అడిగాడు. "అయితే మీ అమ్మ ఏం అనలేదా?"

"అమ్మకు తెలిస్తే ఆమె మనస్సు బాధచెందుతుందని అమ్మతో యీ విషయం చెప్పవద్దంది మా అక్క" అని చెప్పి సావిత్రి తిరిగి వెళ్ళిపోయింది. విశ్వేశ్వర్ విచారవదనంతో అక్కడే కూర్చుండిపోయాడు.

# 10

ఒకప్పుడు పరువు మర్యాదలతో బ్రతికినవారు కాలదోషం వల్ల దారిద్ర్యానికి తలొగ్గినప్పుడు వచ్చిన దారిద్ర్యబాధకే కాకుండా ఆత్మాభిమాన రక్షణాభిలాషవల్ల జనించిన అభిమానంతో యింకా ఎంతగానో క్రుంగిపోతారు. స్థితిగతులు బాగున్నప్పుడు ఎవరే వుపకారంచేసినా దాన్ని నిస్సంకోచంగా స్వీకరించడానికి స్వాభిమానంగల మానవుడు వెనకడుగు వేయడు. పరిస్థితులు తారుమారైనపుడు ఆ వుపకారమే అతని గుండెల్లో వాడి బాణంలాగా గుచ్చుకుని తీరని బాధకు దారితీస్తుంది. దేన్నిగురించి వాళ్ళకు ఎక్కువ బాధగా వుంటుందో దాన్నిగురించే వాళ్ళు ఎక్కువ శ్రద్ధగా ఆలోచిస్తూవుంటారు. దాన్ని తెలుసుకోలేక ప్రజలంతా దానికి గర్వమని, అహంకారమని పేరుపెట్టి పిలుస్తారు.

ఊరి అందం వూరిగోడలే చెపుతయ్యన్నట్లుగా భట్టాచార్యగారింటిగుట్టు వాళ్ళయిల్లే చెబుతుంది. వాళ్ళ యింట్లో పొయ్యిలో పిల్లిలేచే పనిలేదు. ఇంటిగోడ యిటుకలు ఒకటొకటిగా జారిపోతున్నయ్ క్రిందికి. దరిద్రదేవత ఆ యింటిలోనే తిష్ఠవేసినట్లుగా కనిపిస్తున్నది. ఇంటిముందు వసారా, తులసి అరుగు మాత్రం వూడ్చి నీళ్ళుచల్లి శుభ్రం చేయబడివున్నయ్. ఇంటి ముందు వేసిన పెరుగుతోటకూర, మొక్కలు, సొర, గుమ్మడితీగెలు గుమ్మటాల్లాగా దట్టంగా పెరిగి పెద్దవయి దరిద్రదేవతను దాచిపెట్టటానికా అన్నట్లు యింటిచూరు నెగబ్రాకుతున్నయ్.

జాహ్నవి తులసి అరుగుమీద దీపారాధనచేసి తులసిపూజ చేస్తూవున్నది. జ్వరంవల్ల మనిషి సగమైపోయింది. దిగుల్లేనిరోజు లేదు. తల్లి అవస్థచూచి కూతుళ్ళిద్దరూకూడా బెంగపెట్టుకున్నారు.

ఆడుకోడానికి బయటికి బజార్లోకెళ్ళిన కాళీశంకర్ రివ్వున పరుగెత్తుకుంటూవచ్చి పూజదగ్గర కూర్చున్న అమ్మమెళ్ళో చేతులేసి, "అమ్మా, మిఠాయిపెత్తవూ?" అని అడిగాడు.

"లోపలికెళ్ళి అక్కయ్యనడిగి పెట్టించుకో బాబూ" అంది జాహ్నవి. ఎదురుగా వసారాలో కూర్చుని ప్రత్తితో వత్తులు చేస్తున్న సావిత్రి తమ్ముణ్ణిపిలిచి ఒళ్ళో కూర్చోబెట్టుకుంది.

"అక్కా నాకు మిఠాయిపెడతవా? పెట్టకపోతే దుగ్గు దుగ్గుగా కొడతా" అన్నాడు కాశీశంకర్.

"సరే మిఠాయిపెడతాగాని నువ్వు ఒంటిమీద గుడ్డవేసుకోకుండా బజార్లో కెందుకెళ్ళా చెప్పు ముందు" అని అడిగింది సావిత్రి.

"అతుకులగుడ్డ వేసుకుని ఆడుకోడానికిపోతే పిల్లలందరూ ఎక్కిరిస్తన్నారు. ఎవరేసుకుంటారేం, అయ్యో?" అని ప్రక్కనే పెట్టివున్న గుడ్డలు నేలకేసికొట్టి అక్కచేతుల్లోనుండి తప్పించుకుని రివ్వున బజారునపడ్డాడు కాశీ. అప్పుడే పూజ ముగించుకుని ఎదురుగా వస్తున్న తల్లి కొడుకుని చంకనేసుకుని యింట్లోకి తీసుకుపోయింది. కొంచెంసేపు మాయమాటలు చెప్పి నిద్రపుచ్చింది.

ప్రతిరోజూ నూలువడకడం జాహ్నవి, సతి, సావిత్రులకు దినచర్య అయిపోయింది. ఇంట్లో వడికిన నూలు, యింటిముందు కాసిన కాయలు, తోటకూర, పూలు, గౌరిచేతికిస్తే అది తీసుకెళ్ళి బజార్లో అమ్మి డబ్బుతీసుకొచ్చి యింట్లో యిచ్చేది. గౌరి యిల్లిల్లూ తిరిగి కాయకూరలమ్ముకునే ముసలిస్త్రీ. ఆ వచ్చినడబ్బుతో యింట్లోకి కావలసిన వుప్పు, పప్పు మొదలైన వంటసామగ్రి కొనుక్కునేవారు. భట్టాచార్యగారి కుటుంబమంటేసరి తనప్రాణంతో సమానంగా చూచుకుంటుంది గౌరి. కాబట్టి భట్టాచార్యగారి యింటిగుట్టు, దారిద్ర్యావస్థ ఒక్క గౌరికి తప్పితే యింకెవ్వరికీ తెలిసేదేకాదు. బీదలపాట్లు బీదవాళ్ళే గ్రహించగలుగుతారు. భట్టాచార్య కుటుంబీకుల దీనావస్థచూచి వారియెడల కనికరంచూపి వారికి తగినంతవిధంగా సాయపడుతూవుండేది గౌరి.

అప్పుడప్పుడూ భట్టాచార్యగారింట్లో తింటానికి తిండికూడా కరువయ్యేది. చేతుల్లో రాగిదమ్మిడీ వుండేదికాదు. కాశీ బయటినుండి

వచ్చి, "అమ్మా, నాకు మిఠాయిపెత్తవూ?" అని గోలచేసేవాడు. వాడికేం తెలుసు, పాపం! యివ్వాళ యింట్లో అన్నీ నిండుకున్నా యని. ఒక్కొక్కరోజు దొడ్లో చెట్టున పండిన అరటికాయలు రెండుతిని పచ్చి మంచినీళ్ళుతాగి పడుండవలసి వచ్చేది యింట్లో వాళ్ళంతా.

ఇట్టి పరిస్థితుల్లో భగవంతుడు పంపిన వరప్రసాదంలాగా కలకత్తానుండి హరివచ్చి పదీ పరకా యిచ్చిపోయేవాడు అప్పు డప్పుడూ. జాహ్నవిమాత్రం ఒకవైపు యింటిదిగులు మరొకవైపు కూతుళ్ళదిగులువల్ల చిక్కి సగమైంది. దిగులువల్ల అప్పుడప్పుడూ జ్వరంవచ్చి నిస్సత్తువ ఏర్పడేదామెకి. ఇక ఎంతో కాలం బ్రతుక లేనని ఏడ్చి బెంగపెట్టుకునేది.

ఒకనాడు ఫుదయం పదిగంటలకు గౌరివచ్చి, "ఏవమ్మా, సత్యమ్మగారూ! పెద్దబాబుగారి కమలమ్మ వూరునుండివచ్చారంట మిమ్మల్ని ఒక్కసారి గట్టిగావచ్చి పొమ్మన్నారు. నేను కాయ కూరలు అమ్మటానికని ఆ బజారుకెళ్ళితే కనపడి చెప్పారు. రమ్మ నమని మరీ మరీ చెప్పింది కమలమ్మగారు" అన్నది.

మిట్టమధ్యాహ్నం బజార్లో మనుష్యులెవ్వరూ లేకుండా చూచి సతి కమలగారింటికెళ్ళింది వాళ్ళ అమ్మ నడిగి అనుమతి తీసుకుని. సతిని చూడగానే పరుగెత్తుకుంటూవచ్చి తన రెండు చేతుల్తో పెనవేసుకుంది కమల మునుపటిమాదిరిగానే నవ్వుతూ.

కమలను చూడగానే సతికి ఆశ్చర్యమేసింది. రెండుసంవత్స రాలనాడు చూచింది ఈ కమలనేనా అనికూడా అనుమానమేసింది సతికి. రెండుసంవత్సరాలనాడు తాను చూచినపుడు కమల బొద్దుగా ఎర్రగా నవనవలాడుతూ నవ్వుతూ వుండేది. తు రీనాడు ఆదే కమల బక్కచిక్కి నల్లబడి సన్నగా కట్టెపుల్లలాగా తయారయింది దిగులు ముఖం పెట్టుకుని.

"కమలా! యిట్లా అయిపోయావేం? ఈమధ్య జబ్బేమైనా చేసిందా?" అని అడిగింది సతి.

"జబ్బా? నా కా?" అని విరగబడి నవ్వింది కమల. "నా సంగతి సరే కాని నీసంగతిచెప్పు. నీపెళ్ళికూడా చూడలేకపోయాను. ఇవ్వాళ యీస్థితిలో నిన్నుచూస్తే, నీ యీ దీనావస్థకు నాకళ్ళు మూసుకుపోతున్నాయి" అంది కమల.

"నాకష్టాలు పుట్టినప్పణ్ణుంచీ వున్నయ్యేగా యిప్పుడు కొత్తగావచ్చినయ్యేమీ లేవు. నాసంగతి సరేకాని నీసంగతేమిటి? మునుపటి మాదిరిగా నీముఖంమీద నవ్వులేదు. మనిషివి బొత్తిగా మారిపోయావు. ఏమిటికారణం. ఈ పుష్యమాసంలో మీ ఆయన మాత్రం నిన్నుపంపి ఎట్లా వుండగలిగాడు వంటిరిగా?" అని అడిగింది సతి.

కమల నవ్వి "మా ఆయనకు నేనే కావలసివచ్చానా? సతీ! ఆడదంటే పూలమాలవంటిది. పూలు వాడిపోగానే మాల తీసి దూరంగా పారేస్తాం. ఆడదానిబ్రతుకూకూడా అంతే." అని నిట్టూర్చింది.

తలవంచుకుని సతి వింటూవుంది. మరల కొంచెంసేపుండి కమల అంది. "సతీ! నీకింకా ప్రపంచం సంగతి పూర్తిగా తెలియదు. అదికూడా ఒకందుకు మంచిదే. మనోవ్యాధికంటె వేరే పెద్ద వ్యాధి లేదు మనిషికి. ఇప్పుడు మనిద్దరిస్థితీ ఒక్కటిలాగానే వుంది. దుఃఖాన్ని అనుభవించమని భగవంతుడు ఆడబొమ్మల్ని చేసి పెట్టాడీ ప్రపంచంలో."

ఇది వింటుంటే గతించిన విషయమొకటి సతిమనస్సులో విద్యుల్లతలాగా తళుక్కున మెరసినట్లయింది. ఒకనాడు తమ్ముడు కాళీశంకర్ బజారునపడి పోతూవుంటే వాణ్ణి యింట్లోకి పిలవటానికని బయటివాకిలిదగ్గరకొచ్చి బజార్లోకి తొంగిచూచి తమ్ముణ్ణి కేక వేస్తూవుంది సతి. అదేసమయానికి నరేంద్రనాథ్ గుర్రమెక్కి ఆ బజారునే వచ్చాడు. జమీందారునిచూచి చప్పున లోపలికి తొలగి నిలబడింది సతి. కాని జమీందార్ మాత్రం సతివైపు అదొక రకంగా

చెడుతలంపుతో చూచాడు. అదృశ్యం తలంపుకొచ్చి సతిమనస్సు ఎంతో బాధపడింది.

సతికి యిప్పుడు తెలిసింది కమల పరిస్థితంతా. ఇక కమల జీవితంకూడా తనజీవితంలాగానే దుఃఖభరితమైనదని గ్రహించగల్గింది. కొంచెంసేపు మాట్లాడినతరువాత కమలదగ్గరనుండి సెలవు తీసుకుని యింటికి తిరిగివచ్చింది సతి. ఇంటికి చేరినాక కమల దీన దశనుగురించి సతి ఎన్నెన్నో విధాలుగా ఆలోచించి దుఃఖించింది.

# 11

మాఘమాసాన్ని ఎల్లాగో చావుబ్రతుకులమధ్య గడిపివేసింది జాహ్నవి. ఫాల్గుణమాసం వచ్చేసరికి మంచంపట్టింది. అసలే జబ్బుమనిషి. దానికితోడు ఎముకలు కొరుక్కుతినే చలి. తల్లి దీనావస్థచూస్తే సతికి కడుపు చెరువయ్యేది. పుట్టెడుదుఃఖం పొంగుకొచ్చేది. కళ్ళు బయర్లుకమ్మి నలువైపులా అంధకారమే గోచరమయ్యేది.

భట్టాచార్య చావుతో ఆ కుటుంబం కూలిపోయింది. ఇటు భర్త మరణానికి అటు అప్పులవాళ్ళ పెట్టేబాధలకూ వేగలేక, అప్పులుతీరేమార్గం కన్పించక యిల్లు దిగుడునే దారి తెలియక దిగులుపడి దిగులుపడి మంచంపట్టింది జాహ్నవి. దానితో యిక దారిద్ర్య దేవత కాలు నిలదొక్కుకుందా యింట్లో.

వడికిననూలు, పెరట్లో కాసిన కాయలూ అమ్మి సావిత్రి కూడబెట్టినడబ్బు కాస్తా డాక్టరుగారి మందుఫీజుకి సమర్పించుకోవలసి వచ్చింది. "నాకేం మందులు మాకులు వద్దమ్మా, అట్లానే నయమౌతుంది. వృథాగావున్న రెండు పైసలూ ఎందుకు ఖర్చుపెడతారు?" అని కూతుళ్ళకు నచ్చచెప్పేది జాహ్నవి. తల్లికి దిగులుపడొద్దని ధైర్యంచెప్పి పడుకోబెట్టేవారు యిద్దరుకూతుళ్ళూ. రోజుకు రోజూ జాహ్నవిస్థితి దిగజారిపోతూంది. హరికొరకు మనిషిని పంపించారు. వచ్చినమనిషిమీద మండిపడి కసిరికొట్టాడు వెనక్కు హరి. తల్లి తెలిస్తే ఎక్కడ బాధపడుతుందోనని కూతుళ్ళిద్దరూ రహస్యంగా అట్టిపెట్టారా విషయాన్ని.

ఇంట్లోవున్న చెంబు, తప్పేలా, గిన్నె, కంచం మొదలైన సామగ్రంతా గౌరిచేత బజారులో అమ్మించివచ్చిన డబ్బుతో తల్లి మందుకు, యింట్లో తిండిఖర్చుకు వినియోగించారు కూతుళ్ళు. తల్లి మంచమెక్కినదగ్గర్నుంచీ సతి సావిత్రులకు ఒక్కక్షణం తీరిక లేకుండావుంది. దిగులు, విచారాలతోపాటు యింటిపనుల్లోపడి

సతమతమైపోతున్నా రిద్దరూ. రోజుకు పదిసార్లు స్నానానికని, చీర కట్టడానికని, పూజాపునస్కారాలకని జాహ్నవిని మంచంమీది నుండి లేపి కూర్చోబెట్టాలసివచ్చింది. ఇంటిదిగులేసుకుని లోలోపలే బాధపడేవారు అక్కాచెల్లెళ్ళిద్దరూ. ఇంట్లోవున్న నాల్గుపైసలు తల్లిమందుకూ మాకుకూ ఖర్చుపెట్టుకొనినా, లేనప్పుడు యితరుల దగ్గరకవెళ్ళి చేయిచాచడం వాళ్ళకు గిట్టనిపని. నిత్యదారిద్ర్యంలో మునిగివుండడంవల్ల పొరుగింటికెళ్ళాలన్నా వాళ్ళకూ బిడియంగానే వుండేది. ఇతరులకు వాళ్ళింటికి రావాలన్నా మనస్కరించేది కాదు. అందుకని వీళ్ళ యింటిగుట్టు ఎక్కువగా బయటివారికి తెలిసేదేకాదు.

సాధ్యమైనంతవరకు యింటిభారాన్ని తన భుజాలపైనే వేసు కుని వీలున్నంత తక్కువఖర్చుతో లాక్కొచ్చేది సతి. తమ్ముడువచ్చి అన్నానికి ఏడుస్తాడేమోనని, వాడికి చాలదేమోనని అక్కాచెల్లె ళ్ళిద్దరూ సగం ఆకలితోవుండి తమ్ముడికిమాత్రం ఏ లోటూ కలు గకుండా చూచేవారు. మధ్యమధ్య మిఠాయని, బొమ్మలని వాళ్ళను బాధిస్తూనేవుంటాడు వాడు. ఇంతపొదుపుగా కాపరం దిద్దుకొ స్తున్నా, అది గడవడం బహుకష్టంగానే తోచింది

చైత్రమాసం వచ్చేప్పటికి వాళ్ళ తలిసితి కొంచెం బాగుపడి నట్లు అగుపించింది. జాహ్నవి తనంతట తానే లేచి కూర్చోగలు తుంది. తల్లిఆరోగ్యం కొంచెం బాగున్నట్లు కన్పించేసరికి అంధకా రంలోపడి, నిస్సహాయంగా కొట్టుకుంటూన్న సతికి ఆశాప్రకాశ కిరణం కన్పించినట్లయింది. బ్రతికి బయటపడినదేకాని కూటికి మాత్రం లోటులేకుండా పోలేదుగా. ఆరాకలితో తల్లి పస్తులుండ వలసిందేగా అనే దిగులుగావుండేది సతికి.

జాహ్నవి తోడికోడలు పాలుపితికి సతికి తీసుకొచ్చియి చ్చింది కాచి జాహ్నవికి యివ్వమని. సతి ఆ పాలచెంబు సావిత్రి కిస్తూ, "సావిత్రీ! ఈ పాలు కాస్తా పెట్టెలో భద్రంగాపెట్టి నిప్పు రాజేయ్. అంతలో నదికిపోయి నే స్నానంచేసివస్తా" అని కడవ చంకనపెట్టుకొని బయలుదేరించి. ఇవ్వాళి యింటినుండి

బయటికెళ్ళకూడదను గదా అనుకుంది సతి. కాని తల్లికోరకై నదికి వెళ్ళవలసివచ్చింది. కడవ చంకబెట్టుకుని బయటికిపోవటానికి తలుపు తెరిచిందో లేదో. ఏదో మడతపెట్టిన కాగితం తలుపుకు వ్రేలాడగట్టి వుండడం చూచింది. అన్నయ్య దగ్గర్నుంచి వచ్చిన వుత్తరమేమో ననుకుని కుతూహలంతో దాన్ని అందుకుంది. దానిమీద సతిపేరే వుంది. తల్లి ఆకలికివుండలేక బాధపడుతుందని, ఆలస్యంచేయడం బాగుండదని తలంచి తిరిగివచ్చినతరువాత చదువవచ్చుననుకుని కాగి తాన్ని గోడరంధ్రంలో దూర్చి నదికెళ్ళింది సతి. తిరిగివచ్చి తడి గుడ్డలతోనే పాలు వేడిచేసి తల్లికిచ్చింది సగంపాలు. వద్దంటే వద్దంది జాహ్నవి. కాని సతికళ్ళల్లో వేడి కన్నీటిబొట్లు చూచి పాలుత్రాగక తప్పలేదు జాహ్నవికి.

తడిగుడ్డలు విడవకుండానే దాచిన వుత్తరం చించి చదవ నారంభించింది సతి. మొదటిపంక్తి చదివేప్పటికి వొళ్ళుమండి పోయింది. ఎంతో కష్టంమీద చదివి పూర్తిచేసింది. ఆవుత్తరం రాసింది తనస్నేహితురాలైన కమల భర్త నరేంద్రజమీందార్. భ్రష్టపదజాలమంతా వుపయోగించి ఏమేమో రాశాడు. "నామాట వింటే మీకష్టాలన్నీతీరి మీరు సుఖంగావుండ గలుతారు." అని వాళ్ళకొచ్చిన కష్టాల్ని ఆదుకుంటానని ఎంతో సానుభూతి చూపు తూరాశాడు. కోపం, దుఃఖం, ఈర్ష్య ఒక్కసారిగా సతి మనస్సు మీద దాడిచేసినయ్. ఉత్తరాన్ని ముక్కలు ముక్కలుగాచింపి దూరంగా పారేసింది. అపవిత్రవస్తువును స్పృశించినందువల్ల తనకు సోకిన మైలను కడిగివేసుకోవడానికా అన్నట్లు వుత్తరం చదివి మైలపడిన దానివలె మరలా రెండోసారి నదికెళ్ళి స్నానంచేసి వచ్చింది సతి.

తడిగుడ్డలు విడిచి పొడిగుడ్డలు కట్టుకుని పాలనయినా త్రాగ కుండా గదిలోకెళ్ళి లోపలిగడియపెట్టుకుని ఏమేమో దీర్ఘంగా ఆలోచించ నారంభించింది సతి. ఇంతలో బయటితలుపు తట్టిన చప్పుడైంది. తలుపుతెరచి సతి బయటికొచ్చింది అన్నపూర్ణగా రింటినౌకరు ఒకచేత్తో పుష్పచందనాలతో అలంకరించబడిన ఒక

నిండుకడవ, రెండో చేత్తో ఒక పెద్ద అన్నపుబుట్ట పెట్టుకుని నిలబడి వుండడం చూచింది.

"ఇదంతా ఏమిటి?" అని అడిగింది సతి.

"ఇవ్వాళ సంక్రాంతి. అన్నపూర్ణమ్మగారు పదిమంది బ్రాహ్మలకు అన్నదానం చేశారు. ఇవి మీకిచ్చిరమ్మన్నారు." అని చెప్పి అవి అందిచ్చి తిరిగి వెళ్ళిపోయాడు. అవి తీసుకెళ్ళి లోపల పెట్టబోతూ ఏమేమి ఆలోచించుకుందో గాని సతి రెండు నేత్రాలనుండి డబడబా వేడికన్నీటిధారలు ప్రవహించి క్రిందికి జారినయి.

రెండుమూడు రోజులు గతించినయి. ఇదివరకు చోటే రెండోవుత్తరంకూడా కన్పించింది సతికి మునుపటిదానిమాదిరిగానే దీనిలోకూడ ఆశలు. ప్రలోభనాలతో కూడిన పదజాలంవుంది. దీన్నికూడా కోపంతో చించి ముక్కలు ముక్కలుచేసింది సతి. ఈసంగతి ఎవరికి తెలియనీయలేదు.

వైశాఖమాసం రానేవచ్చింది. ఈ సంవత్సరం ఈ వైశాఖ మాసంలో అన్నపూర్ణ చేసే వ్రతాలకు తెంపులేదు. మధ్యమధ్య నాలుగైదురోజులు వ్యవధవుంచి భోజనసామగ్రి, నిండుపానకపు కడవలు భట్టాచార్యగారింటికి పరుగులు తోలించింది అన్నపూర్ణ. "మా దరిద్రత కస్తూరిలాగా ఎంతదాచినా దాగకుండ నలువైపులా తన వాసనలను వెదజల్లుతున్న"దని తనలో తాను ఎంతగానో దుఃఖించింది సతి. పదిమందికీ తన హీనస్థితి వెల్లడయిందని తెలిసికూడా చేసేదిలేక నిస్సహాయురాలైంది సతి. దారిద్ర్య రాక్షసితో పోరాటం సలిపి సలిపి ప్రాణంవిసిగిపోయింది సతికి. భవిష్యత్తును గురించి దీర్ఘంగా గాఢంగా ఆలోచించ నారంభించింది ఒకరోజు తారాపూర్ కోర్టునుండి నోటీసువచ్చింది. "అసలు మూడువందలు, వడ్డీ మొత్తం అసలు ఫాయిదాలతో సహా త్వరగా చెల్లించకపోతే యిల్లు వాకిలి పాత్రసామగ్రి అంతా వేలం వేయవలసిన అవసరమేర్పడవచ్చును." అనివున్నది ఆనోటీసులో. ఇది చూడగానే సతికి ముందు నుయ్యి వెనుక గొయ్యిలాగా కన్పించింది.

గదిలోకివెళ్ళి ఒంటరిగా కూర్చుని పరిపరివిధాలా ఏమేమో ఆలోచించింది సతి విధి విడంబననుగురించి. అష్టకష్టాలకు, యీసర్వనాశనానికి పూర్తిబాధ్యత తనదేనని గ్రహించగలిగింది. "నన్నెదో సుఖపెట్టాలని తలంచినా తల్లిదండ్రులు యీనాడు యీచిక్కుల్లో తలదూర్చారు. ఈ కష్టకాలంలో మాకిక ధైర్యంచెప్పేవాళ్ళెవరున్నారు? ఎవరిదగ్గరకుపోయి 'అయ్యా! యివ్వాళ మాకు ఆరువందలరూపాయలు సహాయంచేయండి, మాయిల్లువాకిలి సర్వస్వం వదులుకోవలసే రోజువచ్చింది, మేము నిరాశ్రయులమై పోతున్నాం' అని మొరపెట్టుకోనేది? మొరపెట్టుకున్నా ఆలకించే ధర్మాత్ములు, పుణ్యాత్ములు ఎవరైనావున్నారా? వినేవాళ్ళున్నా వారిముందుకి వెళ్ళి ఆత్మాభిమానాన్ని, సిగ్గుల్ని చంపుకోవద్దూ? ఛీ, ఛీ, యీ నీచపు బ్రతుకు బ్రతకడంకంటె మరణంమేలు" అని ఏమేమో ఆలోచించుకుంది తనలోతాను.

సతిహృదయంలో చెలరేగిన ఆందోళనకు అనుకరణా అన్నట్లు ప్రకృతికూడా గాలి దుమారంతో భయంకరరూపాన్ని దాల్చింది. బయటిగుడ్డలు బయటే ఆరేసివున్నాయి. ఎక్కడెక్కడి చెత్తా, దుమ్మూ వచ్చి యిల్లంతా నింపేస్తున్నాయ్. బయట ఆరవేసిన గుడ్డలు ఫ్రాడేస్తుండగా యింట్లో నీళ్ళు బొత్తిగాలేవనే విషయం సతికీ స్మరణకువచ్చింది. ఇక రాత్రంతా యీ వాన, గాలి, దుమారం ఆగే లక్షణాలేమీ కన్పించడంలేదు. సావిత్రిని తల్లిదగ్గర కూర్చోబెట్టి తాను కడవతీసుకుని నీళ్ళకెళ్ళింది సతి. మోకాళ్ళలోతు నీళ్ళల్లో కడవముంచి తలపైకి లేపేటప్పటికి ఎదురుగా ఒడ్డుమీద ఏవరో వ్యక్తి నిలబడివున్నట్లు గ్రహించి జాగ్రత్తగా పరిశీలించింది. ఆ నిల్చున్న వ్యక్తి జమీందార్ నరేంద్రనాథ్ అని గుర్తించగలిగింది చివరికి.

ఇక భూమిమీద సతికి కాళ్ళు నిలువలేదు. పెద్దగా అరచి గోలచేద్దా మనిపించింది. కాని నోరు పెగవలేదు. అలాగే నీళ్ళల్లో నిలబడిపోయి గడగడ వణక నారంభించింది. నరేంద్రుడు డిబిమాచి

నవ్వుతూ ఎందుకు భయపడతావ్? సతీ! నేనేం ఎలుగొడ్డునా, పెద్దపులినా? నీ పేర రెండు వుత్తరాలు రాసినా ఒక్కదానికైనా నువ్వు సమాధానం రాయలేదు ఎందుకని?

"ముందు మీ రిక్కడినుండి వెళ్ళిపోండి. లేకపోతే పెద్దగా అరచి గోలచేస్తా" అంది సతి.

"అది వట్టి తెలివితక్కువపని. నువ్వు చాలా బుద్ధిమంతురాలివని విన్నా. చేతికందిన లక్ష్మిని కాళ్ళతో తన్నేస్తున్నావు. కష్టాలన్నీ గట్టెక్కె రాశివయ్యేగోటు వచ్చింది. ఈ తరుణం చేతులారా జారవిడుచుకుంటావా? రేపో మాపో మీ యిల్లు వేలం వేస్తారని తెలిసింది. ఇక మీరంతా ఎవరిపంచకు చేరుతారు? నామాట విను. దీనివల్ల నీకుగాని, మీ తల్లికిగాని, చెల్లెలికగాని, అన్నదమ్ములకుగాని ఎటువంటి కష్టనష్టాలూ వుండవు".

నీళ్ళల్లో నిలబడి గడగడలాడిపోతూవున్నది సతి. యమధర్మరాజే యీ నరేంద్రునిరూపంలో ఆమె ముందు ప్రత్యక్షమయ్యాడా అనిపించింది. ఆ పాపి మరలా ప్రశ్నించాడు "చెప్పు, ఏమిటి నీ వుద్దేశ్యం? మీ తల్లి, అన్నదమ్ములూ, చెల్లీ అంతా పరాయిపంచల జేర పరాయివాళ్ళముందు మానాభిమానాలు వదలి భిక్షకు బయలుదేరుతారా? ఇంటిలోనివాళ్ళంతా పస్తులుండి ఆకలితో మరణించడానికి సమ్మతిస్తావా? లేక నామాట విని నాదానివి అవడానికి సమ్మతిస్తావా?"

రెండు చేతులతో తన కళ్ళు రెండూ మూసుకుంది సతి. తన మంత్రం పారిందని సంతోషించాడు నరేంద్రుడు. సంతోషం పట్టలేక అన్నాడు, "మీ హరి అన్నాయ్‌ద్వారా మీ యింటి విషయాలన్నీ రోజుకు రోజూ తెలుస్తూనే వున్నాయ్. నిన్ను ఆ రోజు చూచినదగ్గర్నుంచీ నీ పేరే జపిస్తున్నా. స్థితిగతులు బాగున్నప్పుడు వచ్చినా మీరు గ్రహించరని తెలిసి యింతకాలంవరకు నిన్ను అడగ సాహసించలేకపోయాను. నువ్వు నాదానివి కావటానికి తలెగరవేస్తే చాలు వచ్చిన కష్టాలన్నీ నిముషంలో మాయమై

పోతయి. అనవసరంగా కష్టాల్లో తలదూర్చవద్దు. నీకు కావలసిన డబ్బు యిప్పుడే యిచ్చేస్తా. ఎంత కావాలో చెప్పు'' అన్నాడు. ఇదంతా వింటూంటే నరకకూపంలోకి దుమికినట్లుగావుంది సతికి. ఆమె ఏమేమో అనేసింది, ''మీ రిక్కడనుండి వెళ్ళండి, లేక పోతే యీ నీళ్ళల్లోనే పడి ప్రాణాలు వదుల్తా''.

''సరే యిక నే వెళ్ళిపోతా. రేపుకూడా యిదే సమయానికి రానా ? అరెరె విపరీతమైన గాలిదుమారం లేచివస్తుంది. సరే యిక నువ్వు పో.''

''ముందు మీ రిక్కడినుండి పోయేదాకా నేను ఒడ్డు ఎక్కను.''

''నే నేమన్నా సర్పాన్నా, దగ్గరకొస్తే కాటువేయడానికి ? సరే వెళ్తున్నాలే.'' పాపిష్టి వికారంగా నవ్వుకుంటూ వెళ్ళి పోయాడు. లోన అనుగివున్న, మానవత్వానికి వేరుపురుగైన కుప్రవృత్తి శరీరరూపందాల్చి ఎంతో నేర్పుగా తనవలలో చిక్కించుకోవడంకోసం యీ రూపందాల్చి వచ్చిందా అనిపించింది సతికి. దాని బారినుండి ప్రస్తుతానికి నేర్పుగా తప్పుకోగలిగినందుకు సతిని ప్రశంసించవలసిందే. ఆమె నలువైపుల నల్లనిభూతాలు వికటాట్టహాసంచేస్తూ నాట్యంచేస్తున్నవా అన్నట్లు అనిపించింది సతికి.

చెరువుకట్ట ఎక్కేప్పటికి కుడివైపునుండి కట్టమీదుగా ఎవరో పరుగెత్తుకుంటూ వెళ్ళేవ్యక్తి తనను చూచి అకస్మాత్తుగా ఆగి తనవైపు చూస్తున్నట్లు కనిపెట్టింది సతి. ఆ ఆగినవ్యక్తి సతిని ఆపాదమస్తకం తీక్షణదృక్కులతో పరికిస్తున్నాడు. ఒక్క నిముషంసేపు అలాగే పరికించి మరలా ముందుకుసాగిపోయాడు త్వరత్వరగా. అతడు విశ్వేశ్వరుడని సతి గుర్తుపట్టింది. చెరువుకట్ట మీదనుండి నరేంద్రుడు దిగడం తప్పక విశ్వేశ్వర్ చూచివుండవచ్చు నని వూహించింది. ఒక్కసారి ఆ చెరువునీళ్ళల్లోపడి చచ్చిపోదామా అనిపించింది ఆమెకు. బలవంతాన అట్టిప్రయత్నాన్ని విరమించుకుని

పెదవులు కొరుక్కుంటూ యింటికెళ్ళిపోయింది. ఇప్పుడామె ముఖంమీద భయచిహ్నాలు లేవు. తనలో తాను ఏదో సంకల్పించుకున్నట్లుగావుంది.

ఆమె సంకల్పం మేరుపర్వతంలాగా నిశ్చలంగా దృఢపడిపోయిందామెమనస్సులో.

# 12

మునుపటిమాదిరిగా పొలంపోయి పనివాళ్ళమీద అజమాయిషీ చెలాయించి పెత్తనంచేయడం మానుకున్నాడు విశ్వేశ్వర్. పాలికాపులకూ తనకూ అభిప్రాయభేదాలు రావడమే దానికి కారణం. అదనంగా ఎంతో పొలంకొని అట్టహాసం గట్టిచేశాడు. అనేక చేతిమగ్గాలు నెలకొల్పాడు. అనేకమంది చేనేతవారిని రప్పించి రకరకాల రంగుగుడ్డలు నేయించి కలకత్తాలో క్రొత్తగా కొట్టుపెట్టి వీటన్నిటిని అమ్మడానికి ఏర్పాటుచేయించాడు. చేనేతవస్త్రాలకు గిరాకీకూడా బాగానేవుంది. ఇదంతా డబ్బుకోసం తాపత్రయమే. డబ్బులేకుండా దేశంలోని క్షామపీడితులకు అన్నదానం చేయాలంటే మహాకష్టం.

తనవూళ్ళో బీదప్రజలు లేరని వాళ్ళయెడ విశ్వేశ్వర్‌కు సానుభూతి లేదనికాదు దీనిభావం. నోరెత్తి అడుగనివారికి 'బిచ్చం పెడతారా బాబూ' అని ఎలా నవ్వులపాలు గావలసివస్తుందో సతిద్వారా గుణపాఠంనేర్చుకున్నాడు విశ్వేశ్వర్. కనుకనే వూళ్ళోవున్న బీద ప్రజానీకంవైపు అతనిదృష్టి పోవడంలేదు.

ఒకనాడు చేనేతమగ్గాలపని తనిఖీచేసివచ్చి భోజనానికి కూర్చున్నాడు. అన్నపూర్ణ ఎదురుగాకూర్చొని అన్నం వడ్డిస్తుంది. ఎందుకో యివ్వాళ పిన్నిముఖం వాడిపోయి విచారగ్రస్తంగా వున్నట్లు గమనించాడు.

ఆమెముఖంమీద కరుణారసచ్ఛాయలు గోచరిస్తున్నయ్. కారణం తెలుసుకోవాలనుకున్నాడు. "ఏమిటి పిన్నీ విచారంగా వున్నావ్, యివ్వాళ?" అని అడిగాడు.

"ఏమిలేదులే నువ్వు అన్నంకానియ్ నాయనా" అని పెద్దగా నిట్టూర్చిందిఅన్నపూర్ణ. మారుమాట్లాడకుండా అన్నంతిననారంభించాడు విశ్వేశ్వర్. అన్నపూర్ణ తనంతటతానే, "ఆహా! చూడంగానే పుట్టెడు దుఃఖం పుట్టుకొస్తూంది" అని మరలా నిట్టూర్చింది.

"ఎవరినిచూస్తే, పిన్నీ?" అని ప్రశ్నించాడు విశ్వేశ్వర్. "వాళ్ళ నేరా, భట్టాచార్యకూతుళ్ళని. నువ్వువచ్చేముందే సతి నన్ను చూచిపోవడానికి వచ్చిపోయింది. ఆ అమ్మాయిముఖం చూడగానే కడుపులో దుఃఖం ఆపులేకపోయారా" అంది. మారు మాట్లాడ కుండా గబగబా రెండు మెతుకులు గొంతులోవేసుకొని తనగదిలోకి వెళ్ళిపోయాడు విశ్వేశ్వర్. పక్కమీదపండుకుని ఏదో గాఢాలో చనలో మునిగిపోయాడు. తలక్రింద దిండు ఎత్తుపెట్టుకుని నిద్రాదేవ తను ఆరాధించినా నిద్ర రావడంలేదు. అతనిదృష్టి అకస్మాత్తుగా ఎదురుగానున్న పుస్తకాలమీద పడింది. బయటపని ఎక్కువయి నందున వాటిని తాకటానికికూడా తీరిక దొరకడంలేదు. ఆ పుస్త కాలమీద ఏదో కాగితం గాలికి రెపరెపలాడడం కనిపించింది. తాను ఎప్పుడూ అక్కడ ఉత్తరంగాని, కాగితం ముక్కగాని పెట్టి ఎరుగడే! అది ఎవరు ఎప్పుడు ఎందుకు పెట్టారు? పిన్ని ఎప్పుడూ యీగదిలోకి అడుగుపెట్టదే! ఆతురతగావెళ్ళి చూచాడు. అది ఉత్తరమే - దానిపై చిరునామా అక్షరాలుచూస్తే ఎవరో స్త్రీ దస్తూరిలాగావుంది. ఉత్తరం చింపి చూచాడు. రెండు మూడు వాక్యాలు చదవగానే రకరకాల భావాలు అతనిహృదయంలో పరుగులు తీసినయ్. మనస్సు చలించిపోయింది. ఆద్యంతం చదవా లనుకుని దీక్షగా చదవసాగాడు.

"అనేక నమస్కారములు చేసి మీకు వ్రాయునదేమనగాయీ ఉత్తరం చూచీచూడడంతోటే ఎవరు వ్రాశారా అని మీరు విస్మయం జెందవచ్చు. అందుకని తొలుతగా నేనీవిషయాన్ని తేట తెల్లం చేయదలుచుకున్నా.

నేను "సతి"ని. ఏమేమో రాయాలని మొదలెట్టాను. రాయాలంటే ఏమి రాయాలో తోచడంలేదు. నా చేతులు ఎట్లా పోతే అట్లారాస్తున్నా. వెనుకముందు లాలోచించకుండా హృద యంలోని భావాలను నిర్భయంగా, నిర్లజ్జగా పొందుపరుస్తున్నా. నేనీనాడు నిర్వహించదలచిన కర్తవ్యాన్నిగురించి మీకు చెప్పా

లనే తలంపుతో నే నీ వుత్తరాన్ని రాయడానికి సాహసించాను. ప్రపంచం దృష్టిలో నేనీనాడు దోషిని. అపరాధిని. ఏఏ పరిస్థితుల వత్తిడివల్ల నేను దోషినయ్యానో మీకు తెలుపకుండానే వుండదల చలేదు. నాబుద్ధి నన్నీవిధంగా ఎందుకు ప్రేరేపించిందో నే చెప్పలేను.

"అయిదురోజుల క్రితం పెద్ద తుపాను వచ్చినపుడు యింటి వెనుకాలవున్న చెరువుగట్టుమీద జరిగిన సంఘటన మీకు జ్ఞాపకం వుండివుండవచ్చు. ఆ రోజు ఎవరో పోతూవున్నట్లుగా మీరు చూచిన వ్యక్తి చాంద్‌పూర్ జమీందార్ నరేంద్రనాథ్. నీళ్ళలో నిలబడివున్నట్లుగా మీకు కనిపించిన స్త్రీని నేనే.

"ఆరోజు జరిగిన సంఘటననుగురించికూడా బహుళ మీరు విచారించి తెలుసుకుని వుండకపోవచ్చు. మేమిద్దరం అక్కడ ఎందుకు, ఎలా కలుసుకోగలిగామోకూడా మీకు అర్థంకాక పోవచ్చు. సామాన్యంగా అటువంటి దృశ్యాలుచూచి యితరు లేమని అపోహపడుతారో మీరూ అదేవిధంగా అపోహపడివుండ వచ్చు. గౌరవ కుటుంబంలోపుట్టి ఆత్మాభిమానంగల యువతికి అటువంటి పనిచేయడం సంభవమనిగాని అసంభవమనిగాని మీరే మైనా ఆలోచించగలిగారా?

"నేను నిర్దోషినని నిరూపించుకోడానికై యీ వుత్తరాన్ని రాయడంలేదు. నేను దోషినే. నిజం చెప్పాలంటే నేను ఆ పాపిష్టి వాడు పెట్టిన ఆశలకు లోనయ్యాను. ఆ ప్రలోభనాలనుండి తప్పించు కోడం నావశం కాలేకపోయింది. ఇంకా గూఢంగా చెప్పా లంటే ఆ పాపిష్టి అడిగినదానికి ఎక్కువగానే యివ్వదలచాను. అతడు అడిగింది నా దేహాన్నిమాత్రమే కాని నా ఆత్మనే అతనికి దానంచేశాను.

"చెప్పదలచుకున్న విషయాన్ని సాఫీగా చెపుతున్నా. అతడు నాకు కోరినంత ధనమిస్తానన్నాడు. మీరు మొన్నచూచిన సంఘటనకు మూడురోజుల క్రితం తారపూర్ కోఠీ సాహుకార్లు

మూడు రోజుల్లో యిల్లు కాళీచేసిపోవలసిందని యింటి తలుపుమీద నోటీసు అంటించిపోయారు. ఆ రోజు మధ్యాహ్నం మరలావచ్చి జమీందార్ నరేంద్రనాథ్ నా పాదాలమీద వెయ్యిరూపాయల నోట్లు అర్పించిపోయాడు. నేను వాటిని స్వీకరించాను. ఇవ్వాళే రాత్రి అతడు ఆ చెరువుదగ్గరకొచ్చి నాకోసం ఎదురుచూస్తాడు. ఇక నేను యీ యిల్లు వదలిపోతా. ఇది నా దృఢనిశ్చయం. దీనికక తిరుగులేదు. ఇవ్వాళే తప్పక వెళ్ళిపోతా. కాని అతనిదగ్గరకుకాదు. మరో పురుషునిదగ్గరకు.

"ఈ ప్రపంచములోని అందరి మానవుల్లాంటివాడుకాదతను. అతడు నిర్దయుడో సహృదయుడో నాకు తెలియదు. నాకు ఏ శిక్ష విధిస్తాడో నాకే తెలియదు. ఏది ఏమైనప్పటికి అతని చేతుల్లో నే చేసిన నేరానికి తగిన శిక్ష పొందడానికి స్వీకరించాను. ఈ పాపిష్టి నరేంద్రుడు నన్ని పాపపంకిలంలోకి లాగకపోయినట్లయితే నేనీ నిశ్చయానికి వచ్చివుండేదాన్నికాను.

"లేకపోతే నా తమ్ముడు, తల్లి, చెల్లెలు, యిల్లు, వాకిలి వదిలి భిక్షువల్లాగా బజారుపాలు కావలసివచ్చేది. ఆకలికి అల్లాడేవారు లోకుల అపహాస్యానికి గురయ్యేవారు. నా కళ్ళారా ఆ దృశ్యాన్ని ఎలా చూడగలేది? నా ఆత్మసుఖంకోసం మోహంలోపడి వాళ్ళనెలా మరచిపోయేది? అళల నెలా ఎదిరించేది? నా ఆత్మ జన్మ జన్మాంతరాలవరకూ రౌరవనరకంపాలవుతుంది. అయినా యీ తుచ్ఛభయం నా ఆత్మహత్యకు అడ్డునిలువదు. కష్టాలు, దుఃఖాలు నాకు జన్మతః వున్నవే. లోకులు నన్ను నిందిస్తారు. నిందించనివ్వు. మావాళ్ళు సుఖపడడమే నా లక్ష్యం. ముందుముందు వాళ్ళ కష్టాలన్ని దూరం కావచ్చు. భగవంతుని అభిమానానికి పాత్రులరాలను కాలేకపోయానని నాకు తెలుసు. కాబట్టే నేనీ స్వల్ప సుఖాన్ని పొంది నిశ్చింతగా యీ ప్రపంచాన్నుండే శలవు తీసుకుంటున్నా. సావిత్రి అమాయకురాలు. నే నేదిచెప్పితే అది నమ్మేస్తుంది. రూపాయ లెక్కడివంటే దారిలో దొరికిన య్యన్నాను. దొరికినసొమ్ము నిర్భయంగా తీసుకోవచ్చన్నాను. కష్టాలనుండి

విముక్తి పొందాలనే ఆశ పెట్టుకున్నందువల్ల సంతోషంతో వుబ్బి పోయింది నా పిచ్చిచెల్లి. ఇంత సంతోషంగా వుండడం నే నెప్పుడు చూచియుండలేదు. అక్కయ్య తనగుండె పిండుకుని తెచ్చిన ఎఱ్ఱని చిక్కని రక్తపుఫలితమే యీ ధనమని పాపం, దానికేం తెలుసు ?

"మీరు ఒకప్పుడు మా దారిద్ర్యానికి సానుభూతి చూపుతూ డబ్బు పంపించిన విషయం జ్ఞప్తి వుండవచ్చు మీకు. ఆవేళ మాకు డబ్బు అవసరంలేదు. అందుకనే వెనక్కు త్రిప్పి పంపాను. అయినా మీరు మా కెలాంటి చుట్టమూ కాదు, మీ దయా ధర్మాలను మేము స్వీకరించడానికి.

"నేనీ రోజు సాక్షిమానంగా సిగ్గులేకుండా రాస్తున్నా. ఏవిధంగా ఆలోచించినా మీ భార్య కావడానికి నేను అనర్హురా లనుమాత్రం కాను. అయినా మీరు నన్ను తిరస్కరించారు. పోనీ మీకు నచ్చిన స్త్రీ నెవరినైనా చేసుకున్నారా అంటే అదీ లేదు. నాకు తెలుసు స్త్రీజాతిపట్ల మీకు ద్వేషం, ఈర్ష్య వున్నయ్యని. ఈ అధమ స్త్రీజాతిని మీరిక మున్ముందు ప్రేమించేరోజు వస్తుంది. ఇదే చావుకుముందు మీకు నే పెట్టే శాపము. ఈ అధమజాతి హృదయంలో ఎంత అగాధమైన సముద్రముందో అప్పుడు మీకే తెలిసివస్తుంది. దాని మార్గం మీకే బోధపడుతుంది. ప్రపంచంలో స్త్రీజాతి ప్రేమ స్నేహ భావాలకు పుట్టినిల్లని, సుఖప్రదాయినని మీరే ఒప్పుకుంటారు.

"స్త్రీజాతికి సహనగుణము వెన్నతో పెట్టిన విద్య. ఈ గుణాన్ని కాపాడడంలో నే నెన్నడు వెనకడుగువేసి ఎరుగను. వచ్చిన కష్టాలన్నింటిని నిశ్చింతగా నెత్తిమీద పెట్టుకున్నాను. పరిస్థితుల వత్తిడికి తట్టుకోలేకపోయినందున ఆడవాళ్ళ నోళ్ళల్లో నాపేరు నానవలసివచ్చింది. చివరకు నేనీ యుక్తిపన్నాను. ఆత్మ హత్య నా అంతిమ శరణ్యం. "లోకం నన్ను నిందించవచ్చు. నిందించనివ్వు. కాని మీరుమాత్రం నిందించవద్దు. ఒక్కసారి మతికి

తెచ్చుకోనండి. మీరే నన్ను మీ పాదదాసిగా స్వీకరించినట్లైతే ఈనాడు నాకీ దశ పట్టివుండకపోవచ్చు. తల్లిని, తమ్ముణ్ణి. చెల్లెల్ని రక్షించుకోడానికి నన్ను నేను అమ్ముకోనవలసిన అవసరం వుండేది కాదు.

"మీ పిన్నిమాటలకు నా హృదయంలో ఆశాలతలు చిగిర్చినయ్. కాని కొద్దికాలంక్రితమే వాటి నన్నిటినీ కూకటివేళ్ళతో సహా పీకిపారేశాను. కమలమాదిరిగా నేనూ వున్నవారికోడలనై వచ్చిన కష్టాలను మరచివుండేదాన్ని. నిర్భాగ్యురాలను కాబట్టి నా ముఖాన అది రాసిపెట్టియుండలేదు. ఈ దరిద్రురాలి హృదయఫలకంమీద మీ మూర్తి సదా నిలచియుండేది. కాని చీకటితెరలచాటునసే రహస్యంగా దాచిపెట్టేదాన్ని మీ మూర్తిని. స్వయంగా మీ మూర్తిని వెలుగులోకి తీసుకొచ్చి కళ్ళారా చూచుకునే అదృష్టంగాని అవసరంగాని నాకు కలుగలేదు. ఈనాడు అవసరంగలిగింది. ఇక ఈ జీవితంలో నే బ్రతికి చేయవలసిన కార్యమేదీ లేదు. నేనిక శాశ్వతంగా విశ్రాంతి తీసుకోదలచాను.

"మిమ్ము గురించి కోపంగా ఏమేమో పెద్దపెద్దగా రాయాలనుకునికూడా రాయలేకపోతున్నాను. మీరంటే నా హృదయంలో యింత అభిమానం దేనికి పుట్టుకొచ్చిందో నే చెప్పలేను.

"పరోపకారచింతతో మీ రివ్వబోయిన ఉపకారాన్ని తిరస్కరించి మీకు తీరని అపచారంచేశానని నే ననుకుంటున్నాను. మీమీద కోపపడవలసింది కాదు. కాని జరిగినవాటిని త్రవ్వుకుని చర్వితచర్వణం చేయడం నా కిష్టంలేదు. జరిగినవేవో జరిగిపోయినయి. వాటిని మరచిపోండి. మా తల్లి, తమ్ముడు, సోదరినిమాత్రం కనిపెట్టి వుండి ఆపదలొచ్చినపుడు వారిని ఆదుకోవలసిందిగా మిమ్ము నేను ఆఖరిసారిగా ప్రార్థిస్తున్నా. వారిని మంచిదారికి తీసుకురావడానికి ప్రయత్నంచేయవలసిందిగా కూడా నేను మిమ్ము కోరుతున్నా. ఎందుకో నా అంతరాత్మ చెపుతూంది — నేనీ

ప్రపంచాన్ని విడిచిపెట్టిపోవడంతోటే మావాళ్ళ దశ తిరిగిపోయి వారి కష్టాలన్నీ దూరమైపోతవని.

“మీరీ విషయంలో మానసికంగా బాధపడవద్దు. భగవంతుడు మీకు ఆయురారోగ్యాలు అష్టైశ్వర్యాలు ప్రసాదించుగాక. వీలయితే మంచిసంబంధం చూచి సావిత్రికి వివాహం చేయవలసిందిగా నా అంతిమ ప్రార్థన. మంచిది. శలవు.

ఇట్లు
సావి.”

# 13

ఉత్తరం చదవడం పూర్తిచేసి విశ్వేశ్వర్ నిర్జీవపాషాణమూర్తిలాగా నిలబడిపోయాడు. ఏమి ఆలోచించడానికైనా మనసే మితం లేదు. ఉత్తరం చదివినంతసేపు అగాధజలరాసిలో మునిగి తేలుతూన్నట్లుందతనికి. కాళ్ళు చేతులు చల్లబడిపోయినయి. కంటికి అంతా శూన్యంగా కన్పించిందతనికి.

గది బయట అన్నపూర్ణ ఏమిటో ఆతురతగా పిలుస్తున్నట్లు వినిపించింది. "విశూ, విశూ" అని ఆర్తకంఠంతో కేక వేసింది. విశ్వేశ్వరుడికి జవాబివ్వడానికైనా నోరు పెగలలేదు. గదిలోకి గబగబా ఎంతో ఆతురతగా పరుగెత్తుకుంటూవచ్చి, "నువ్వింట్లోనే వున్నావా, విశూ? ఊళ్ళోసంగతి నీ చెవిని పడిందట్రా? భట్టాచార్యగారిల్లు వేలంవేస్తామని మూడురోజులనాడే నోటీసు అతికించివెళ్ళారట యింటితలుపుకు. నాకీసంగతి తెలియనే తెలియదు వూళ్ళోవున్నా. ప్రక్కింటి రామధన్ భార్య వెళ్ళివచ్చి నాతో చెపితే తెలిసింది. షాహుకారి గుమాస్తాలు ముగ్గురు వచ్చి యిల్లు ముట్టడించారట. ఇంకా కొంచెంసేపట్లో యింట్లో వాళ్ళందర్నీ ఒక్కొక్కర్నీ మెడపట్టుకుని బజార్లోకి నెట్టేస్తారు పాపం! ఎవరిపంచ చేరుతారు వాళ్ళంతా? పో, పో. నువ్వు ముందు పోయి వచ్చినవాళ్ళకు కాస్త నచ్చచెప్పి ఆపు. నాకీసంగతి మొన్ననే తెలిసివుంటే ఏదో ఏర్పాటుచేసివుండేదాన్ని" అని గుక్క తిప్పుకోకుండా అన్నది అన్నపూర్ణ.

విశ్వేశ్వర్ కళ్ళుతెరచి చూచాడు. అన్నపూర్ణ నేత్రాలనుండి కన్నీటిధారలు సెలయేళ్ళలాగా క్రిందికి జారుతున్నయ్. ఇది చూచేసరికి విశ్వేశ్వరుని కళ్ళుకూడా చెమ్మగిల్లినయి. అయినా తను పోతే ఏమైనా లాభముంటుందేమో అనుకున్నాడు. కనీసం సతినైనా రక్షించవచ్చునుగదా అనుకుని నెత్తిమీద చేతులుపెట్టుకుని బజారునపడి పరుగులుతీశాడు.

భట్టాచార్యగారింటికి చేరేసరికి వాళ్ళ యింటిచుట్టూ వూళ్ళో జనమంతా గుమిగూడివుండడం చూచాడు. షాహుకారు, అతని గుమాస్తాలు యింట్లోకి ప్రవేశించబోతున్నారు. ఇంటిలోపలినుండి పెద్ద ఏడుపు వినిపించింది. ఇది చూచి యిరుగుపొరుగువారి ఆనందానికి అంతులేకుండావుంది. "అణగాలి. అహంకారం అణగాలిసిందే. వాళ్ళకీగతి పట్టాలిసిందే. మనమింత యిరుగుపొరుగునవున్నా ఒక్కనాడు రాకపోతే ఒక్కనాడైనా మనతో యీ సంగతి చెప్పలేదు మాటమాత్రంగానైనా. చూచారా వాళ్ళ అహంభావం" అని అంటూ గుమిగూడినవాళ్ళు తమతమ ఈర్ష్యద్వేషాలు బయటికి వెళ్ళగ్రక్కుకుంటున్నారు. ఇంతలో విశ్వేశ్వరునిచూచి అందులో కొందరు, "ఏం బాబూ, మీరుకూడా యిక్కడికి వచ్చారేం? మీబోటివారెవరూ యీ విషయాల్లో జోక్యంకలుగజేసుకోకూడదు. రా బాబూ! బయటికిపోదాం" అన్నారు. విశ్వేశ్వర్ నిరుత్తరుడై నిలబడ్డాడు. ఏడ్పు వినిపించేగదికి గబగబా వెళ్ళాడు. విశ్వేశ్వర్ పరుగెత్తడంచూచి షాహుకారు గుమాస్తాలు ప్రక్కకుతొలగి నిలబడ్డారు.

జాహ్నవి తోడికోడలు గడపదగ్గరకూర్చుని గొంతుపగిలిపోటట్లుగా అరుస్తూ ఏడుస్తూవుంది. గదిమధ్యన సావిత్రి, మట్టిలోపడి కాళీశంకర్ దొర్లిగింతలు పెడుతూ ఏడుస్తున్నారు. వారిదగ్గరకెళ్ళి నిలబడి, "సతీ!" అని ఆర్తకంఠంతో పిలిచాడు బిగ్గరగా. ఈ పిలుపు వినంగానే అతనివైపు అంతా కళ్ళెత్తి చూచారు. చిన్నపిల్లవాడు కాళీ పెద్దగా అరిచాడు, "విశూ అన్నాయ్! మా అక్కయ్య, మా అక్కయ్య—" విశ్వేశ్వర్ వికృతకంఠంతో అడిగాడు.

ఏమయింది కాళీ, ఏమయింది?

"నీకు తెలియదూ? విశూ అన్నాయ్, అక్కయ్య మాట్లాడకుండా పడివుంది. అక్కయ్య చచ్చిపోయిందని పెద్దమ్మ అంటుంది."

విశ్వేశ్వర్ క్రిందికివంగి నేలకు మోకాళ్ళానించి జాహ్నవికి దగ్గరగా కూర్చుని ఆమె ఒడిలోవున్న సతి ముఖంచూడడానికి ప్రయత్నించాడు. జాహ్నవి ముఖం ప్రక్కకుత్రిప్పి విశ్వేశ్వరుని చూచింది. ఆమెదుఃఖం ద్విగుణీకృతమైపోయింది. బాణంవల్ల గాయ పడిన పక్షిలాగా రొమ్ముబాదుకుంటూ, "ఏం నాయనా, విశూ, నా సతికి శరణివ్వడానికి వచ్చావా? మా సతికి పెళ్ళవబోతుందని వచ్చావా? ముసలివాడికిచ్చి దానిపెళ్ళి చేయలా? నా సతి విషం తాగి చావలా? ఏమిటిదంతా కలా? చూడు నాయనా చూడు. నా సతి యీలోకంలో లేదిక" అంటూ పెద్దపెట్టున ఏడ్పు సాగించింది.

విశ్వేశ్వర్ మహాకష్టంగా జాహ్నవిని ప్రక్కకుతొలగించి సతిని చూడడానికి ప్రయత్నించాడు. రెండుచేతులతో ముఖం కప్పుకొని బోర్లగా పడివుంది సతి. ఆమెను తాకుదామంటే చేతులు రాలేదు విశ్వేశ్వరుడికి. సతి ఏదో దీర్ఘచింతలో, యోగ సమాధిలో నిమగ్నమైనట్లుగా కన్పించింది. యోగసమాధిని భంగం చేయడానికి మనస్కరించలేదు విశ్వేశ్వరుడికి. విశ్వేశ్వరుడు సంకో చించడం గమనించి సావిత్రివచ్చి సతిముఖాన్ని ప్రక్కకుత్రిప్పి, "చూడు విశూ అన్నాయ్! మా అక్కమీదవున్న మా ఆశలన్నీ బూడిదపాలయిపోయినయి. మా అక్కయ్య యీ ప్రపంచాన్ని వదలిపోయింది. చాలసేపయింది" అంటూ కంటికి మింటికి ఏక ధారగా ఏడుస్తూ అంది. విశ్వేశ్వర్ సతి మృతకళేబరంమీద చెయ్యి పెట్టి చూచాడు దేహమంతా చల్లబడిపోయివుంది. జాహ్నవి రొమ్ములుబాదుకుంటూ ఏడుస్తూవుంది. "నాయనా విశూ, మా అమ్మ, మాసతి, బ్రతికినన్నాళ్ళూ కష్టాలే ఎళ్ళబోసింది. సుఖపడిన ఘడియ ఒక్కటికూడా లేదు. తన కష్టాలు యితరులెవరితోనూ చెప్పుకుని ఎరుగదు. జీవితంమీద అసహ్యంపుట్టి ఎవ్వరితోనూ చెప్ప కుండా తనదారిని చక్కాపోయింది. నాలుగోజాలుండి పోమ్మా అనే అవకాశంకూడా లేకుండాచేసిపోయింది కూతురు. జీవిత మంతా దుఃఖాగ్నికి గురయి శలభంలాగా మాడి మసియై చల్లబడి

పోయింది కూతురు. ఇంత నిశ్చింతగా జీవితంలో ఎప్పుడూ నిద్ర పోయి ఎరుగదు. ఇవ్వాళే నా ముద్దుతల్లి సతి హాయిగా సుఖంగా శాశ్వతనిద్రలో మునిగిపోయింది'' అని ఏమేమో తలపోస్తూ తల వెండ్రుకలు పీక్కుంటూ రోదనచేస్తూవుంది.

ఇసుక వేసిన రాలని జనం యిల్లంతా నిండిపోయారు. ఎట్లా చనిపోయింది? ఎందుకు చనిపోయింది? ఏమి తిని చనిపోయింది? విష మెక్కడనుంచి తీసుకొచ్చింది? మొదలైన ప్రశ్నాపరం పరలు నలువైపులా బయలుదేరినయి. ఇది చూచి ఆనందపడే వాళ్ళుకూడా లేకపోలేదు.

కొంతమంది సానుభూతిపరులు తర్క వితర్కాలు ముగించి సతి పండుకున్న మంచంమీద తలగడవైపు వెతికారు. ఒక చిన్న సీసా, ఒక చిన్న కాగితంముక్క దొరికినయి. కాగితంలో వ్రాసి వుంది ''నేను బుద్ధిపూర్వకంగానే ఆత్మహత్య చేసుకున్నాను. దీనికి నేనే పూర్తిగా బాధ్యురాలను. నా తల్లి, చెల్లెలు, తమ్ముడుగాని నా ఆత్మీయుల్లో ఎవరికీగాని యీ విషయాన్నిగురించి ఈషణ్మాత్ర మైనా తెలియదు—సతి''.

యమదూతల్లాగా యిల్లు వేలం వేయడానికి వచ్చిన సాహుకారు, గుమాస్తాలు నిలబడివుండడం అందరూ గమనించారు. కష్టాలమీద కష్టాలు పరంపరలుగా రావడం భట్టాచార్య కుటుంబానికి ఎప్పుడూ తప్పలేదు. అన్నపూర్ణ జాహ్నవిని ఓదారుస్తూ విశ్వేశ్వరుని పిలిచి చెవిలో నెమ్మదిగా, వచ్చిన సాహుకారును నచ్చజెప్పి పంపమని చెప్పింది. సాహుకారుని బయటికి ఏకాంత ప్రదేశానికి తీసుకెళ్ళి అసలు ఫాయిదాలు మొత్తం 700/-లు చెల్లించి తాకట్టుకాగితం తీసుకుని తనదగ్గర పెట్టుకున్నాడు విశ్వేశ్వర్.

సాహుకారుగారు యిల్లు వేలంవేస్తూవుండగా చూచి ఆనందిద్దామని వచ్చిన కొంతమంది పెద్దలకు, సాహుకారుగారు యింటి

నుండి తిరిగిపోతూంటే చూచి నిరాశ జెందవలసివచ్చింది. విశ్వే శ్వరుడు ఏదో నచ్చజెప్పి వెనక్కి పంపాడని అంతా అనుకున్నారు. ఇంకా వాళ్ళ ఆశ తీరలేదు. కోటిమానవుడు కష్టాల్లోపడి దారీ తెన్నూ కానక సతమత మాతూవుంటే, చూచి మనసారా ఆనందించా లని కుతూహలపడేవారి హృదయాలకు తీరని ఆశాభంగం కల్గింది. పోలీసు యిన్‌స్పెక్టరుకు కబురుపంపారు. ఆత్మహత్య కేసునుగురించి దర్యాప్తు చేయవలసిందిగా కోరుతూ.

కబురుచేరడమే ఆలస్యం, పోలీసు యిన్‌స్పెక్టరు గవర్న మెంటు డాక్టరును వెంటేసుకుని ప్రత్యక్షమయాడు. కాని యిక్కడ విశ్వేశ్వర్ వుండడంచూచి ఆశ్చర్యపోయారు. విశ్వేశ్వర్ ముఖం వాడిపోయివుంది. వచ్చిన డాక్టర్, యిన్‌స్పెక్టర్లతో యింట్లోని శవం దగ్గరకు పోయాడు విశ్వేశ్వర్. డాక్టర్ మృతదేహాన్ని పరీక్ష చేశాడు. ప్రక్కనే నిలబడి సతివైపు పరీక్షగా చూస్తున్నాడు విశ్వేశ్వర్. గాఢనిద్రలో మునిగి ప్రశాంతంగావున్న సతిముఖం, ఈగ్రసిగ్గుల తాకిడికి నల్లబడిపోయిందా అన్నట్లగుపించింది విశ్వే శ్వర్‌కి. తన అభిమానాన్ని కాపాడి తనదగ్గరకు పిలవమని భగవం తుని ప్రార్థిస్తున్నదా అన్నట్లు అగుపించింది సతి విశ్వేశ్వర్ కంటికి. ఈ దృశ్యాన్ని చూడలేక ప్రక్కకు ముఖం త్రిప్పుకున్నాడు విశ్వేశ్వర్.

అన్నపూర్ణ విశ్వేశ్వర్ దగ్గరకొచ్చి మెల్లగా అతని చెవిలో ఏమేమో చెప్పుకుపోతూవుంది. అన్నిటికీ వూకొడుతూ పోతున్నాడు విశ్వేశ్వర్. ఇంతలో డాక్టర్, "విశ్వేశ్వర్ బాబూ!" అని పిలిచాడు. డాక్టరుదగ్గరకెళ్ళాడు విశ్వేశ్వర్. ప్రక్కనే యిన్‌స్పెక్టరుకూడా నిలబడ్డాడు.

"విశ్వేశ్వర్ బాబూ యిది ఆత్మహత్య అని రుజువయింది. ఇక శవాన్ని ఆస్పత్రికి తీసుకుపోయి పరీక్షచేయడమే మా కర్తవ్యము." అని విశ్వేశ్వర్ మనస్సు పరీక్షించాలని అన్నాడు డాక్టర్. ఇది వినేప్పటికి విశ్వేశ్వరునికి కాళ్ళుచేతులు వణక

పాగినయ్. నెమ్మదిగా ఎంతో వినయంగా అడిగాడు విశ్వేశ్వర్,
"డాక్టరుగారూ! మరేదైనా వుపాయంవుంటే ఆలోచించండి. ఇది నా ఇంటివిషయం7° మీరు భావించండి. సాధ్యమైనంత వరకు మిమ్మల్ని సంతృప్తిపరచడానికి నేనే ప్రయత్నిస్తా. ఈ ఆపద సమయంలో మీబోటివారు ఆదుకోకపోతే యింకెవ రాదుకో గల్గుతారు?"

"నాదేం అభ్యంతరంలేదు. స్వాభావిక మృత్యువనే రిపోర్టు రాయడానికి నేను సిద్ధంగానే వున్నా. మీరిక యినస్పెక్టరుగారిని ఒప్పించండి".

ఇనస్పెక్టరుగార్ని వశపరచుకోడానికి యిక ఒక్క క్షణం కూడా పట్టలేదు. కలరావచ్చి చచ్చిపోయినట్లుగా రిపోర్టు వ్రాయ బడింది. ఇనస్పెక్టరుగారు డాక్టరుగార్ని తీసుకుని తిరిగి వెళ్ళి పోయారు. తమాషా చూద్దామని ఎదురుచూస్తున్న సంకుచిత మన స్తత్వపరులకు నిరాశచెందవలసివచ్చింది. ఏమేమో గకగకాలుగా అనుకున్నారు. అక్కడే నిలబడివుంటే శవాన్ని బయటికి లేవదీయ వలసిన భారం తమమీద ఎక్కడ పడుతుందోనని కాళ్ళకు బుద్ధి చెప్పారు అక్కడనుంచి వాళ్ళంతా.

విశ్వేశ్వర్ తనవద్దనున్న ముగ్గురు బ్రాహ్మణ గుమాస్తాలను వెంటేసుకొచ్చి సతి శవందగ్గర నిలబడ్డాడు. అన్నపూర్ణ అర్థం చేసుకుంది. ఆమె జాహ్నవితో, "వదినా సతిని యిప్పుడు వాళ్ళ నాన్నదగ్గరకు పంపించివేయాలి. బ్రతికివుండంగా సతి కష్టాలను ఒక్కరోజైనా మనం ఆదుకోలేకపోయాం. అందుకనే యివ్వాళ సతి తన తండ్రివద్దకు పోతుంది. సతి యిప్పుడు తన భర్తదగ్గరకు—" అంది—

"ఆ మాటనకు పిన్నీ, ఆ మాటనకు నా సతికి పెళ్ళే కాలేదు. నేను దానికి పెళ్ళెప్పుడు చేశాను? ఆ ముసలిపీనుగు వెధవ నా కూతురుకు భర్త ఎలాగవుతాడు? పెళ్ళికాని నా కూతురు వాళ్ళ నాయనదగ్గరకు పోతుంది. ఈ తెల్లచీరె విప్ప

దీయండి. చిన్నతనంలో బజార్లో ఆడుకోడానికి కట్టుకెళ్లూవుండే ఆ నీలవన్నెచీర కట్టండి. గాజులుకూడా తొడిగించండి చేతులికి. నా కూతుర్ని యీ వెధవవేషంతో నే నెప్పటికీ పంపించలేను. అట్లా పంపిస్తే వాళ్ళ నాయన ఏమనుకుంటాడు ?''—అని పెద్దగా ఏడ్చింది జాహ్నవి.

సావిత్రి లేచి పరుగెత్తుకుంటూవచ్చి అక్క మృతదేహాన్ని కౌగిలించుకుని, "అట్లా అనకండమ్మా, అట్లా అనకండి. మా అక్క ఎక్కడి కెళ్తుంది ? ఎప్పుడూ ఎక్కడికి వెళ్ళి ఎరుగదు ? ఇవ్వాళ ఎందుకెళ్తుంది ? మమ్మల్నందర్నీ వదలిపెట్టి, ఎక్కడ కెళ్తుంది ? అక్కా......అక్కా......" అని పెడబొబ్బలుపెట్టి ఏడ్చింది.

అన్నపూర్ణ జాహ్నవివంక చూచి, "వదినా ఏమిటిదంతా ? నే చెపితే వినవా ? అయిందేదో అయిపోయింది. ఏడ్చిమాత్రం ఏం లాభం ? ఇక ఏడ్చే యీ పిల్లలముఖాలు చూచైనా వూరుకో. నువ్వే అట్లా రొమ్ములుబాదుకుంటూ ఏడిస్తే యీ చిన్నవాళ్ళ గతేంగాను ?" అని హెచ్చరించింది

జాహ్నవి లేచి కూర్చుని నెత్తిమీద చెంగు ముఖంమీదికి లాక్కుంది. సావిత్రిని ఒకవైపు నెట్టేసి సతి శవాన్ని ఒళ్ళోకి లాక్కొని సతి ముఖంవైపు పిచ్చిదానిలాగా వెర్రిగాచూచి కూతురు చల్లని బుగ్గల్ని ముద్దుపెట్టుకుంటూ పొంగి పొర్లే దుఃఖ భారాన్ని ఆపుకోలేక మరలా ఏడ్వ సాగించింది. "అమ్మా, నువ్విక పోతున్నావా ? ఇక మా కంటికి కరవై పోతున్నావా ? నాదగ్గరుండి ఏమి భోగ్య మనుభవించావ్ తల్లీ ? ఇక మీ నాయన దగ్గరకెళ్ళైనా సుఖపడమ్మా. చిన్నప్పటి సతిలాగా ఆయన ఒళ్ళో పండుకుని నిద్రపో అమ్మా. సతీ, నా ముద్దుసతీ ! ఒక్కసారి అమ్మా, అని పిలిచిపో తల్లీ ! అయ్యో ! నిన్నరాత్రేగా అమ్మా నువ్వు నా కాళ్ళుపిసుకుతూ కాళ్ళదగ్గర కూర్చుని నాకు ముచ్చట్లు చెప్పింది. ఇంతలోనే నన్ను వదలిపోతావని అనుకోలేదే తల్లీ. ఈ సంగతి తెలిసుంటే, "అమ్మా" అని నీచేత పిలిపించుకొని విని

వుండేదాన్ని. మమ్మల్నందర్నీ ఏంచేసి పోతున్నావ్ ? అందర్నీ ఒంటరిగాచేసి పోతున్నావా తల్లీ ? నీ ముఖం యిక మాకు కనిపించకుండా దాచుకుంటున్నావా తల్లీ ? పో......అమ్మా......పో నాయనా, విశ్వేశ్వర్ యిదిగో నాయనా, నా సతిని తీసుకెళ్ళు" అంటూ జాహ్నవి తన కూతుర్ని విశ్వేశ్వర్ చేతుల్లో పెట్టింది, అతని పాదాలకు తన సతిని అర్పించిందా అన్నట్లు. ఆమె మృత దేహాన్ని విశ్వేశ్వర్ తన ముగ్గురు గుమాస్తాల సహాయంతో పైకి లేపి భుజాలమీద వేసుకున్నాడు. సావిత్రి పరుగులుతీసుకుంటూ పిచ్చిదానిలాగా కేకలువేసుకుంటూ వచ్చి వాళ్ళ కాళ్ళమీద పడింది, "అన్యాయ్ బావా అన్యాయ్! నీ కాళ్ళు పట్టుకుంటూ మా అక్కయ్యను తీసుకెళ్ళవద్దు. ఇక్కడే వదలిపెట్టండి. మీకు దయలేదా ? మా అక్కయ్యను మాకు యిచ్చేయండి వదలిపెట్టండి......వదలిపెట్టండి" అని ఏడ్చింది బిగ్గరగా.

విశ్వేశ్వర్ దుఃఖభారాన్ని భరించలేక పెద్దగా అరిచాడు "పిన్నీ ?" అని. అన్నపూర్ణ వచ్చి బలవంతాన సావిత్రిని లాక్కుపోయి జాహ్నవిముందు పెట్టింది. జాహ్నవి సావిత్రిని రొమ్ముకానించుకుని, "సావిత్రీ, సావిత్రీ, యింకెక్కడి అక్క ? మనల్నందర్నీ అన్యాయంచేసి తనదారిని పోయింది" అని బిగ్గరగా ఏడ్చింది.

"అమ్మా! అక్కయ్యా! అక్కయ్యా! అక్కయ్యెక్కడికెళ్ళింది ?" అంటూ ఏడ్పు ఆపుకోలేకపోయింది సావిత్రి.

కాళీశంకర్ శవం వెంబడి పోయాడు. కాష్ఠంమీద పెట్టిన అక్కశవం దహనసంస్కారానికై నిప్పు అంటించాడు. నిప్పు అంటిస్తూంటే కాళీకి కళ్ళు కన్నీటితో నిండిపోయినయి. వెక్కివెక్కి ఏడ్చాడు. రామ్‌తను కాళీశంకర్‌ను ప్రక్కకు దూరంగా తీసుకెళ్ళి ఎన్నోవిధాల ఏడవవద్దని ధైర్యం చెప్పాడు. ఒక చెట్టు చాటున కూర్చుని కాటివంక చూస్తున్నాడు విశ్వేశ్వర్.—సతి వక్షస్థలాన్నుండి వేడి అగ్నిజ్వాలలు సుయ్ సుయ్‌మంటూ దూసుకుని పైకి లేచిపోతున్నయి.

# 14

సతి చనిపోయిన నాల్గోరోజున జరుపవలసిన కర్మకాండ అంతా నల్గురు పెద్దలూ కలిసి కాశీచేత చేయించారు. సతిలేని లోటు వల్ల కళావిహీనమైన ఆ యిల్లు బిక్కుబిక్కుమంటూ వుంది. తన యింట్లో నాల్గురోజులు వుండిపోదువు రమ్మనమని జాహ్నవిని అన్నపూర్ణ చేతులు గడ్డం పట్టుకుని ఎంతగానో బ్రతిమిలాడింది. కాని రానంటే రానని పట్టుపట్టింది జాహ్నవి. అన్నపూర్ణ మరిమరీ బ్రతిమిలాడింది. "నేను రాలేనపిన్ని. నన్ను ఇక్కడే వుండనివ్వు. ఇక్కడే వారు చనిపోయారు. నా సతి కూడా ఇక్కడే చనిపోయింది. ప్రతిరోజూ సతి ఆత్మ యిక్కడకొచ్చి "అమ్మా, అమ్మా!" అని నాకోసం విలపిస్తుంది. ఇక ఎంతమాత్రం యీ యిల్లు వదలిపెట్టి ఎక్కడికీ రాలేను" అంది దీనంగా. చేసేదిలేక అన్నపూర్ణ అనేక సార్లు రాత్రిపూటవచ్చి జాహ్నవికి తోడుగా పండుకుంది. కాయకూరలమ్ముకొచ్చే గౌరి కూడా రేయింబవళ్ళు జాహ్నవి దగ్గరే కూర్చునేది ఆమెకు ధైర్యం చెపుతూ.

సతి చనిపోయిం దగ్గరనుంచి విశ్వేశ్వర్ పిచ్చివాడిలా తయారయ్యాడు. ఆ దారుణ దుర్ఘటన జరిగినదగ్గరనుండి అతని మనస్సు చలించిపోయింది. ఒకరోజు నదియొడ్డుకు చల్లగాలికై పోయాడు. సాయం సమయం సూర్యుడు పగలంతా ప్రయాణంచేసి పశ్చిమాన చింతతోపు వెనుకగా అస్తమించబోతున్నాడు. చింతతోపంతా ఎర్రబారింది. చింతచిగుళ్ళు ఎర్రని సూర్యకాంతులలో మెలసి పోతూ గాలికి కదులుతూ కులుకుతున్నాయి. కాని, పాపం విశ్వేశ్వర్‌కు సూర్యుడస్తమించబోతున్నాడన్న విషయమే తెలిసినట్లు లేదు. సతి పోయినప్పటినుంచి అతనలా మతిభ్రమ చెందినవాడిలా తయారయ్యాడు. దూరంగావున్న శ్మశానంవైపు దీక్షగా చూచాడు. కాటిపై పరుండిన సతి వక్షస్థలాన్నుండి వేడి అగ్నిజ్వాలలు బుసలు కొట్టుతూ పైకి లేచివచ్చి నిష్ఠుర ప్రపంచాన్ని మ్రింగడానికి కోరలు

చాచుతున్నవో అన్నట్లు అతని స్మరణకొచ్చింది. ఈ ప్రపంచంలో గల కుట్ర, ద్వేషం, స్వార్థం మోసాలకు దూరంగా వుందామని ఈ ప్రపంచాన్నే వదలిపోయిన సతిరూపం ఏ చిత్రకారుని కుంచకూ అందని ఈ సంధ్యాదేవి సౌందర్యంలో ప్రతిబింబించిందా అన్నట్లు అతనికి కన్ను చెదిరి కన్పించినట్లయింది. అక్కడ అట్టే సేపు నిలబడాలంటే భయమేసింది విశ్వేశ్వర్‌కు. వెంటనే ఇంటికి తిరుగుముఖం పట్టాడు. శోభాయమానంగా వున్న ప్రకృతిని ప్రేమించి తన్మయత్వంజెందే ఆతనిహృదయం మూగబోయినట్లయింది. మృదుమధురసంగీతధ్వనులుకూడా అతనికి కర్ణకఠోరంగా తోస్తున్నయ్. అతనికి అన్నంకూడా రుచితప్పింది. అప్పుడప్పుడూ ఏదో దీర్ఘాలోచనల్లో మునిగిపోతూ వుంటాడు. అప్రయత్నంగానే అతని నేత్రాలనుండి వెచ్చటి వేడికన్నీటిబొట్లు రాలుతూవుంటయ్ అప్పుడప్పుడూ.

"ఈ ప్రపంచంలో ప్రేమేలేదా? సతివంటి స్త్రీలని, యితరుల పాదపద్మాలకు తమ అమూల్యమైన ఆత్మను అర్పించి నిస్సంకోచంగా ప్రాణత్యాగంచేసే స్త్రీలనిగురించి ఈ మానవజాతి ఏనాడైనా ఆలోచించగలిందా? సతి ఈవిధంగా చేయగలుతుందని నేనుమాత్రం అనుకోగలిగానా? నాకొక నమస్కార బాణంవదలి తనదారిని నిర్భయంగా వెళ్ళిపోయింది. ఆమె కోరిక సిద్ధించిందా? ఆ కరుణారసపూరితఘట్టం నా హృదయాన్ని చలింపచేసి చీల్చివేస్తూవుంది. ఇదే నా ప్రేమ? సుశీల, ధైర్యశాలిని, సుందరి, నిద్రాహారాలుమాని కష్టాల నెదుర్కొని, చింతించి కుత్సిత మానవజాతి సంకుచిత మన స్తత్వానికి విసిగి అసహ్యించుకుని తోటి ప్రాణికోటికి సైతం తెలియనీయక ఈవిధంగా ప్రాణత్యాగం చేయడం వింటే ఎవరిహృదయాలు కంపించి ద్రవించవు? ఇది తలుచుకుంటేనే చాలు నా హృదయం కరిగి నీరైపోతూంది. పుస్తకాల్లో యిటువంటి ఘట్టాలు చదివినప్పుడల్లా హృదయం దుఃఖంతో నిండి బరువెక్కిపోతుంది. ఇట్టి వాస్తవిక కరుణారసపూరిత ఘట్టాలు జరిగిపోవడం కళ్ళారాచూచి దుఃఖాన్ని పొందని నిర్దయ మానవుడెవడుంటాడు?

శిలలను సైతం కరిగించగల కరుణారసభరిత ఘట్టంయిది. ఇదే నా ప్రేమమయ ప్రపంచం? ఈ ప్రపంచంలో ప్రేమ నేదేలేదా?'' అని ఏమేమో భావతరంగాలు అతని హృదయంలో లేవజొచ్చినయ్. అడుగులో అడుగేసుకుంటూ నెమ్మదిగా నడుస్తున్నాడు ఇంటివైపుకు. కొంచెం దూరంవచ్చినతరువాత కూలిపోయిన భట్టాచార్య ఇల్లు పిండారబోసినట్టున్న తెల్లని వెన్నెలరాత్రిలో ఎవరో వితంతువు తెల్లని చీరధరించి నిలబడివున్నదా అన్నట్లు కనిపించింది. ఇంటి ముందుకువెళ్ళి నిలబడ్డాడు. తులసిచెట్టువద్ద దీపారాధనచేసి మోకాళ్ళువంచి నమస్కరిస్తూ ఎవరో స్త్రీ పూజచేయడం చూచాడు. అంతా సతిలాగానే వుంది చూట్టానికి తైలసంస్కారంతేకుండా విరగబోసుకున్న జుట్టు, సన్నగావున్న ఆదేహం, చినిగిన బట్టలు, విచారరేఖలు పొడచూపిన ఆ పాలిపోయినముఖం ముమ్మాటికీ గులా సతినే జ్ఞప్తికి తెస్తున్నయ్. అలాగే చూస్తూ నోరు మెదల్చకుండా నిలబడిపోయాడు. ఆ స్త్రీ పూజ పూర్తిచేసి వెనుదిరిగి చూచి, ''ఎవరూ?'' అని ప్రశ్నించింది. 'సతి' కాదు 'సావిత్రి' అని గుర్తుపట్టకలిగాడు విశ్వేశ్వర్.

''నేను విశ్వేశ్వర్ను''

''ఓ, నువ్వా? అన్నాయ్! ఈవేళప్పుడు ఇక్కడికెలా వచ్చావ్?''

''నీతో పనుండే వచ్చాను'' అన్నాడు. సావిత్రి మారు మాట్లాడక నిలబడిపోయింది.

''మీ అక్క మీకేమైనా ఇచ్చిపోయిందా?'' అని ప్రశ్నించాడు విశ్వేశ్వర్.

''ఆఁ ... ఎక్కడో దొరకనివని రూపాయలనోట్లు చాల యిచ్చిపోయింది.''

''అందులోనుండి ఏమైనా ఖర్చు చేశారా?''

''ఇచ్చినయ్ ఇచ్చినట్లుగానే భద్రంగా దాచిపెట్టాను'' అంది సావిత్రి.

"అవన్నీ తీసుకొచ్చి నాకివ్వు".

సావిత్రి యింట్లోకెళ్ళి రూపాయలనోట్లకట్ట తీసుకొచ్చి విశ్వేశ్వరుడి కందించింది. వాటిని తాకీ తాకడంతోటే విశ్వేశ్వరుడి గుండె దడదడలాడింది..

"మీ అమ్మకు ఈ రూపాయల సంగతి తెలుసా ?"

"ఇంతవరకూ తెలియనే తెలియదు. ఇక నేనే చెపుదా మనుకుంటున్నా ఆమెకు."

"మంచిపని చేశావ్. ఇక ఈవిషయం అమ్మతో చెప్పొద్దు. ఎవరిదగ్గర్నుండి మీ అక్క ఈ రూపాయలు తీసుకుందో వారికే ఈరూపాయలు తీసుకెళ్ళి యిచ్చివస్తా". సావిత్రి అంగీకార సూచకంగా తలూపి మౌనంగా నిలబడింది.

"మీ అమ్మ ఎక్కడికిపోయింది? కాళీ ఎక్కడకు పోయాడు?"

"మా అమ్మ యింట్లో కాళీని నిద్రపుచ్చుతుంది. వాడు రోజూ అక్కా...అక్కా...అని అక్కయ్యని తలుచుకుని ఏడుస్తున్నాడు. వాడు ఎవరు చెప్పినా వినడంలేదు."

"మాపిన్ని మొన్న నాతో అంది. నువ్వూ మీ అక్కయ్య కోసం దిగులుపడి నిద్రాహారాలుమాని రోజూ ఏడుస్తున్నావని. ఎందుకు ఏడవడం? మీకొచ్చిన ఆ. దేమీలేదు. దిగులుపడి మీరు చేసేదేముంది? ధైర్యంగావుండు. అన్నిటికీ భగవంతుడే వున్నాడు. ఎట్లా జరగాలో అట్లాగే జరిగిపోతుందంతా కూడా" ఇది విసేసరికి రెండు తెల్లని వేడికన్నీటిబొట్లు సావిత్రి నేత్రాలనుండి రాలి పడినయి.

"మా అక్కయ్యను వదలిపెట్టి నే నెప్పుడూ ఒంటరిగా వుండలేదు. మా అక్కయ్య మమ్మల్నందర్నీ అన్యాయంచేసి ఒంటరిగా వదలిపెట్టి వెళ్ళిపోయింది మా అక్కయ్య యిక మమ్మల్ని మరచిపోయింది." అని వెక్కి వెక్కి ఏడుస్తూ అంది సావిత్రి.

"దాని నెవరూ తప్పించలేరు. అది తప్పనిసరిగా జరిగి తీర వలసిన విధినియమం" అన్నాడు విశ్వేశ్వర్.

"అక్కయ్య స్నేహితురాలు కమలకూడా వచ్చింది. అక్కయ్య చచ్చిపోయిందన్న సంగతివిని చాల దుఃఖించింది. అక్కయ్యంటే కమలకు పంచప్రాణాలు. అక్కయ్యనుగురించే కమలకూడా దిగులేసుకుంది. మనిషి సగమైపోయింది. కమలకూడా యిక యెక్కువరోజులు జీవించలేదు" అంది సావిత్రి.

"ఎవరూ వచ్చింది? నరేంద్రుని భార్య కమలేనా? అవును పాపం! ఆ సంగతికూడా నే విన్నాను".

"భర్తకూడా సరిగా చూడడంలేదట. నానా బాధలుపెట్టి హింసిస్తున్నాడట".

ఇక ఎక్కువసేపు అక్కడ నిలబడకుండా యింటికి తిరిగి పోయాడు విశ్వేశ్వర్.

రెండోరోజు సూర్యోదయం కాకముందే చాంద్‌పూర్‌కి ప్రయాణం కట్టాడు విశ్వేశ్వర్. ప్రొద్దున్నే నరేంద్రుని ఒంటరిగా కలుసుకోవాలని నిశ్చయించుకున్నాడు. చాంద్‌పూర్ గ్రామం బయటి పొలిమేరలలోకి చేరగానే హృదయంలేని పాషాణాలతో నిర్మింపబడిన జమీందార్‌గారి ప్రాసాదం కన్పించింది. తలవంచుకుని సింహద్వారంవద్దకు చేరాడు విశ్వేశ్వర్. బయటి వుద్యానవనంలో ఏకాంతంగా వాయుసేవనచేస్తూ జమీందార్ నరేంద్రనాథ్ విచారంగా వున్నాడు. అతనికి ఎదురుగాపోయి నిలబడ్డాడు విశ్వేశ్వర్.

"ఎవరు, మీరు?" ఆశ్చర్యంగా అడిగాడు నరేంద్రనాథ్.

"నన్ను విశ్వేశ్వర్ అంటారు. యిక్కడికి సమీపానగల మజహత్‌పూర్ మా స్వగ్రామం".

"మీరేం పనిమీద వచ్చారు?"

"మీతో గొప్ప పనుండే వచ్చాను" అంటూ జేబునుండి రూపాయలకట్టతీసి నరేంద్రునిచేతిలో పెట్టుతూ, "ఇవి మీరిచ్చిన

రూపాయలే లెక్క పెట్టి చూచుకోండి, నిండా వెయ్యిరూపాయలు" అన్నాడు.

నరేంద్రుడు స్తబ్ధుడై, "ఎవరిచ్చారివి మీకు" అని ప్రశ్నించాడు.

"మీ రెవరికిచ్చారో వారే. ఆమె నా బంధువు" అని జవాబిచ్చాడు విశ్వేశ్వర్.

"ఆమే యిచ్చిందా యివి? ఆమె చనిపోయిందని విన్నానే!"

"ఆమె చనిపోలేదు. ఆత్మహత్య చేసుకుంది".

"అవునవును గాలివార్తగా అదికూడా విన్నాను. అయితే ఆత్మహత్య చేసుకోడానికి కారణమేమైవుంటుందో మీ కేమైనా తెలుసా?"

"తెలీకేం? మీ చేతులోనున్న ఆ రూపాయలకట్టే దానికి కారణం. పరిసితుల వత్తిడికి తట్టుకోలేక వీటిని తీసుకోవలసి వచ్చింది. అందువల్ల నే తన చేతులతో తన ప్రాణాలు తీసుకుని మీ బారినుండి తప్పించుకోగల్గింది".

"అయితే, మహాశయా! మీకీ విషయం సంపూర్ణంగా తెలిసేవుంటుందని నే ననుకుంటున్నా. ఇక మీవద్ద దాపరికం వుంచను. మీరు వ్యర్ధంగా నామీద కళంకాన్ని మోపుతున్నారు. ఆమె ఆ రూపాయలే తీసుకోకపోతే అందుకు నా వత్తిడిమాత్రం ఏముండేది? నేనేమీ బలవంతం చేయలేదు. అత్యాచారం చేయలేదు. ఆమె తన యిష్టపూర్తిగానే—"

"నోరుముయ్ పాపీ! మాట్లాడానికి నోరెట్లా వచ్చింది? రేయింబవళ్ళూ అంతఃపురంలో వేశ్యాలోలుడవైన నీ కంటికి పరాయి స్త్రీలుకూడా వేశ్యల్లాగానే కనిపించారు కాబోలు. నువ్వూ గౌరవ కుటుంబంలోనే పుట్టావే! గౌరవ కుటుంబంలో పుట్టి పెరిగిన స్త్రీలు ఏనాడైనా యిట్టి అవినీతివృత్తికి దిగజారినట్లు చూడగలిగావా? తల్లిని, తమ్ముణ్ణి, చెల్లెల్ని కష్టాలనుండి

రక్షించి వారి అభిమానాన్ని రక్షించవలిచే ఆ సాధ్వి నీ దగ్గరనుండి ఈ రూపాయలు గ్రహించగలిగింది. కాని వేశ్యావృత్తిని స్వీకరించి మాత్రంకాదు. అందుకనే యీ నీచవృత్తిని అసహ్యించుకొని యీ లోకాన్ని విడిచిపెట్టి వెళ్ళిపోయింది. కాని నరేంద్రనాథ్ జ్ఞప్తి వుంచుకో, వేశ్యాలోలుడవైన నీవు ఆబల, సచ్చరిత్ర, సాధ్విపవిత్ర హిందూనారి ప్రాణాలు బలిగొన్నపాపం చుట్టుకుంది. నీకీ జన్మలో యిక సుఖశాంతులు లభించవు. ఆమె ఆత్మ నీ చుట్టూ తిరుగుతూ వుంటుంది. నిన్ను అధఃపతితుణ్ణిచేసి నరకకూపానికి లాక్కుపోతుంది. నరాంతకుడవై మానవహత్య చేశావు. ఆ ఆత్మహత్యా ప్రేతం నీ వెన్నంటి తిరుగుతూవుంటుంది".

అంతా మౌనంగా వింటూ కూర్చున్నాడు నరేంద్రనాథ్. శరీరమంతా ముచ్చెమటలుపోసి తడిసిపోతూంది. పిరికిపందలాగా నలువైపులా తలెత్తిచూచి గడగడ వణకిపోతున్నాడు భయంచేత.

మరలా విశ్వేశ్వర్ ప్రశ్నించాడు, "హరిశంకర్ మీవద్దనే, మీ అడుగులకు మడుగులొత్తుతూ తిరుగుతున్నాడని తెలిసింది అతన్ని కాస్త పిలిపిస్తారా?"

నిర్జీవ ప్రతిమలాగా మారుమాట్లాడలేకపోతున్నాడు నరేంద్రనాథ్. లోపల్నుండి హరిని పిలిపించాడు. మొన్ననే సతి విషయం ఒకనిద్వారా హరికి తెలిసింది. భయపడుతూ, భయపడుతూ విచారంగా ముందుకొచ్చి నిలబడ్డాడు హరి.

విశ్వేశ్వర్ హరివైపు వేలెత్తి చూపుతూ నరేంద్రుని ప్రశ్నించాడు, "ఇతడేకదూ ఆడవేషాలువేసి మీ నాటకమండలిలో తైతక్కలాడుతూ వుండేది? ఇతణ్ణి తలుచుకుని ఇతని తల్లి, చెల్లెలు తమ్ముడూ బెంగపెట్టుకున్నారు. ఇతనికొరకై వాళ్ళు ఏడవని రోజు లేదు. మీరిక ఇతనిని వారి క్షేమంకోరైనాసరే వదలవలసి యుంటుంది. మీ రితన్ని వదలకపోతే వారికడుపులో రగిలే దుఃఖాగ్నిని బయటికి మోసుకునివచ్చే వెచ్చటి వేడికన్నీటిధారలు నిన్ను

సర్వ నాశనం చేసేస్తాయి. ఇక నీ ఇష్టం. ఇవ్వాళే ఇతన్ని ఇంటికి పంపించివేయాలి నువ్వు."

"మీరే ఇతన్ని వెంటబెట్టుకుని తీసుకువెళ్ళండి. నాటక మండలివలన నాకు అపరిమితనష్టమే కల్గింది కాని దానివల్ల కాసంత లాభమైనా నేను పొందలేదు. మహాశయా! నేను మీరనుకున్నంత నీచుణ్ణికాదు."

"అది నాకు తెలుసు. నీ భార్య కమలని, సతిని నేను స్వంత చెల్లెళ్ళలాగా చూచుకుంటూ వచ్చాను. నీ కూటనీతి, కుప్రవృత్తి వల్ల నీ భార్య పతివ్రతా శిరోమణి మరణాసన్నమై పడివుందిప్పుడు. ఆమెకూడా ఏదో ఒకరోజు ఆత్మహత్యచేసుకుని శలభంలాగా నీ సంకుచిత బుద్ధికి బలైపోతుంది. నీ జీవితనావ మునిగిపోవడానికి యిక అట్టే ఎక్కువకాలం పట్టదు."

నోరుపలకకుండా తలవంచుకుని కూర్చున్నాడు నరేంద్రనాథ్. విశ్వేశ్వర్ హరివంక చూచి, "నువ్విప్పుడే నావెంట ఇంటికి రావడానికి సిద్ధంగా వుండాలి" అన్నాడు.

దీనతాపూరిత నేత్రాల్తో నరేంద్రునివైపు చూస్తూ హరి అన్నాడు, "నరేంద్రబాబూ నాకు తమరు—"

మాట మధ్యలోనే ఆపి నరేంద్రుడు భగ్గున మండిపడుతూ "ఆ...నువ్విక వెళ్ళవచ్చు. మీరంతాకలసి నాతల కొట్టుకుపోయేట్లు సర్వనాశనం చేసేశారు. నేనిక నాటకమండలి ఎత్తేస్తా. నాదగ్గర్నుండి మీరిక శలవు తీసుకోవచ్చు" అన్నాడు.

అవమానంచేత హరిముఖం ఎర్రబారిపోయింది. వెంటనే బయటికొచ్చేశాడు హరి. తనుకూడా బయటికి రావడానికై పైకి లేచి రాబోతూ విశ్వేశ్వర్ నరేంద్రబాబుతో, "నరేంద్రబాబూ యిక నే వెళ్ళొస్తా. చెప్పదలచుకుంది చెప్పేశాను. అంతకంటె

ఇంకా ఏమీ చెప్పదలచలేదు. ఏ సతినైతే నువ్వు సర్వనాశనం చేసి వదలిపెట్టావో ఆ సతికి ప్రేమపాత్రురాలైన ప్రియసఖి కమల. చేసిన అపరాధానికి సతిని మీరు క్షమాపణ కోరుకోదలచుకుంటే ఆమె ప్రాణసమానురాలైన స్నేహితురాలు కమల ప్రాణాల్ని రక్షించి సుఖపెట్టండి" అని హెచ్చరికచేసి బయటికి చకచకా నడిచిపోయాడు.

# 15

ఇల్లు కట్టిచూడు పెళ్ళిచేసిచూడు అంటారు మనవాళ్ళు సామెతగా. ఇవి రెండూ సామాన్యమైన పనులుకాదు. మానవకృషితో పాటు దైవకృపకూడా వుంటేనేగాని సాఫల్యం పొందని పనులు ఇవి రెండూను. ఉత్సాహంతో కార్యారంభం జరిపినా పరిస్థితుల వ్యతిరేకతవల్ల మధ్యలోనే తలపెట్టిన కార్యాన్ని ఆపివేయవలసి వస్తుంది ఒక్కొక్కప్పుడు. తలవనితలంపుగావచ్చిపడే ఈ విఘ్నాలన్నీ ఎదుర్కొని గట్టిగానిలబడి ధైర్యోత్సాహాలతో పనిచేసినప్పుడే విజయలక్ష్మిని మనం చేపట్టగలుగుతాం.

విశ్వేశ్వరుని పుణ్యమా అంటూ కూలిపోయిన భట్టాచార్య ఇంటికి మంచిరోజులువచ్చినయి. ఇంటి మరమ్మత్తు అంతా పూర్తయి పోయింది. అనుకున్నదంతా మూడురోజుల్లో అయిపోవాలన్న నిశ్చయానికివచ్చాడు విశ్వేశ్వర్. పనివాళ్ళనందర్నీ పిలిపించి పనులన్నీ వెంటవెంటనే కావాలని ఆజ్ఞాపించాడు. ఎన్నాళ్ళనాడో కట్టబడిన ఈ ఇంటికి నేటికి శుభగడియలు దొర్లుకువచ్చినయ్. ఇంటి మరమ్మత్తు మొదలుపెట్టినప్పటినుంచీ చివరిదాకా విశ్వేశ్వర్ భట్టాచార్యగారింటికి తరచుగా వస్తూపోతూ సమస్తపనులూ చేసిపెట్టాడు. దగ్గరుండి రాయి పట్టించుకురావడం, గోడలుకట్టేటప్పుడు దగ్గరుండి తనిఖీచెయ్యడం మొదలైన పనులన్నీ చాల జాగ్రత్తగా చూచేవాడు.

గోడలన్నీ శుభ్రంచేయబడి తెల్లని సున్నంకూడా కొట్టబడినయ్. నిజం చెప్పాలంటే విశ్వేశ్వరునిచేత డబ్బు ఖర్చుపెట్టించి తన ఇల్లు మరమ్మత్తు చేయించుకోవడం జాహ్నవి కేమాత్రం ఇష్టంలేదు. కాని అన్నపూర్ణ ప్రోద్బలంవల్ల జాహ్నవి కిక్కురుమనకుండా వుండవలసి వచ్చింది.

భట్టాచార్యగారింటి పనుల్లో పట్టుదలతో విశ్వేశ్వర్ శ్రద్ధాసక్తులు చూపడంవల్ల వూళ్ళోవాళ్ళకి కన్ను కుట్టకపోలేదు. భట్టా

చార్య గారి పాతయిల్లు క్రొత్తదై పోయింది. వాళ్ళకి రోజులుకూడా బాగానే గడవసాగినయ్. హరిశంకర్ కూడా ఇప్పుడు సరైన దారికివచ్చి ఇంటిపనుల్లో జోక్యం కలుగజేసుకోసాగాడు. వూళ్ళో పుట్టుకొస్తున్న అపవాదులన్నింటిని జాహ్నవి కళ్ళుమూసుకుని దిగ మ్రింగవలసివచ్చింది. సతి చావునుగురించి యిద్దరు ముగ్గురు చేరిన ప్రతిచోటా చర్చలు జరుగుతూవుండేవి. సావిత్రినిగురించికూడా అభూత కల్పనలు లేవసాగినయ్.

"విశ్వేశ్వర్ గాడే భట్టాచార్య అల్లుడు కావచ్చు. అందుకనే యింత ఖర్చుపెట్టి కష్టపడి యిల్లు మరమ్మత్తు చేయించాడు" అని ఒకడంటే "అవును రా, మేళతాళాల ఖర్చులేకుండా, పొరుగింటి వాడికి కూడా తెలియకుండా గప్‌చిప్‌గా ముడేసుకోవడంలోనే వుందిరా మజా" అని రెండోవాడనేవాడు వికటంగా నవ్వుతూ. వీళ్ళ ఆటలు కట్టడానికి ఒక్కరోజుకూడా పట్టలేదు. సావిత్రికి తగినసంబంధం విశ్వేశ్వర్ కుదర్చగలిగాడని ఈ జ్యేష్టమాసంలోనే పెళ్ళి నిశ్చయమైందని తెలియగానే వాళ్ళ ఆశలన్నీ బూడిదపాలైనాయి. అంతా నోరుమూసుకుని కూర్చోవలసి వచ్చింది.

సావిత్రి పెళ్ళినిగురించి అన్నపూర్ణ ఎక్కువ శ్రద్ధా భక్తులతో పనిచేసింది. సావిత్రి దుఃఖాన్ని చూడలేక, "నాయనా విశూ! పిల్ల పదిహేనేళ్ళ దయింది. ఇక జాగుచేస్తే బాగుండదు. ఎక్కడైనా వెదకి తీసుకురా దానికి తగినవాణ్ణి" అని విశ్వేశ్వరుని రోజూ హెచ్చరిస్తూ వుండేది.

తన స్వయంకృషివల్లగాని దైవసహాయంవల్లగాని తగిన వరుణ్ణి సంపాదించగలిగాడు విశ్వేశ్వర్. కొద్దిగొప్పో చదువుకున్నాడు కూడా. మొత్తానికి మంచి సంప్రదాయంలోవాడే. తల్లిలేదు. తండ్రిమాత్రమే వున్నాడు. ఈ సంబంధాన్నిగురించి విశ్వేశ్వర్ అన్నపూర్ణకు చెప్పగానే ఆమె సంతోషంతో వుప్పొంగిపోయింది.

"ఇక జాగుచేస్తే లాభంలేదు. ఈ మాసంలోనే ముడిపెట్టెయ్యాలి" అని పట్టుపట్టింది. వారంరోజులు గడువుపెట్టుకుని లగ్నం నిశ్చయించుకున్నారు.

తోడులేనివానికి దైవమే తోడైనట్టుగా అండ దండలులేని భట్టాచార్య కుటుంబానికి విశ్వేశ్వర్ అన్నపూర్ణ లే అండగా నిలబడ్డారు. రోజులు ఒకదాని వెంబటి మరొకటి దొర్లుకుపోతున్నయ్. భట్టాచార్యగారింటి పెళ్ళిపనుల్లో నడుం బిగించి కార్యరంగంలోకి దూకాడు విశ్వేశ్వర్.

ఇతరసమయాల్లో మిన్నువిరిగి మీదపడుతున్నా చలించని విశ్వేశ్వర్ ఈనాడు స్వయానా నడుంకట్టుకుని పెండ్లికివస్తున్న పెద్దల బృందానికి విడిదికోసం ఎన్నెన్నో ఏర్పాట్లు చేయిస్తున్నాడు. సమ స్తబలగంతో రెండువందలదాకా వస్తామని రాశాడు పెండ్లి కొడుకు తండ్రి. రానీలే అనుకున్నాడు విశ్వేశ్వర్. తనకుమాత్రం తక్కువేముంది? తన చంద్రికావనంతోటలోని భవనం ఖాళీగానే వుందాయె! దానికితోడు ప్రక్కింటి యిరుగుపొరుగువారికి నలుగురికి ఇదివరకే చెప్పివుంచాడు తగిన ఏర్పాట్లు చేయవలసివస్తుందని. తిండికి గింజా గిట్రా యిక తనదగ్గర గాదెల్లోకొట్లలో ఎప్పుడూ తరుగులేకుండా పడేవుంటాయిగా! గ్రామంలో అతనిమాట కిక తిరుగులేదు. కాకితో కబురుచేస్తే కోటిమందిదాకా పలుకుతారు పెళ్ళిపెత్తనం చేయడానికి.

చంద్రికావనంలోని భవంతిచుట్టూవున్న మూడెకరాలలోను చెత్తా చెదారం తీయించి అద్దంలాగా తయారుచేయించాడు. భవంతి తలుపులూ ద్వారబంధాలకూ రంగులు పూయించాడు. ప్రహారీగోడ నుంచి గుమ్మందాకా దారి కిరుప్రక్కలా ఇటుకలు పాతించి సున్నం కొట్టించాడు. వచ్చిన పెళ్ళివారికి ఎట్టి యిబ్బందులూ కలుగకుండా చూడగలందులకు పదిమంది దిట్టమైన పనివాళ్ళను కూడా నియమించాడు.

భట్టాచార్యగారింటిముందు వచ్చే పెళ్ళిపెద్దలకు పెద్ద పందిరి వేయబడివుంది. పెండ్లికి వంటపని భారమంతా స్వయంగా చూచుకుంటూవుంది అన్నపూర్ణ. జాహ్నవి కళ్ళప్పగించి చేసేపనంతా చూస్తూ కూర్చుంది. అన్నపూర్ణ ఏదైనా పని అందుకోమని చెప్పితే అప్పుడప్పుడూ అందుకుంటుంది. రోజుకి రోజూ కన్నీరు కారుస్తూ తులసిచెట్టుదగ్గర అలికి ముగ్గేసి దీపారాధన, పూజచేస్తుంటుంది సావిత్రి. తులసిపూజవల్ల అక్క ఆత్మకు శాంతికలుగుతుందని ఆమె నమ్మకం. పెళ్ళిరోజు దగ్గరకొచ్చి పనులు ఎక్కువవడంవల్ల రేయింబవళ్ళూ సావిత్రికూడా అన్నపూర్ణకు చేయందిస్తూ వచ్చింది. పనిపాటలకుమాత్రం యింట్లో మనిషిలేనిలోటులేకుండా జరిగిపోయింది. ఇక పెళ్ళికి ఒక్కటంటే ఒక్కటేరోజు మిగిలివుంది.

పెళ్ళికి ఒకరోజు ముందుగా అన్నపూర్ణ సావిత్రిని తన యింటికి తీసుకెళ్ళి పెళ్ళికూతుర్ని చేసి పంపింది. బనారస్ పట్టుచీర, చెవులకు రాళ్ళలోలకులు కాళ్ళ పసుపు, కళ్ళ కాటుక సాక్షాత్ పెళ్ళికళ వుట్టిపడుతూవుంది సావిత్రి ముఖంమీద. అన్నింటిని కొంచెంసేపు విశ్రాంతితీసుకుని సాయంత్రానికి ఇంటికి తిరిగొచ్చింది సావిత్రి. ఇక తెల్లవారితే పెళ్ళి. ఆ రాత్రి పెళ్ళింటికివెళ్ళి నిద్రాహారాలు మాని పనిపాటలు సాగించాడు విశ్వేశ్వర్. పీపాలు కట్టించి నీళ్ళన్నీ తోలించాడు. ఇంటిముందు పెళ్ళిపెద్దలకు చేయవలసిన ఏర్పాటంతా చేయించాడు. క్షణంలో తెల్లారిపోయినట్లయింది. పనులన్నీ సక్రమంగానే జోరుగా సాగిపోతున్నయ్. సాయంత్ర మయేప్పటికి పెళ్ళివారు వచ్చేశారు మేళతాలాల్తో. పెళ్ళికొడుకును చూస్తే విశ్వేశ్వర్‌కు సంతృప్తికలిగింది కాని అతని తండ్రి పేరాశస్వార్థపరత్వం చూస్తే అతనికి చాల దుఃఖమేసేది. వచ్చిన పెళ్ళివారందర్నీ విడిదింటిదగ్గర కూర్చోబెట్టి వారి గౌరవ మర్యాదలకు కావలసిన ఏర్పాట్లన్నీ లోటుపాటులు లేకుండా చూడగలిగాడు విశ్వేశ్వర్.

# 16

సాయంత్రానికి భట్టాచార్యగారిల్లు జనంతో కిటకిటలాడి పోయింది. ఎటుచూచినా పెళ్ళిసందడే. వూళ్ళో అందరికీ భోజనాలు చెప్పారు. వచ్చినవాళ్ళంతా తలా ఒకపని అందుకుంటున్నారు. దీపపుకాంతులో ఇల్లంతా మిలమిలమంటూ దేదీప్యమానంగా వెలుగొందుతూంది. మొదటి జాము లగ్నం బయట విశ్వేశ్వర్, యింటిలోపల అన్నపూర్ణ నడుంకట్టుకొని పెళ్ళిపెత్తనం చెలాయిస్తున్నారు.

లగ్నం వేళకి పెళ్ళికొడుకు, అతనివైపు బంధువులూ పెళ్ళిపెద్దలూ అంతావచ్చి పందిట్లో కిక్కిరిసి కూర్చున్నారు. మంగళవాయిద్యాలతో నలువైపులా కోలాహలంగావుంది. విశ్వేశ్వర్ తలంబ్రాల మండపం వెంబడే నిలబడివున్నాడు. పెండ్లిపీటలమీద పెండ్లికొడుకు కూర్చున్నాడు. పురోహితుడు విఘ్నేశ్వరపూజ చేయిస్తున్నాడు వరునిచేత. పెళ్ళికుమారునికి నాలుగు అడుగులదూరంలో అతనితండ్రి కూర్చుని ప్రక్కవానితో "చాల తక్కువ కట్నానికి ఈ సంబంధం ఒప్పుకున్నందుకు ఇప్పుడెంతో పశ్చాత్తాపంగా వుంది" అంటున్నాడు. ఈమాట విన్న ఇద్దరు ముగ్గురు ఆవూరు పెద్దలు ఆయన్ని నచ్చచెప్పటానికి ప్రయత్నించారు.

విఘ్నేశ్వరునిపూజ పూర్తయినతరువాత, "అమ్మాయిని తీసుకరండమ్మా" అని పురోహితుడు కేకవేశాడు.

"అమ్మాయిని తరువాత తీసుకరావచ్చు ముందు కట్నం సంగతి తేలనివ్వవయ్యా, బ్రాహ్మడా!" అని గర్జించి, తన ప్రక్కనే నిలబడివున్న విశ్వేశ్వరుని దగ్గరకుపిలిచి, "ఏదీ ముందు కట్నం డబ్బు ఇలా తీసుకరండి" అన్నాడు పెళ్ళికొడుకుతండ్రి.

"ఇవిగో లెక్క వేసుకోండి" అంటూ ఒక్క నిముషంలో లోపలినుండి తెప్పించి అతనిముందు పెట్టాడు రూపాయలనోట్లన్నీ విశ్వేశ్వర్.

"అయ్యో! ఇదేమిటయ్యా, అంతా కలిపి ఐదువేలేనే? మరి పిల్లకు పెట్టుకుంటున్నామన్న సొమ్ములు, పిల్లాడికిచ్చే సామాన్లు అయినా చూపించండి. అప్పటిదాకా పిల్లని పీటలమీదికి తీసుకు రావడానికి వీల్లేదు" అన్నాడు సగర్వంగా పెళ్ళికొడుకు తండ్రి.

విశ్వేశ్వరుడికి కోపంవచ్చి విసుక్కుంటూ అన్నాడు, ఏమండోయ్ మమ్మల్నింత చిన్నచూపు చూడడం ఏం మర్యాద కాదండి మీబోటివారికి. పిల్ల పీటలమీదికివచ్చి కూర్చున్నాక పిల్లతోపాటు పిల్లనగలుకూడా వస్తయ్. చదివింపులపుడు పిల్లవాడికి చెందవలసిన సామానూ వస్తుంది."

"అదేంటయ్యా, అట్లా విసుక్కుంటావ్. ఆహార వ్యవహారాల్లో మొగమాటం పనికిరాదే. ఇదంతా ఇచ్చిపుచ్చుకునే వ్యవహారం కాదటయ్యా మావూరి సాంప్రదాయం ప్రకారం అవికూడా చూపించమన్నాను. దానికింత మండిపడతావేం?

"మావూరువచ్చి మీవూరు సాంప్రదాయమంటారేమండీ. ఇది కన్యాదాతగృహం. ఇక్కడ మావూరి సాంప్రదాయానికి కట్టుబడి వుండవలసిందే మీరు." దీనిమీదట విశ్వేశ్వరుడికి, పెళ్ళికొడుకు తండ్రికీ మాటమీద మాటవచ్చి వుద్రేకాలు రెచ్చిపోయినయి. ఇంతలో హరి జోక్యం కలుగజేసుకుని, "ఈయనగారి తతంగం అంతా చూస్తుంటే ఈయనవచ్చింది పెళ్ళికికాదు నగల మూటలు, రూపాయలసంచీ వీపునవేసుకుని వెళ్దామన్నట్లుగావుంది." పెండ్లికొడుకు తండ్రికి కొంచెం అనుమానమేసింది "ఇంతకూ కన్యాదాత ఎవరూ?" అని ప్రశ్నించాడు.

విశ్వేశ్వర్, "ఈయన పేరు హరి. పెళ్ళికూతురు అన్నయ్య ఈయనే దానికంతటికీ పూచీ" అని విసురుగా ఎదురుగా నిలబడ్డ హరిని చూపెట్టాడు.

"సరె, సరె, మరీ మంచిది. అయితే మీతో మరోమాట చెప్పాలనుకుంటున్నాను. మరి ఈ రహస్యం ఇప్పుడుదాకా బయట పెట్టారు కాదేం? నా కీసంగతి ముందే తెలిసుంటే అసలీ సంబం

ధానికి ఒప్పుకునేవాణ్ణే కాదు. అయిందేదో అయిపోయింది, ఇంకా ఒక్క వెయ్యిరూపాయిలిస్తే ఈ సంబంధానికి మేము తల ఎగ్గేస్తాం. నువ్వు చాలా మంచివాడివిలాగా కన్పిస్తున్నావ్. సజాతి వాళ్ళను మచ్చతేవాలనికాదు నా వుద్దేశం" అంటూ హరిని సంబోధించి అన్నాడు పెళ్ళికొడుకు తండ్రి.

ఈ మాటలకు విశ్వేశ్వరుడు వుగ్రుడై గర్జించాడు, "ఇంకా ఏం రూపాయిలు? మొత్తానికి పెద్దపెద్ద వుచ్చులే పన్నుకొచ్చారే మమ్మల్ని యిరికించడానికి. ఇంతకూ పెళ్ళి చేసికోవడం మీ కిష్టమా లేదా? ముందు ఆవిషయం తేల్చి చెప్పండి."

"నువ్వెవరవోయ్ మధ్యలోవచ్చి తల దూర్చడానికి. ఏవైపు చుట్టానివోయ్ నువ్వు? వుప్పులో కలిసిన చుట్టానివా, పప్పులో కలిసిన చుట్టానివా? నేను మాట్లాడేది కన్యాదాతతోగాని నీతో కాదు. నీకేం సంబంధమోయ్?" అన్నాడు క్రోధంగా పెళ్ళికొడుకుతండ్రి. హరి భయపడుతూ, "మహాశయా! వీరే మా కార్య భారాన్నంతా నిర్వహించే పెద్దలు. దాతలు. మీరేది చెప్పాలన్నా వారికి చెప్పాలసిందే" అన్నాడు.

"మీదంతా కపటనాటకంగావుందే. ఇంతకూ కళ్యాణ కర్త ఎవరో ఇంతవరకూ తెలియకుండావుంది. గౌరవంగల కుటుంబమనుకుని మోసపోయాం హరేరాం హరేరాం. ఇదంతా తెలిస్తే యింకా ఈ కుటుంబంతో ఇంకెవరైనా సంబంధంచేస్తారా?" అంటూ చెవులుమూసుకున్నాడు వరునితండ్రి.

"చెప్పండి, మీరు చెప్పదలచుకుంది నాతో చెప్పండి" అంటూ విశ్వేశ్వర్ ముందుకొచ్చాడు.

"అయితే ఇంతవరకూ ఈ మాయాజాలమంతా ఏమిటి మీరు పన్నింది? ఈ కపటనాటకం దేనికి? ఇక నేను సాఫీగా చెప్పేస్తున్నా. ఇంకా ఒక్క వెయ్యిరూపాయలు యిస్తారా ఇచ్చెయ్యండి, లేకపోతే మీసంబంధం మేము వదులుకుంటాం" అని రాయి గుద్దాడు వరునితండ్రి.

"అట్లా అడగడం మీకు న్యాయమేనా? మీకిస్తామని ఒప్పుకున్నంతసొమ్ము మీకు ముట్టజెప్పామంటూరా, లేదా? ఆడపిల్ల వారిని అంత అన్యాయం చేయడం తగదండి" అన్నాడు విశ్వేశ్వర్.

"మీ దింత అపవిత్రమైన కుటుంబమని నాకేం తెలుసు మొదట్లో? పెళ్ళికూతురు అక్కయ్యబుద్ధి మంచిదికాదటగా, విషం మ్రింగి ఆత్మహత్య చేసుకుందని తెలిసింది."

విశ్వేశ్వరుని నేత్రాలు ఎరుపెక్కినయ్. రోమాలు నిక్కబొడిచినయి. కోపోద్రేకంతో గర్జించాడు, "యిక నోరుమూయండి. ఆత్మహత్య చేసుకుందని ఏపాపిష్ఠి నూరిపోశాడు? జాగ్రత్తగా మాట్లాడండి."

"జాగ్రత్తగా కాక అజాగ్రత్తగా మాట్లాడిందేముంది నేను? సరే చూస్తా నువ్వేంచేస్తావో? లేరా పోదాం" అని కొడుకును పెళ్ళిపీటలమీదనుంచి లేపాడు.

"మీరు నిజంగా పెళ్ళిచేసుకోడానికే వచ్చారా? లేక దర్జా చెలాయించడానికి వచ్చారా? ఎవరిమీద మీ బెదరింపులన్నీ? చూస్తాను మా పిల్లకు పెళ్ళి ఎట్లా కాకపోతుందో?" అన్నాడు గట్టిగా విశ్వేశ్వర్.

వరునితండ్రిని శాంతపరచాలని కొంతమంది పెద్దలు గట్టిగా ప్రయత్నించారు. కాని లాభంలేకపోవడం గమనించి ఆ పెద్దలే విశ్వేశ్వరుదగ్గరకెళ్ళి "విశ్వేశ్వర్, ఆ పెద్దమనిషికి ఎంతో చెప్పాం! కాని లాభంలేకపోయింది. ఏదో యింతఖర్చుపెట్టావ్. ఇంత కట్నం యిస్తున్నావ్. ఒక్క వెయ్యిరూపాయలదగ్గర లోభించడం దేనికి? పోనీ ప్రస్తుతానికి నీ చేతిమీదుగా ఆ వెయ్యిరూపాయలు కూడా యిచ్చేయ్. కావాలంటే మనవూరివాళ్ళమంతా చందాలు వేసుకుని వెయ్యిరూపాయలు వసూలుచేసి నీకు సర్దుతాం. లగ్నం వేళ దగ్గరకొచ్చింది. ఇక అది కాస్తా దాటనివ్వకు" అన్నారు.

ఇల్లంతా గందరగోళంగావుంది. ఎక్కడిమేళ తాళాలక్కడ ఆగిపోయినయ్. ఇంటిలోపల ఆడవాళ్ళంతా చిత్రకారునిబొమ్మల్లాగా నిలుచున్నచోటనే నిలబడిపోయారు. తనప్రక్కనే ఓ స్త్రీ

మూర్ఛపడివుండడం ఆమెకు అన్నపూర్ణ ఉపచారం చేస్తూవుండడం విశ్వేశ్వర్ గమనించాడు. "విశూ! యిలారా! ఇవిగో ఈ వెయ్యిరూపాయలు తీసుకెళ్ళి, ఇక ఆలస్యంచేయక లగ్నం జరిపించు" అంది అన్నపూర్ణ, విశ్వేశ్వరునిపిలిచి.

మూర్ఛపోయినస్త్రీ జాహ్నవి అని తెలుసుకున్నాడు విశ్వేశ్వర్. హరికూడా ప్రక్కనే భయం భయంగా నిలబడి పిచ్చివాడులాగా ఏమిాతోచక అటూఇటూ చూస్తున్నాడు. హరి ప్రక్కనే సావిత్రి నెత్తిముసుగుచాటున ముఖందాచుకుని నిలబడి వుంది. ఇదంతా చూచినతరవాత ఆఖరుసారిగా నచ్చచెప్పడానికి ప్రయత్నించి విశ్వేశ్వర్ అన్నాడు, "ఏమండీ! నే చెప్పేదికూడా మీరు దయచేసి వినండి. పెళ్ళికూతురు అక్కయ్య దేవతాస్వరూపిణి. ఆమె స్వర్గస్తురాలైంది. ఆమెవిషయంలో లేనిపోని అపోహలు సృష్టించి ప్రచారంచేయదలచిన దుర్మార్గులు ఈలగ్నాన్ని కాకుండాచేసి మమ్మల్నందర్నీ అవమానపరచి తాము సంతోషించాలని మీకు లేనిపోనిచాడీలు చెప్పివుంటారు. అవన్నీ వట్టి కల్పనలు. అవన్నీ నమ్మకండి. మీకు నేను యిక ఒక్కరూపాయకూడా ఎక్కువ యివ్వదలచలేను. ఇక మీ యిష్టం."

పెళ్ళికొడుకువైపు వచ్చిన బంధువుల్లో ఆందోళన ఎక్కువయింది. హరి నిశ్చేష్టుడై కంట తడిపెట్టి అన్నాడు, "విశూ, అన్యాయ్. ఏమిటిదంతా. నాకంతా అగమ్యగోచరంగావుంది. ఎట్లాగైనా సరుబాటుచేసుకుందాం అన్నాయ్."

విశ్వేశ్వర్ పౌరుషంగా అన్నాడు, "హరీ, నీకేం తెలియదు. నువ్వూరుకో. ఒక్క రాగిదమ్మిడీకూడా వాళ్ళకిక ముట్టజెప్పడానికి వీల్లేదు. నేను పెళ్ళికొడుకునే ముఖాముఖిగా ఒకమాట అడగాలనుకుంటున్నాను" అని పెండ్లికొడుకువైపు తిరిగి, "ఈవేళ మీకు దానంచేస్తున్న వస్తువు ఒక అమూల్యమైనరత్నం. మీకు తెలివితేటలుంటే ఆ రత్నానికి ఎంత విలువగలదో, ఆ రత్నానికి ఎంత ఉజ్వలమైన భవిష్యత్ వుందో ఆలోచించిచూడండన" అని పెళ్ళికొడుకును ప్రశ్నించి సావిత్రిదగ్గరకువెళ్ళి నెత్తిమీది ముసుగుతొలగించి పెళ్ళి

కొడుకువైపుగా త్రిప్పి నిలబెట్టి, "చూడండి. యిప్పుడాలోచించుకోండి యీ రత్నం ఎంత అమూల్యమైందో?" అన్నాడు.

"మా తండ్రిగా రుండగా నేనేం చెప్పలేను" అని గంభీరంగా మాట్లాడాడు పెళ్ళికొడుకు. పెళ్ళికొడుకు తండ్రికి కోపమొచ్చి, "రారా, పోదాం యిక వాళ్ళకి పెండ్లి చేయాలనిలేదు. డాబు దర్పాలు చూపించాలనివుంది" అన్నాడు కొడుకుని.

పరోపకారబుద్ధిగలవాళ్ళు విశ్వేశ్వరు దగ్గరకెళ్ళి "విశ్వేశ్వర్, నీ పనేమీ బాగుండలేదు! కొంచెం ఆలోచించిచేయి ఏది చేసినా" అన్నారు.

"నేనంతా ఆలోచించుకునే చేశాను" అన్నాడు విశ్వేశ్వర్. కొంతమంది యిస్త్రీపురులు పెండ్లికొడుకు తండ్రిదగ్గరకు సమీపించి, "మహాశయా! నరికులంవారిని రచ్చకీడ్చడం ఈ శుభసమయంలో మీకు మర్యాదగాదు. ఏదో అనుకున్న మాటలప్రకారం పోనివ్వండి. ఇచ్చినదానితో తృప్తిపడండి" అని నచ్చచెప్పారు. పెళ్ళికొడుకు తండ్రిచేత తల ఎగరవేయించడానికి తలప్రాణం తోకకువచ్చింది పెద్దలందరికీ. పెండ్లికొడుకుతండ్రి గట్టిగా మాట్లాడాడు, "సరే, యిక యీ గోలా రద్దీ అంతా మేము రద్దుచేసుకుంటున్నాం, సజాతీయుణ్ణి. మర్యాదస్తుణ్ణి, పెద్దమనుషులందరిముందూ రచ్చకీడ్చి నానారభసచేయడం మర్యాదకాదని నాకూ తెలుసు. సరే ముందనుకున్న మొత్తానికే మేమూ ఒప్పుకుంటున్నాం. హారీ, పెళ్ళికూతుర్ని పెండ్లికొడుకుని తీసుకొచ్చి పీటలమీద కూర్చోపెట్టమను యిక. అయితే విశ్వేశ్వర్, జరిగిందానికి నువ్వేమీ అనుకోవద్దు. జరిగిందంతా మరచిపోదాం మనమంతా, ఏం, సరేనా?"

విశ్వేశ్వర్ శిలాప్రతిమలాగా నిశ్చలంగా నిలబడి నిర్భయంగా అదురూ బెదురూలేకుండా అన్నాడు, "మీరు నాకిక చెప్పవలసిందేమీలేదు. మీ అబ్బాయిని మీరిక తీసుకెళ్ళవచ్చు.

ఇంత రభస, ఇంత అమర్యాద ఘట్టం జరిగినతరువాతకూడా యిటువంటి ఛండాలుడికిచ్చి కన్యాదానం చేసేవాళ్ళుకూడా

ఛండాలురే, నీచులే, మహాపాపులే. ఎటువంటి పరిస్థితుల్లోను ఈ పెళ్ళి జరుగదు. మీరిక శలవుతీసుకోవచ్చు.''

ఇది విన్నవారందరి ప్రాణాలు ఒక్కసారిగా లేచిపోయినయ్. తాను చెప్పింది తప్పక విశ్వేశ్వర్ చేసితీరుతాడని అందరికీ తెలుసు. పెళ్ళికొడుకు పక్షంవారు దీనిని అవమానంగా భరించి ఒక్కరొక్కరే యింటినుంచి బయటి కెళ్ళిపోయారు.

రామ్‌తను చల్లగా విశ్వేశ్వరుదగ్గరకొచ్చి "విశ్వేశ్వర్, నువ్వు మనస్సు మార్చుకోవాలి లేకపోతే భట్టాచార్య కుటుంబం నట్టేట మునగవలసివస్తుంది. నువ్వు వూఁ...అంటే ఇప్పుడే వాళ్ళం దర్నీ కాళ్ళావేళ్ళా పడి బయటనుండి పిలుచుకొస్తా'' అని బ్రతిమిలాడాడు.

"నట్టేట మునగవలసిన అవసరమేముంది? ఇతడు కాకపోతే ఇంకొకడవుతాడు వరుడు. వరుడే దొరకడా?'' అన్నాడు విశ్వేశ్వర్.

"రెండోవరుడు ఈ రాత్రివేళ ఎక్కడ దొరుకుతాడు? ఎక్కడనుండి పట్టుకొస్తావ్ నువ్వు?'' అని ప్రశ్నించాడు రామతను.

"వెదకవలసిన అవసరమేమీలేదు. వరుడు మీ ఎదుటే వున్నాడు. వచ్చిన బంధువర్గానికి మర్యాదలు సలుపవలసిన భారమంతా మీకు వప్పగించాను. అది మీరు నిర్వహించండి. హరి మిగతా పనులు చూస్తాడు. మీరంతా పోయి మీమీపనులు నిర్వహించండి. నేనే వరుణ్ణి, పెండ్లిపీటమీద కూర్చోబోతున్నా'' అన్నాడు విశ్వేశ్వర్.

సాక్షాత్ ఆకాశాన్నుండి వజ్రాలవర్షం కురిసినా కలుగనంతటి ఆశ్చర్యం కల్గింది అక్కడ నిలబడి ఇదంతా చూస్తున్న జనసమూహానికి. అంతా ముక్కుమీద వేలేసుకున్నారు. దీనివల్ల స్వార్ధపరులవర్గం నిరాశజెందకపోలేదు. వాళ్ళు కన్న కలలన్నీ వమ్ముకాకపోలేదు.

జనసమూహంలోనుండి అన్నపూర్ణ విద్యుల్లతలాగా పరుగులెత్తుకుంటూవచ్చి కొడుకుని కౌగిలించుకుని ముద్దు పెట్టుకుంది ప్రేమతో. అక్కడనుండి విశ్వేశ్వర్ జాహ్నవిదగ్గరకెళ్ళి ఆమె పాదాలకు నమస్కరించి పెళ్ళిపీటలమీద కూర్చున్నాడు. హరి కన్యాదానకార్యక్రమం మొదలుపెట్టాడు. విశ్వేశ్వర్ సావిత్రి చేయిపట్టుకుని హరివైపు తలతిప్పి సైగ చేశాడు. సావిత్రికి ఆరోగ్యం బాగుండలేదు. స్పృహతప్పే పరిస్థితివచ్చింది. హరి సావిత్రివైపు చూచి ఆమెపరిస్థితి అంతా అర్థంచేసుకున్నాడు. త్వరత్వరగా వివాహం పూర్తిచేశారు. లోపలినుండి ఎవరైనా రావలసిందిగా కేకవేశాడు. జాహ్నవి వెంటనే పరుగెత్తుకుంటూవచ్చి సావిత్రి తల తన ఒడిలోపెట్టుకూర్చుంది. ప్రక్కనుండి అన్నపూర్ణ పంఖా విసురుతూ సావిత్రిముఖంమీద కాస్త చన్నీళ్ళు చల్లింది. కొంచెం సేపటికి సావిత్రికి స్పృహ తెలిసింది. జాహ్నవి సావిత్రిని వుద్దేశించి, "ఏమిటమ్మా, ఏమయింది నే నివ్వాళే అగాధసముద్రంలోనుంచి ఓ అమూల్యరత్నాన్ని నీకోసం పొందగలిగాను" అన్నది. రెండు చేతులు తీసుకెళ్ళి తల్లిమెడలోవేసి సావిత్రి కన్నీరుకారుస్తూ "అమ్మా! అక్క యెక్కడ? అక్కయ్యనుకూడా పిలువండి" అన్నది.

# 17

కాలచక్రం గిర్రునతిరిగింది. విశ్వేశ్వరుడి పెళ్ళయి అప్పుడే రెండు సంవత్సరాలు కావచ్చింది. వైశాఖమాసంవచ్చింది. విశ్వేశ్వరుని తోటలో చెట్లన్నీ చిగిర్చి పూలుపూసి నవనవలాడుతూ సుగంధ పరిమళాన్ని నలుదిశలా వెదజల్లుతున్నాయి. చిగురుటాకులు తిని మత్తెక్కిన కోయిలలు చెట్టుకొమ్మల్లోనుండి కుహూ కుహూలు సలుపుతూ తోటంతా ప్రతిధ్వనింపజేస్తున్నాయి. తేనెటీగలన్నీ ఝుయ్ ఝుయ్ మని ఝుంకారంచేస్తూ మధుసంగ్రయన కార్యకలాపాల్లో లీనమైనయి. సాయంకాలపు చల్లగాలికి కాబోలు ఆనందంతో తలలూపుతున్నయ్ చెట్లన్నీ. పచ్చని చీరెధరించి ముసిముసి నవ్వులు నవ్వుతూవుంది సుందరప్రకృతిమాత.

పిల్లతెమ్మెరల చల్లదనానికి మైమరచి చెట్టక్రింద కూర్చుని కావ్యపఠనంలో లీనమయ్యాడు విశ్వేశ్వర్. పెద్ద కాగితాలకట్ట చంకలో పెట్టుకుని విశ్వేశ్వర్ ముందుకొచ్చి నిలబడి, "బాబూ!" అని పిలిచాడు గుమాస్తా.

"ఏమిటి విషయం ? పని ఎంతవరకొచ్చింది ?" అని ప్రశ్నించాడు విశ్వేశ్వర్ తల పైకెత్తి గుమాస్తావైపుచూస్తూ.

"పని దాదాపంతా పూర్తయినట్లే. లెక్కల కాగితాలు కాస్తా చూడండి. మనం వూహించినదానికంటె కొంచెం ఎక్కువగానే ఖర్చయేటట్లుగావుంది."

"సామాన్యంగా అనుకున్నదానికంటె ఖర్చు ఎక్కువగానే వుంటుంది. ఆ లెక్కపనంతా యింటివద్ద చూద్దాం. ఇంటికిపోదాం పద" అంటూ విశ్వేశ్వర్ లేచి నిలబడ్డాడు.

ఈ సుందరప్రకృతిమధ్య ఇంటివ్యవహారాల జటిలసమస్యాపరిష్కారాల్లోపడడం అతనికి మనస్కరించలేదు.

భర్తాగ్రేసరురాలు అన్నపూర్ణ. కొడుకు పెళ్ళిచేసినతరువాత తనజీవితమంతా దైవచింతనలోనే గడిపివేయాలని కలలుకనేది

ఎన్నో సంవత్సరాలనుండి. భగవంతునికృపవల్ల కళ్యాణం నెట్టు కొచ్చి విశ్వేశ్వర్‌కి ఆ రెండుగింజలు నెత్తినపడడంతో ఆనంద పరవశురాలై మందిరనిర్మాణం తలపెట్టింది అన్నపూర్ణ. మందిర నిర్మాణకార్యమంతా విశ్వేశ్వర్ నిర్వహిస్తూవస్తున్నాడు.

రెండుసంవత్సరాలక్రితం ఏరోజు విశ్వేశ్వర్ పెళ్ళయిందో ఈ సంవత్సరం సరిగా ఆదేరోజున నూతనంగా తయారుచేస్తున్న మందిరంలో దేవతాప్రతిమ ప్రతిష్ఠించబడాలనే దృఢసంకల్పంతో తల్లీ కొడుకు లిద్దరూ మందిరనిర్మాణకార్యాన్ని చురుకుగా సాగి స్తున్నారు.

ఈ రెండుసంవత్సరాలకాలంలో ఎన్నోమార్పులు వచ్చినయి. విశ్వేశ్వర్ సావిత్రిని పంచప్రాణాల్లాగా చూచుకుంటున్నాడు. సావిత్రినివదిలి ఒక్క క్షణం వుండలేకపోతున్నాడు. సరససల్లాపాల్లో ఆనందంగా కాలం ఎలా వెళ్ళిపోతుందో కూడా వాళ్ళు గమనించి నట్లు లేరు. సావిత్రి 'విశూ అన్నాయ్' అనడం మానేసి 'స్వామీ' అని సంబోధించడం నేర్చుకుంది.

అన్నపూర్ణకు ఈప్సితార్థం నెరవేరినందుకు ఆమె సంతోషా నికి పట్టపగ్గాలేకుండాపోయినయ్. చదువుకున్న బుద్ధిమంతురాలైన కోడలు లభించింది. ఊళ్ళో అందరి అబ్బాయిల్లాగానే తన కుమా రుడుకూడా ఒకయింటివాడయ్యాడుకదా అని లోలోన ఎంతో ఆనందించేది అన్నపూర్ణ. నిత్యం కోడలిచేత రామాయణభారతాలు చదివించుకుని సాయంకాలపుపూట కాలం వెళ్ళబోస్తూండేది.

ఒకనాడు సాయంత్రం యింటివసారాలో కూర్చుని అత్తా కోడళ్ళు రామాయణపారాయణంలో లీనమైవున్నారు. విశ్వేశ్వర్ ఒంటరిగా గదిలోపడుకుని పుస్తకాలపేజీలు తిరగేస్తున్నాడు. అతని కళ్ళల్లో ఆనందజ్యోతి తళుక్కున మెరిసింది. శరీరమంతా పులకించి పోయింది. అతనిలో నూత్నచైతన్యం పొడచూపింది. పుస్తకం నుండి ఒక పెద్ద ఉత్తరం క్రిందపడడం గమనించాడు. అది సతి

రాసిన అంతిమలేఖ. పూర్వసంఘటలన్నీ ఒక్కసారిగా స్మృతి పథంలో మెరిసినయ్యాతనికి.

"అధమజాతిగా మీరు పరిగణించే నారీజాతినే మీరు పంచ ప్రాణాలతో ప్రేమించే రోజువస్తుంది. స్త్రీజాతి హృదయంచాటున ఎంత అగాధ విశాల జలరాశి యిమిడివుందో ఆనాడు మీరే గ్రహించగలరు. ప్రేమపూరిత ఆ స్నేహ సౌహార్ద్రాల్లో ఎంతసుఖం గలదో మీరే అర్థం చేసుకోగలుగుతారు." ఇదంతా కళ్ళకు కట్టినట్టగుపడింది. ఇదీ సతిపెట్టిన అంతిమశాపం. సతిని స్మరించి ఆ ఉత్తరాన్ని కళ్ళకద్దుకున్నాడు విశ్వేశ్వర్.

# 18

ఈ సంతోష సమయంలో సావిత్రికి మహాకష్టకాలం దాపురించింది. ఈ ప్రపంచంలో యితను నిర్వహించవలసిన పనులన్నీ నిర్వహించి యిక ఈ ప్రపంచంతో తనకేమీ పనిలేనట్లుగా జాహ్నవి అకస్మాత్తుగా గుండె ఆగిపోవడంవల్ల యిహలోకాన్ని వదలివెళ్ళింది. ఈవార్త వినంగానే హృదయంపగిలిపోయే దిగులేసుకొచ్చింది సావిత్రికి. కాని అమ్మ,అక్కయ్య,నాన్నవాళ్ళదగ్గర కెళ్ళిందని,అక్కడ నుండి ఈ లోకంలో తానుగడిపే సుఖజీవితాన్ని పరలోకంలో నుండే తిలకించి ఆమెకూడా సంతోషసాగరంలో మునగగలదని ఆలోచించి ఆనందాశ్రువులు రాల్చి దిగులుమానింది సావిత్రి.

హరిశంకర్‌కూ పెళ్ళయింది. ఇక తనకాపురం స్థితిగతులు స్వయంగానే చక్క దిద్దుకుంటున్నాడు. అక్కయ్య లేకపోతే 'కాళీ'కి ఆదొక బెంగగావుండేది. అందుకని ఎప్పుడూ అక్కయ్యగారింటివద్దే వుంటుంటాడు. భట్టాచార్యగారిల్లిప్పుడు నిత్యకళ్యాణం పచ్చతోరణంగా సుఖసౌభాగ్యాలకు నిలయమైంది.

తనవూరు పిలిపించిన చేనేతమగ్గాలవారిని ఎంతో ప్రోత్సాహపరచి చేనేతపరిశ్రమను ఎంతో వృద్ధిచేశాడు విశ్వేశ్వర్. అన్నిచోట్లా గిరాకీ ఎక్కువైంది చేనేతవస్త్రాలకు.

ఈ వృత్తివల్ల అనేక బీదవారికి పనిపాటలు చూపగల్గి వారి సుఖజీవనానికి తోడ్పడగలిగానని విశ్వేశ్వర్ ఎంతో సంతృప్తి జెందేవాడు.

అన్నపూర్ణ చిరకాలవాంఛితాన్ని పాటించి విశ్వేశ్వర్ తలపెట్టిన మందిరనిర్మాణం పూర్తయి అందులో దేవతాప్రతిమ ప్రతిష్ఠాపనకూడా జరిగింది. ప్రతిష్ఠాపనరోజున గొప్ప ఉత్సవంజరిగింది. అనేకమంది బీదప్రజలకు అన్నదానం చేయబడింది. ఆరోజే హరిజనులకు దేవాలయప్రవేశం కల్పించబడింది. ఆవేళ దేవతామందిరం

నలువైపుల యిసుకవేసిన రాలనిజనం తండోపతండాలుగా వచ్చి చేరారు. ఈ భోజనాల హడావుడీ, గందరగోళం అంతా సర్దు మణిగిన తరువాత కొడుకును దగ్గరకుపిలిపించుకుని, "నాయనా, నారుపోసినవాడు నీరుపోయకుండా వుంటాడా అన్నట్లు రాతిలోని కప్పకుసైతం ఆహారాన్నిచ్చినట్లుగా మానవుని సృష్టించినతరువాత వాడికి భోజనసదుపాయం కలుగజేయకపోడు భగవంతుడు. కాని, విశూ, నిరయమానవసమాజపు నిష్ఠురగౌరన్యపూరిత అత్యాచారా లకు ఎంతోమంది బలైపోతున్నారు. వారికష్టాలకు అంతులేకుండా వుంది. భగవంతుడిచ్చినవరకూ నేనింతగా సంపత్తిని కూడబెట్ట గలిగాను. తమకడుపున పుట్టిన కూతుళ్ళ వివాహశుభకార్యాలు నెరవేర్చలేక సతమతమయ్యే బీదలకు తోడ్పడి శక్తిలేనివారికి పెళ్ళిళ్ళు చేయించడానికి వినియోగించు. ఇంతకంటె నాకిక కావలసిన పుణ్యమేముంది? ముక్కుపచ్చలారని ముద్దుబిడ్డలను, తమను కని పెంచి పెద్దచేసిన తలిదండ్రుల కటిక దారిద్ర్యంవల్ల, కోరలుచాచి భగ్గుభగ్గున మండిపడే అగ్నికుండాల్లోపడి శలభంవలె మాడిపోకుండా వరకట్నరాక్షసికి వారు బలికాకుండా తప్పించడం కంటే వేరే కోరికేముంటుంది నాకు? ఇదే నా అంతిమకోర్కె. నా ఈ సంపత్తి కేవలం ఒక్క బాలిక కంటినుంచి కారే రెండు వేడికన్నీటిబొట్లయినా తుడిచివేయగలిగినట్లయితే నేనీకార్యంలో ధన్యురాలనయినానని భావిస్తా నాయనా" అన్నది.

అన్నపూర్ణ సంపాదించి యిచ్చిన సంపత్తికి "అన్నపూర్ణ ఫండ్" అను నామకరణం చేశాడు విశ్వేశ్వర్. ఆపేరు పెట్టవద్దని ఎంతగానో వారించింది అన్నపూర్ణ. కాని విశ్వేశ్వర్ వినలేదు.

అన్నదానం రోజున పెద్దపెద్ద పండితులకు కడుపునిండా అన్నంపెట్టి చేనేతవస్త్రాలే దానంచేశారు. సావిత్రి—అన్నపూర్ణ ముద్దుకోడలు—నేతపట్టుచీరెకట్టి సాక్షాత్ లక్ష్మిలాగా మందిరం ముందు పందిట్లో అందరికీ భోజనాలు వడ్డించడంలో లీనమైంది. సాయంత్రానికే పనులన్నీ పూర్తయి అంతా నిశ్శబ్దంగావుంది.

సాయంత్రం ఐదుగంటలైంది. సావిత్రి విశ్వేశ్వర్ ఒకరి ప్రక్క ఒకరు కూర్చుని కబుర్లుచెప్పుకుంటున్నారా యింటిపంచలో.

"సావిత్రీ! నేనివ్వాళ యింత తీరనిపనిపాటల్లో మునిగి వున్నా నాకు ఆనాటిమాటే జ్ఞప్తికివస్తూవుంది" అన్నాడు విశ్వేశ్వర్ సావిత్రివైపు చూస్తూ.

"ఏమాట స్వామీ?" అని అడిగింది సావిత్రి.

"అదే ఆనాడు, ఆ పెళ్ళివాళ్ళు అంత హంగామా చేయక పోతే పరిస్థితులు ఏవిధంగా వుండేయో?'

సావిత్రి స్నిగ్ధనేత్రాల్తో స్వామివైపు చూస్తూ, నేనూ అదే అనుకుంటూంటా అప్పుడప్పుడూ. అప్పుడు నాకేమీ తెలిసేదికాదు. నిర్జీవప్రతిమలాగా కష్టసుఖాలంటే ఏమిటో తెలుసుకోకుండా వున్నా అప్పుడు. ఒకవేళ ఆపెళ్ళి జరిగినా దానివల్ల కలిగే లాభనష్టాలసంగతి అప్పట్లో నాకు తెలిసివుండేదికాదు. అప్పుడు ఆ సంబంధానికే నన్ను ఇచ్చివుంటే నాతల్లి నాకష్టాలు చూడలేక కళ్ళుమూసుకుని సమస్త దుఃఖభారాన్నుండీ విముక్తి చెందిందని అనుకునివుండేదాన్ని. అప్పుడు నేను చాల అశక్తురాలనై చేసేది లేక విధిమీద భారంవేసి బరువుగా కాలాన్ని లాగవలసివచ్చేది" అన్నది.

విశ్వేశ్వర్ తదేకధ్యానంతో ఆమె ముఖారవిందాన్ని తిలకిస్తూ తనలో తాను అనుకున్నాడు, "అజ్ఞానాంధకారంలోపడి కొట్టుమిట్టాడుతున్న ఈ స్వామికి నువ్వు నూతన జీవితమార్గదర్శినివి కావలసినయోగంవుంటే ఆ చండాలుని కెలా భార్యవయేదానివి?" అని.

ఇదేసమయంలో పనిమొగ్గలాంటి చంటిబిడ్డను తీసుకొచ్చి, సావిత్రి ఒడిలోపెట్టి, "ఏడ్చి, ఏడ్చి పిల్లాడిగొంతు కాస్తా ఎండి పోయింది. పసిపిలాడి జోలే నీకు బొత్తిగా పటినటేలేదు. హాయ్

రాం! హాయ్ రాం!! ఇటువంటి తల్లిని వేనెక్కడా చూడలేదమ్మా" అన్నది అన్నపూర్ణ.

విశ్వేశ్వర్ సిగ్గుపడి దొడ్డివాకిలిగుండా రివ్వుమని పిట్టలాగా పరుగులుతీస్తూ తీస్తూ అన్నపూర్ణమందిరంలోపలికి ఆశాపూరిత నేత్రాల్తో తొంగిచూచాడు. ఆ మందిరంలో ప్రతిష్ఠాపించబడిన ప్రేమమయ దేవతాప్రతిమ పూర్ణ మాతృత్వస్వరూపిణిలాగా నిరంతర స్నేహసుధారసాన్ని వర్షింపజేసే చిరునవ్వు నవ్వుతూవుంది.

Printed at The Weldun Press, Madras-21.

